# ఇష్టంగానే వచ్చాను

## -మోనికా థాంప్సన్

**టాలీవుడ్ ఓ పుష్పక విమానం లాంటిది. ఎంత మంది వచ్చి చేరినా దానిలో ఇంకా చోటు ఉంటూనే ఉంటుంది. ఆ పుష్పక విమానంలో కొత్తగా వచ్చి చేరింది మోనికా థాంప్సన్. చాలా మంది హీరోయిన్లలాగానే మోనికా కూడా మోడలింగ్ నుంచి సినిమాల్లోకి వచ్చింది. సినిమాల్లోకి రావడం అనేది అనుకోకుండా కాకుండా ఇష్టంగా వచ్చాను అంటున్న మోనికా థాంప్సన్‌తో....**

**మీ గురించి...**

మాది గోవా. నాన్న నేవీ ఆఫీసర్. అమ్మ ఫ్యాషన్ డిజైనర్. తను హైదరాబాద్‌లో బొటిక్ నిర్వహిస్తోంది. ప్లస్ టూ అయిపోగానే ఫ్యాషన్ డిజైనింగ్‌లో చేరాను. అప్పుడే కొన్ని జ్యూయలరీ యాడ్స్‌లో నటించే అవకాశం వచ్చింది. కొన్ని ఫ్యాషన్ షోలలో కూడా పాల్గొన్నాను.

**బ్రదర్స్, సిస్టర్స్ ఎంత మంది?**

ఎవ్వరూ లేరు. మా పేరెంట్స్‌కి నేనొక్కదాన్నే

**మదర్ బొటిక్ చూసుకోకుండా సినిమాల్లోకి రావాలని ఎందుకు అనిపించింది?**

ఫ్యాషన్ డిజైనింగ్ చేసినా నటన మీద ఎక్కువ ఇష్టం ఉండేది. మోడలింగ్ చేస్తే మంచి అవకాశాలు వస్తాయనే ఉద్దేశంతోనే కొన్ని యాడ్స్ చేశాను. మోడల్‌గా నా ఫోటోలు ఫేస్‌బుక్‌లో చూసి 'ప్రేమికా' అనే సినిమాలో అవకాశం వచ్చింది. కానీ, కొన్ని కారణాల వలన ఆ ప్రాజెక్టు ఆగిపోయింది.

**సినిమాల్లోకి వస్తానంటే పేరెంట్స్ ఏమీ అనలేదా?**

ఫాదర్ పాజిటివ్‌గానే రెస్పాండ్ అయ్యారు. మమ్మీనే కొద్దిగా అభ్యంతరం చెప్పింది. ఇప్పుడు తను కూడా హ్యాపీనే!

**'అంపశయ్య' రెండవ సినిమానా?**

లేదు 'ప్రేమికా' షూటింగే జరగలేదు కాబట్టి ఇదే నా మొదటి సినిమా.

**ఇందులో అవకాశం ఎలా వచ్చింది?**

ఫేస్‌బుక్ ద్వారానే నాకు అవకాశం వచ్చింది. నా ఫోటోలు చూసి డైరెక్టర్‌గారు ఆడిషన్‌కి పిలిచారు. అలా ఈ సినిమాలో అవకాశం వచ్చింది.

**నటన కోసం ప్రత్యేకించి శిక్షణ తీసుకున్నారా?**

లేదు. ముంబాయి వెళ్ళి అక్కడ ట్రైనింగ్ తీసుకుందామని అనుకుంటున్న సమయంలోనే 'అంపశయ్య' సినిమాలో అవకాశం వచ్చింది. ఆ ఆలోచన విరమించుకుని షూటింగ్‌కి అటెండ్ అయ్యాను.

**షూటింగ్ సమయంలో మీ వెంట ఎవరు ఉంటారు?**

తోడు ఉండాలని ఏం లేదు. ఎవరికి వీలైతే వారు ఉంటారు. ఇద్దరికీ వీలు కాకపోతే నేనొక్కదాన్నే వెళ్ళిపోతాను.

**మొదటిసారి షూటింగ్‌లో పాల్గొన్నప్పుడు భయం అనిపించలేదా?**

కోరుకున్న ఫీల్డే కదా? భయం కాదు కానీ, కొద్దిగా బెరుకుగా అనిపించింది. రెండు మూడు రోజులు షూటింగ్ జరిగాక అలవాటైపోయింది. ఫ్యాషన్‌షోలలో పాల్గొన్న అనుభవం ఉండడంతో కొత్తగా అనిపించలేదు.

**ఖాళీ సమయాల్లో....?**

బైక్ రైడింగ్ అంటే చాలా ఇష్టం. నాకు స్నేహితులు ఎక్కువే! కొద్ది ఖాళీ దొరికినా వారితో స్పెండ్ చేస్తుంటా. ఎక్కువగా అందరం కలిసి బయట ట్రిప్పులకి ప్లాన్ చేసుకుంటాం. ఇప్పుడూ అదే చేస్తున్నా.

**మిగతా హీరోయిన్లలాగా ఎక్సర్‌సైజ్ అవీ చేయరా?**

ఎందుకు చేయను? అది చాలా ముఖ్యం. దాని తరువాతే మిగతావన్నీ. రోజూ రెండు మూడు గంటలు తప్పనిసరిగా వ్యాయామం చేస్తా.

**తెలుగు ఒక్కటేనా? ఇతర భాషల్లో కూడా చేస్తున్నారా?**

అవకాశాలు బాగానే వస్తున్నాయి. తమిళంలో, కన్నడంలో ఒక్కో సినిమా ఒప్పుకున్నాను. ఇంకా షూటింగ్ ప్రారంభం కాలేదు.

**తెలుగులో సినిమాలు ఒప్పుకున్నారా?**

కథలైతే విన్నాను. ఇంకా వేటికీ ఓకే చెప్పలేదు.

**ఎక్స్‌పోజింగ్‌కి పరిమితులు పెట్టుకున్నారా?**

ఇది గ్లామర్ ఫీల్డు. ఎంతో కొంత ఎక్స్‌పోజింగ్ తప్పనిసరి. దానికి సిద్ధపడే వచ్చాను. ఎక్స్‌పోజింగ్ పేరుతో అసభ్యంగా కనిపించమంటే మాత్రం నా వల్ల కాదు. పరిమితమైన ఎక్స్‌పోజింగ్‌కు నేను ఎప్పుడూ సిద్ధమే!

**'అంపశయ్య' సినిమా గురించి చెప్పండి**

ఈ సినిమాలో ఇద్దరు హీరోయిన్లు ఉన్నారు. నేను ఫ్లాష్‌బ్యాక్‌లో వచ్చే పాత్రలో కనిపిస్తాను. ఎక్కువ భాగం పద్ధతిగానే కనిపిస్తాను. ఒకటి రెండు సీన్లలో మాత్రం అల్ట్రా మోడ్రన్‌గా కనిపిస్తాను. ఈ సినిమా గురించి ఇంతకంటే ఇప్పుడు ఎక్కువ చెబితే బాగుండదు.



-భరత్ కుమార్

## సరదాగా

### అనగనగా...ఓ వ్యాసం!

ఓ సినిమా స్టార్ కొడుకుని స్కూల్లో 'బీద కుటుంబం' అనే విషయం మీద వ్యాసం రాయమన్నారు టీచర్. సదరు కొడుకుగారు రాయడం మొదలెట్టాడు. అనగనగా...ఒక బీద కుటుంబం. ఆ కుటుంబంలో తండ్రి చాలా బీదవాడు. తల్లి కూడా ఎంతో పేదది. పిల్లలు కూడా అంతే. వాళ్ళ కారు డ్రైవరు, వాళ్ళ తోటమాలి, వంటమనిషి పాపం అందరూ పేదవారే. చివరకు వాళ్ళ ఇంట్లో పనిచేసే నౌకరు కూడా పేదవాడే. ఒకరోజు వాళ్ళు పాపం తినడానికి తిండి లేక కారులో బయలుదేరారు.

### ఒక ప్రశ్న?

"ముక్తికి మార్గం ఈ దివ్యక్షేత్రం. శనిదోషాలు, కాలసర్ప దోషాలు ఉన్నా, కష్టాలు కన్నీళ్ళు కడతేరాలన్నా దివ్యక్షేత్రంలో అడుగుపెట్టండి చాలు, అన్నీ పటాపంచలవుతాయి" అన్న ప్రకటన చూశాడు ఓ భక్తుడు. వెంటనే కొంత నగదు తీసుకుని దివ్య క్షేత్రానికి వెళ్ళాడు. ఆ క్షేత్రంలో వరుసగా తొమ్మిది దేవాలయాలు ఉన్నాయి. ఒక్కో ఆలయానికి వంద మెట్లు. ఒక్కో ఆలయం మెట్లు ఎక్కుతూ మెట్టుకొక రూపాయి జారవిడుస్తున్నాడు భక్తుడు. గర్భగుడిలోకి వెళ్ళిన తరువాత తన దగ్గర మిగిలిన డబ్బులో సగం తీసి హుండీలో వేస్తున్నాడు. తిరిగి గుడి మెట్లు దిగేటప్పుడు కూడా మెట్టుకొక రూపాయి నాణేన్ని పడేస్తున్నాడు. ఇలా ప్రతి ఆలయంలోనూ చేశాడు. ఎక్కేటప్పుడూ, దిగేటప్పుడూ ఒక్కో మెట్టుపై రూపాయి పడేయటం, గుళ్ళోని హుండీలో మిగిలిన దాంట్లో సగం డబ్బులు వేయడం...ఇలా చేసుకుంటూ పోయాడు. తొమ్మిది గుళ్ళూ అయిపోయాక, కిందకి వచ్చి చూసుకుంటే జేబులో ఒక్క రూపాయి కూడా మిగల్లేదు. ఇంతకీ ప్రశ్న ఏమిటంటే అతడు ఆ క్షేత్రానికి వచ్చేటప్పుడు ఎంత మొత్తం నగదు తీసుకొచ్చాడు? ఇంకెందుకు ఆలస్యం, లెక్కలు కట్టండి. ముందునుంచి వస్తారో, వెనుకనుంచి వస్తారో చూసుకుని సరిగ్గా లెక్క వేయండి.

### సమాధానం

ఆ భక్తుడు తీసుకొచ్చిన నగదు మొత్తం 1,46,900 రూపాయలు.

తొమ్మిది ఆలయాల దర్శనం పూర్తయ్యేసరికి జేబులు ఖాళీ. అంటే తొమ్మిదో ఆలయం మెట్లు దిగేముందు మెట్టుకో రూపాయి చొప్పున అతని దగ్గర వంద రూపాయలున్నాయి. హుండీలో వేసే ముందు ఉన్నదాంట్లో సగం వెయ్యాలి కనుక వందకు రెట్టింపు రెండు వందలు ఉంటాయి. మెట్లు ఎక్కేటప్పుడు ఇంకో వంద. అంటే తొమ్మిదో ఆలయం ఎక్కేముందు మొత్తం మూడు వందలు అతని దగ్గర ఉన్నాయి. ఇలాగే వెనుకనుంచి ముందుకు లెక్కగడుతూ వెళితే అసలు మొదటి గుడి ఎక్కేటప్పుడు అతని దగ్గర ఉన్న మొత్తం ఎంతో తెలిసిపోతుంది. అప్పుడు ఆ మొత్తం 1,46,900 అని ఇట్టే చెప్పేయవచ్చు. ఇదే లెక్కని వేరే రకంగా కూడా చేయవచ్చు వీలైతే!

Jayadev

# అడపా దడపా నవ్వుల్లో

వదిన గారికి జబ్బు చేసిందా... నోరు వంకర పోయింది పాపం?
ఏమ్లేదే... ఫ్లూటు ప్రాక్టీసు చేసి చేసి అలా ఐంది!

నోటితోటి హార్మోనియము వయొలిన్‌తో వీణా వాయించే విద్వాన్ అన్నానే.. ఆయనే.. ఈయన!!






ముఖచిత్రం: ఉత్తమ నటి కంగనా రనౌత్

**రచనలు, కథలు పంపవలసిన చిరునామా**

నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33. email: navyaweekly@andhrajyothy.com




### నా గోల నాది!

బాక్సింగ్ పోటీలు జరుగుతున్నాయి. బాక్సర్లు ఇద్దరూ ఒకరిని ఒకరు కొట్టుకుంటున్నారు. కేకలేస్తూ వారిని ఉత్సాహపరుస్తున్నారు ప్రేక్షకులు. ఓ నడి వయసు ప్రేక్షకుడైతే మరీ రెచ్చిపోయి అరుస్తున్నాడిలా.

"కొట్టు! గట్టిగా కొట్టు! దెబ్బకి నోటి పళ్ళన్నీ రాలి పోవాలి."

గమనించిన పక్క వ్యక్తి, అతన్నిలా అడిగాడు.

"ఇందాకటి నుంచీ చూస్తున్నాను, మీది ఒకటే మాట! కొట్టు! గట్టిగా కొట్టు! దెబ్బకి పళ్ళన్నీ రాలిపో వాలంటున్నారు. బాక్సింగంటే మీకు అంత పిచ్చా?"

"పిచ్చా? పాడా? నా గోల నాది. నేను డెంటిస్ట్‌ని."

### వాగుడు

"అదిగో! అక్కడ బ్లూజీన్సూ, రెడ్‌కలర్ పొట్టి షర్టూ వేసుకుని నిల్చుని ఉందే ఓ శాల్తీ, ఆ శాల్తీ అబ్బాయో అమ్మాయో తెలియడం లేదు."

"అమ్మాయే! ఆ పిల్ల నా కూతురు."

"మీ అమ్మాయని తెలియక వాగేశాను. క్షమిం చండి సార్."

"సారేంటి సార్! నేను ఆ పిల్ల తల్లిని."

### లోకజ్ఞానం

"మా వాడు లెక్కల్లో గ్రేటేగాని, లోకజ్ఞానంలో పూర్‌రా."

"ఎలా చెప్పగలవు?"

"ఎలా అంటే...మొన్న 400/2, గాంధీనగర్, ముంబాయి అని అడ్రస్ చెబితే వాడేం రాశాడో తెలుసా?"

"ఏం రాశాడు?"

200, గాంధీనగర్, ముంబాయి అని రాశాడు. లోకజ్ఞానం బొత్తిగా లేదు."

### దొంగలు

దబదబామని గోడ దూకుతున్నట్టుగా ఒకటే శబ్దాలు. అలాగే కింద హాల్లో కూడా అవీ ఇవీ అటూ ఇటూ జరుపుతున్నట్టుగా ఒకటే శబ్దాలు. లేచి చూశాడు సుబ్బారావు. జనం గుంపులు గుంపులుగా కనిపించారు.

"ఎవరయ్యా మీరు?" అడిగాడు సుబ్బారావు.

"దొంగలం"

"దొంగలా!" ఆశ్చర్యపోయాడు సుబ్బారావు. అడిగాడిలా.

'దొంగలంటే ముచ్చటగా ఒకరో ఇద్దరో వస్తారు. ఇంతమందేంటయ్యా? కొత్త సినిమా టిక్కెట్ల కోసం కొట్టుకు ఛస్తున్నట్టు?"

"బాగా చెప్పారు కానీ, నిజానికి వీళ్ళంతా దొంగలే! మా దొంగలబడిలో జాయినయ్యి కోర్సు కంప్లీట్ చేశారు. ప్రాక్టికల్స్ కోసం మీ ఇంటికొచ్చారు." అన్నాడు సూటూ, బూటులో ఉన్న వ్యక్తి.

-వైనతేయ

www.navyaweekly.com

నవ్య

సంపుటి: 13 సంచిక: 7

20-4-2016

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎస్.జగన్నాథశర్మ



మొదటి పేజీ

# దొంగ! దొంగ!

సిటీసెంట్రల్! పెద్దమాల్! దాని ముందు నిల్చున్నాడతను. అరవై డెబ్బయి ఏళ్ళుంటాయతనికి. పొడుగ్గా సన్నగా ఉన్నాడు. నలిగిపోయిన ప్యాంటూ, షర్ట్‌లో ఉన్నాడు. కళ్ళద్దాలు కూడా ఉన్నాయి. అయితే అందులో ఓ అద్దం పగిలిపోయి ఉంది. ఓ అద్దంలోంచే చూడగలుగుతున్నాడతను. వచ్చే మనుషులూ, పోయే మనుషులూ అందరినీ గమనిస్తున్నాడు. మాల్‌లోనికి ప్రవేశించేందుకు ధైర్యం చాలడం లేదతనికి. కళ్ళు మూసుకున్నాడు. ఆంజనేయుణ్ణి ప్రార్థించాడు. శక్తి పుంజుకున్నట్టనిపించింది. లోనికి నడిచాడు. మెయిన్‌డోర్ దగ్గర సెక్యూరిటీ చెక్ అయింది. తడిమి తడిమి చూసిందతన్ని. బొమికలు తప్ప ఏమీ తగల్లేదు. లోనికి పంపించింది.

నీతో కష్టం నాన్నా! అమ్మ నీతో ఎలా వేగిందో కాని, మా వల్ల కావట్లేదు. ప్లీజ్! నేను గొడవ చేసి నిన్ను గెంటక ముందే నువ్వు ఈ ఇంట్లోంచి వెళ్ళిపో! తిండి ఎవరు పెడతారు? మందులెవరు కొంటారు? తోడు ఎవరుంటారని పిచ్చి పిచ్చి చూపులతో నన్ను ప్రశ్నించకు! సమాధానం చెప్పే ఓపికా, తీరికా నాకు లేవు. వెళ్ళిపో! వెళ్ళిక్కణ్ణుంచి నీకు దండం పెడతాను అన్నాడు కొడుకు. చేతులు జోడించి నమస్కరించాడు. దీవించాలనిపించింది కాని, దీవించలేకపోయాడతను. ఇంట్లోంచి బయటపడ్డాడు. ఎక్కడికి వెళ్ళాలి? ఎవరు పోషిస్తారు? ఎవరు ఆదరిస్తారు? ఆలోచిస్తూ మాల్‌ని చేరుకున్నాడతను. సీసీ కెమెరాలన్నీ అతన్నే గుచ్చి గుచ్చి చూస్తున్నాయి. కెమెరాలతో పాటు సేల్స్‌బోయ్స్, గర్ల్స్ కూడా అతన్నే పట్టి పట్టి చూస్తున్నారు. కావాల్సింది అదే! ఆలస్యం చేయకూడదనుకున్నాడతను. ఓ రిస్ట్‌వాచీ దొంగిలించాడు. జేబులో వేసుకున్నాడు. అలాగే ఓ ఖరీదైన పెన్నును కూడా దొంగిలించాడు. జేబులో వేసుకున్నాడు. ఇంకా ఏదో దొంగిలిద్దామనుకున్నంతలో దొరికిపోయాడు. సెక్యూరిటీ పట్టుకుంది. దొంగన్నారతన్ని. తిట్టారు. కొట్టారు. ముందు పళ్ళ మీద బలంగా దెబ్బపడిందేమో! గాయం అయింది. రక్తం కారుతోంది.



ఎవరు నువ్వు? ఏ ఊరు? ఈ వయసులో ఇదేం బుద్ధి? చెప్పు, చెప్పన్నారు. దేనికీ సమాధానం లేదు అతని దగ్గర నుంచి. మూగా? అనుమానం కలిగింది. చాచి లెంపకాయ కొట్టారు. అమ్మో అన్నాడతను. మూగ కాదు. కావాలనే ఏదీ చెప్పడం లేదన్నారు. ఏం చేద్దాం అన్నారు? అదే మాటని గుమిగూడిన కస్టమర్స్‌ని కూడా అడిగారు. పోలీసులకి అప్పజెప్పండి అన్నారంతా ముక్తకంఠంతో. అప్పుడతను అంత బాధలోనూ సన్నగా నవ్వాడు.

దొంగతనము చేయరాదు! సత్యమునే పలుకవలెను! పెద్దలయెడల గౌరవము కలిగి ఉండవలెను...పిల్లలకు చెప్పిన పాఠాలన్నీ గుర్తొచ్చాయతనికి. పిల్లలు పాఠాలు వల్లె వేస్తోంటే పొంగిపోయేవాడతను. తన శిష్యులు డాక్టర్లు కావాలి. ఇంజనీర్లు కావాలి. పెద్దపెద్ద పోలీసు ఆఫీసర్లు కావాలనుకునేవాడు తప్ప, తానేం కావాలో, భవిష్యత్తులో తానెలా బతకాలో ఎన్నడూ ఆలోచించలేదు. ఎప్పుడూ ఇలాగే భార్యాబిడ్డలతో సరదాగా సంతోషంగా గడిచిపోతుందనుకున్నాడు. అనుకున్నవన్నీ జరగవు కదా! భార్య పోయింది. పెద్ద కొడుకు అమెరికా పోయాడు. చిన్న కొడుకే ఆధారమయ్యాడు. జీవనాధారం, మొన్న మొన్నటి వరకూ ట్యూషన్లు చెప్పాడతను. కాణీ పరకా సంపాదించాడు. ఇప్పుడు చెప్పే ఓపిక లేదు. సంపాదన లేదు. పైగా చక్కెరవ్యాధి తినేస్తోందతన్ని. ఆకలి! అన్నం కావాలి. చక్కెర వ్యాధి. మందులు కావాలి. మందులతో పాటు మాట్లాడే మనిషి కావాలి. ఎవరు మాట్లాడతారు? ఎవరికి కావాలి తను? పనికిరాని పాత కుర్చీ. హాల్లో అనవసరం. పారేయడమే సుఖం. ఆ పనికే పూనుకున్నాడు కొడుకు. అతన్ని ఇంట్లోంచి విసిరేశాడు.

వీధిన పడ్డ అతను బాగా ఆలోచించాడు. సమస్యకి పరిష్కారం లభించింది. పని చెయ్యమంటారు. చేస్తాడు. చేసిన పనికి ఇంత అన్నం పెడతారు. బాగా లేకపోతే మందులు కూడా ఇస్తారు. మాటామంతికీ ఒకరో ఇద్దరో మనుషులు ఉంటారు. చాలు! అంతకన్నా కావాల్సిందేముంది? అన్ని రకాలుగా తనకి జైలే క్షేమం అనుకున్నాడతను. దొంగ అయ్యాడు.

నవ్య




## నీ నవ్వే చాలు!

ముక్కు మీద కోపం, నీ ముఖానికే అందం... అంటూ పొగిడేస్తుంటారు. కానీ అదే ముక్కు మీద కోపం కొన్ని అనర్థాలకూ దారితీస్తుంది. సంయమనం కోల్పోతే సమస్యలు కొని తెచ్చుకోవాల్సి వస్తుంది. ఇలాంటి అనుభవమే మహేశ్వర్‌కి ఎదురైంది.

ఢిల్లీకి చెందిన పేరి మహేశ్వర్, ఒక ఆదివారం సరదాగా గడుపుదామని భార్యాబిడ్డలసహా ఢిల్లీ హాట్‌కి వెళ్ళాడు. అప్పటికే పార్కింగ్ ప్లేస్ నిండిపోయి ఉంది. కారు పార్క్ చేయడానికి ఎక్కడా స్థలం కనిపించలేదు. మొత్తానికి అటూ ఇటూ తిరగ్గా, ఓచోట పార్కింగ్ స్లాట్ కనబడింది. ఆ స్లాట్‌లోకి కారు తీసుకెళ్ళేలోగా, వేరొక కారు సర్రున దూసుకొచ్చి ఆ స్లాట్‌లో ఆగింది. అంతే, మహేశ్వర్‌కి ఆగ్రహం కట్టలు



తెంచుకుంది. నిగ్రహం కోల్పోయాడు. పార్క్ చేసి తిరిగ్గా వస్తున్న ఆ కారు డ్రైవర్‌ని చొక్కా పట్టుకుని నాలుగు బాదాడు. ఆ డ్రైవర్ కూడా కొట్టడం మొదలెట్టాడు. ఇద్దరూ బాహాబాహీగా తలపడసాగారు. చొక్కాలు చిరిగాయి. పెదాలు పగిలాయి. ఒంటిమీద రక్తం చారికలు కట్టింది. జనం మూగారు. మహేశ్వర్ శ్రీమతి భయపడి ఇద్దరి మధ్య దూరి, భర్తని కారు దగ్గరకు లాక్కొని వచ్చేసింది. కారులో బలవంతంగా కూర్చోబెట్టింది. అప్పటికీ కోపం తగ్గలేదు మహేశ్వర్‌కి. పళ్ళు పటపటమంటున్నాయి. పిడికిళ్ళు అలానే బిగుసుకుని ఉన్నాయి. కొంచెం తేరుకుని తన ఎనిమిదేళ్ళ కొడుకు వైపు చూశాడు. వణుకుతున్నాడు వాడు. మహేశ్వర్‌కేసి భయంగా చూస్తున్నాడు. అప్పుడుగాని అతడు చేసిందేమిటో తెలిసిరాలేదు. కొడుకు ముఖం చూడగానే నీరసం ఆవహించింది. సిగ్గనిపించింది. వెంటనే తిరుగు ప్రయాణమయ్యారు. సండే మొత్తం అప్‌సెట్ అయింది. ఇంటికెళ్ళాక, సోఫాలో కూర్చుని ఆలోచిస్తూ ఉండిపోయాడు. భార్య అతని పక్కన కూర్చుని ఓదార్చసాగింది. జరిగిన సంఘటన అంతా ఒక్కసారి కళ్ళ ముందు కదలాడింది. గట్టిగా ఏడ్చేశాడు అతడు. "ఇంతకుముందు కొడుకు దృష్టిలో తానొక హీరో, ఒక రోల్‌మోడల్! కానీ ఇపుడు? తల్లిదండ్రుల అడుగుజాడల్లోనే పిల్లలు నడుస్తారు. వాళ్ళ ప్రవర్తన మీదే పిల్లల ప్రవర్తన కూడా ఆధారపడి ఉంటుంది. ఇంత చిన్న విషయాన్ని తానెలా మర్చిపోయాడు?" ఆలోచించసాగాడు. అప్పుడే ఓ బలమైన నిర్ణయం తీసుకున్నాడు, 'ఇంకెప్పుడూ అలా ప్రవర్తించకూడదని, చిరునవ్వుతో అన్నిటికీ సమాధానం చెప్పాలని!' అంతేకాదు, తనలాగా ఎవరూ ప్రవర్తించవద్దు అంటూ హితబోధ చేస్తున్నాడు మహేశ్వర్. తల్లిదండ్రులూ ఆలోచించండి!

# మెయిల్ బాక్స్

### కర్తవ్యం చెప్పిన మార్నింగ్ కాఫీ

నారాయణ..పిచ్చి నారాయణ అయిన వైనాన్ని మార్నింగ్ కాఫీ కింకర్తవ్యాన్ని గుర్తుచేయడం గమనార్హం. డబ్బున్న మారాజులు అందరూ మనసున్న మారాజులై కంచిగరుడసేవకే సిద్ధమైతే ఎంత బావుంటుందనుకున్నాం మొదటిపేజీ చదివాక. అద్భుతం సాధించాలంటే ఆత్మవిశ్వాసాన్ని మించింది లేదని విజయవిలాసం ద్వారా గ్రహించాం. నటనానుభవం లేకపోతే సీనుపండదంటున్న జెన్నీగారితో శృతి కలుపుతున్నాం. గాడ్ ఫాదర్ కథాకర్త వాణిశ్రీగారికి అభినందనలు.

కస్తూరి మురళీకృష్ణగారి క్రైమ్ కథలు ప్రతి వారం ఫాలో అవుతున్నాం. సీతగారి ఇంటర్వ్యూ నచ్చింది.

*-నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం-41*

### పిల్లలకు పఠనం అలవాటు చెయ్యాలి

'పుస్తకం ఒక నేస్తం' వ్యాసం చదివి 'ప్రపంచ బాలల పుస్తక దినోత్సవం' జరుపుతారని మొదటిసారిగా తెలుసుకున్నాం. ఇలాంటివాటిద్వారా జనాన్ని జాగృతం చేయాలి. వెనుకటి రోజుల్లో అమ్మమ్మ, నాయనమ్మ, తాతల ద్వారా పిల్లలకు అద్భుత కథలు తెలిసేవి. అప్పట్లో బాలజ్యోతి, చందమామ కథలు,బొమ్మరిల్లు పుస్తకాలు విరివిగా వచ్చేవి. ఈ కథల ద్వారా పిల్లలు మేధావులయ్యేవారు. రాను రాను పట్టించుకోవడం లేదు. బాలసాహిత్యం చదవటం తగ్గింది. పిల్లలకు పఠనం అలవాటు చేయాలి. వారిలో మానసిక వికాసం కలిగించాలి.

*-సరికొండ శ్రీనివాసరాజు, హైదరాబాద్*

### మనసును కలచివేసింది

మొదటిపేజీ కంచిగరుడ సేవకు వృద్ధ దంపతుల్ని ప్రేరేపించిన ఏడుపులాంటి పిచ్చి నవ్వు నవ్విన వృద్ధుని వ్యధ మనసును కలచివేసింది. విదేశాల్లోనే సుఖం ఉందని బిడ్డల్ని అక్కడికి పంపేసి పిచ్చిగా ఇక్కడ ఒంటరిగా మిగిలిపోయే వారిని చూసి జాలిపడాలా? వారి స్వయం కృతానికి కోపగించుకోవాలా?

*-జె.ధర్మతేజ, గొడారిగుంట*

### చిత్రమేమరి!

మొదటిపేజీ చిన్న కథ 'టోపీ బాబాయి' విలక్షణంగా ఉంది. ఎక్కడి నుంచో వచ్చి ఎందుకు వచ్చాడో తెలియకుండా బతికి ఆశలేకుండానే సంపాదించి...ఆత్మానందం దొరకగానే అన్నీ వదిలేసి వెళ్ళిపోవడం లౌకిక దృష్టిలో చిత్రమేమరి! ఇలాంటి వాళ్ళు అప్పుడప్పుడు మనకి తారసపడుతూనే ఉంటారు. నేరం చేస్తే జంతువైనా జైలు కెళ్ళాల్సిందే వ్యాసం ఆసక్తికరంగా ఉంది. చట్టం దృష్టిలో అందరూ సమానులేకదా! నాజర్ ఇంటర్వ్యూ ఆసక్తికరంగా ఉంది.

*-డి.శ్రీనివాసదీక్షితులు, నరసరావుపేట*

### నవ్యవీక్లీ కోసం ఆత్రం

నాజర్, అంజలి, ఆదాశర్మ ఇంటర్వ్యూలు, తారల ముచ్చట్లు ముచ్చట గొలిపాయి. ఎమ్మెస్ నిజమైన పబ్లిక్ హీరో అని నిరూపించాడు తన పెళ్ళితో. కమల్‌భాయ్ ఫుట్‌పాత్ బడి, లేడీ కమెడియన్ నీతి పల్టా అవమానాలు, పిల్లలకు రేడియేషన్ ఎఫెక్ట్, నవ్వు తెప్పించే ఫోబియాలు రిపీటెడ్‌గా చదివించాయి. జంతువులకూ తప్పని జైలుశిక్ష వ్యాసం ప్రత్యేకంగా ఉంది. చెత్తవస్తువులతో మ్యూజియం, జైలులాంటి హోటల్ సురభిలో ఆస్వాదించాం. రోజుకో యాపిల్, గర్భిణికోసం నెలవారీ చిట్కాలు ఉపయుక్తం. నవ్య వీక్లీకోసం ఆత్రంగా ఎదురుచూసేది ఈ సందడుల కోసమే.

*-తాళాబత్తుల సత్యనారాయణమూర్తి, విశాఖపట్నం*

### ఆనందమార్గం అదిరింది

ఆనందానికి ఎనిమిది మార్గాలు వ్యాసం చదివించింది. నిజమే. ప్రస్తుతకాలంలో నిజంగా ఆనందంగా నవ్వు ముఖంతో ఉండేవారు చాలా తక్కువమంది. ప్రతివారూ చదివి ఆరోగ్యం కోసం ఈ చిట్కాలు నిత్య జీవితంలో పాటించాలి. ముద్దు పెట్టేటప్పుడు కళ్ళు ఎందుకు మూతలు పడతాయో తెలిసింది.

*-వల్లీకుమారి, హైదరాబాద్*

### ఆపద్బాంధవులే కావాలి

సంపదను సద్వినియోగం చేసుకునే దంపతులు 'కంచిగరుడసేవ'లో భార్యాభర్తలు. పేదవారికి, తోటివారికి తమకున్నదాన్ని పంచిపెట్టి సమయానికి ఆదుకునే ఆపద్బాంధవులే మనకిప్పుడు కావాలి.

*-ప్రేమ్, మియాపూర్, హైదరాబాద్*

### కాశీయాత్రలో ఇంకెన్ని మలుపులో

కంరుగాడి కాశీయాత్రలో ఇంకెన్ని మలుపులుంటాయో! భూతాల పంతులు దంపతులకు పసికందును అప్పజెప్పడంలోని పరమార్థం వారిని బతికించేందుకే. గంగాహారతి ఘట్టం కోసం ఎదురుచూస్తున్నాం.

*-టి.భాను, మచిలీపట్నం*

### పిచ్చి నారాయణ

నిజానిజాలు చెప్పే మెషీన్ చెబితేగానీ నారాయణ ఎక్కాల్సిన విమానం వెళ్ళిపోయిందని తెలియలేదు. ఆ మెషీన్ నిఖార్సైనదేననీ, నారాయణ పిచ్చినారాయణనీ తేలిపోయింది.

'పుస్తకం మంచి నేస్తం' పిల్లలు పుస్తకాలు కంపల్సరీగా చదవాలని చెప్పినవ్యాసం.

*-ప్రకాష్, విశాఖపట్నం*

### ఇదెక్కడి న్యాయం

నేరం చేసిన జంతువుల్ని జైలుకు పంపిస్తున్నారు సరే. కానీ జైలు కెళ్ళిన మనుషుల్ని మాత్రం వదిలేస్తున్నారు. ఇదెక్కడి న్యాయం. జంతువులు కాబట్టి అవి శిక్ష తగ్గించమని అర్జీలు పెట్టుకోలేవు.

*-కృపాచార్య, ఏలూరు*

## హెచ్ఐవి ఉన్నా జీవితంపై భరోసా

**హెచ్ఐవి** గురించి చాలా మందికి సరియైన అవగాహన ఉండదు. ఇది రోగనిరోధక వ్యవస్థను దెబ్బతీయడం ద్వారా అవకాశవాద వ్యాధులు వచ్చేలా చేస్తుంది. అంటే చిన్న వాతావరణ మార్పులకే జలుబు చేయడం, జ్వరం రావడం, టీబీ సోకడం, విరేచనాలు కావడం జరుగుతుంది. హెచ్ఐవి శరీరంలోకి ప్రవేశించగానే ఎటువంటి మార్పులు కనిపించవు. కొన్ని సంవత్సరాల తరువాత వ్యాధికి సంబంధించిన లక్షణాలు ప్రారంభవవుతాయి. అంటే సీడీ 4 కణాల సంఖ్య తగ్గిపోయిన తరువాత వ్యాధి లక్షణాలు కనిపిస్తాయి. జ్వరం, తలనొప్పి, కండరాల బలహీనత, విరేచనాలు కావడం వంటి లక్షణాలు బయటపడతాయి. కొన్నేళ్లు గడిచిన తరువాత వైరస్‌ల సంఖ్య పెరగడం మొదలయిందంటే రోగనిరోధక వ్యవస్థ దెబ్బతిన్నదని అర్థం చేసుకోవచ్చు. అప్పటికీ చికిత్స తీసుకోనట్లయితే వ్యాధి క్రమంగా అడ్వాన్స్ స్టేజ్‌కు చేరుకుంటుంది. వేగంగా బరువు కోల్పోతారు. జ్వరం, తలనొప్పి, ఆకలి లేకపోవడం, నీరసం వంటి లక్షణాలు కనిపిస్తాయి. ముఖ్యంగా డయేరియా ఎక్కువ నష్టాన్ని కలగజేస్తుంది. ఈ సమయంలో అవకాశవాద ఇన్‌ఫెక్షన్లు ఎక్కువగా వస్తుంటాయి. సీడీ 4 కణాలు బాగా తగ్గిపోతాయి. టీబీ, కేన్సర్, న్యుమోనిమా వంటి వ్యాధులు వచ్చే అవకాశం ఉంటుంది.

**హోమియో చికిత్స :** హోమియో మందుల వల్ల రోగనిరోధకవ్యవస్థ తిరిగి బలపడుతుంది. సీడీ 4 కణాల సంఖ్య గణనీయంగా పెరుగుతుంది. అవకాశవాద ఇన్‌ఫెక్షన్లకు చోటు లేకుండా పోతుంది. ఆకలి బాగా పెరగడంతో బరువు పెరగడం ప్రారంభిస్తారు. హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా అందరిలాగే సాధారణ జీవితం గడిపే అవకాశం లభిస్తుంది.





## సయాటికా నొప్పికి ఇక గుడ్‌బై

కీళ్లనొప్పులకు సంబంధించిన వ్యాధులలో సయాటికా ఒకటి. శరీరంలో అతి పొడవైన నరం సయాటికా. ఇది తొడల నుంచి మోకాళ్లు, పిక్కల ద్వారా అరికాళ్లు, కాలివేళ్ల దాకా వ్యాపించి ఉంటుంది. వెన్నులో ప్రతి రెండు వెన్నుపూసల మధ్య కొంత ఖాళీ ప్రదేశం, ఒక సయాటిక్ నరం, పూసలను బంధించి ఉంచే కొన్ని కండరాలు ఉంటాయి. మన దైనందిన పనుల్లోని కొన్ని లోపాల వల్ల కొందరిలో ఈ పూసలను బంధించి ఉంచే కండరాలు బలహీనమవుతాయి. ఫలితంగా పూసల మధ్య సహజంగా ఉండవలసిన ఖాళీ తగ్గిపోతుంది. దీనివల్ల పూసల మధ్య ఉండే సయాటికా నరం ఒత్తిడికి లోనవుతుంది. దీనివల్ల ఆ నరం శరీరంలో ఎంత దూరం వెళితే అంత దూరం నొప్పి వస్తూనే ఉంటుంది.

### లక్షణాలు ఇలా ఉంటాయి

చాలా మందిలో కుడి వైపు నొప్పి ఎక్కువగా వస్తుంది. నడుము నొప్పి రావడం, కొద్దిగా శారీరక శ్రమ చేయగానే నొప్పి తీవ్రత పెరగడం, మొదట నడుము భాగంలో మొదలై క్రమేణా తొడ వెనక భాగానికి పాకుతుంది. తరువాత మోకాళ్లు, పాదాల చివరకు, పిక్కలు, మడమలకు వ్యాపిస్తుంది. కరెంట్ షాక్ కొట్టినట్లు నొప్పి వస్తుంది.

### హోమియో చికిత్స

నొప్పి ఏదైనా సమూలంగా తగ్గాలంటే హోమియో చికిత్స ఒక్కటే మార్గం. సయాటికా సమస్యలకు హోమియో వైద్య విధానంలో అద్భుతమైన చికిత్స అందుబాటులో ఉంది. హోమియో మందుల ద్వారా నడుము నొప్పిని పూర్తిగా దూరం చేయవచ్చు. వెన్నుపూసలో జరిగే మార్పులను నివారిస్తూ, కండరాలకు బలం చేకూరే విధంగా చికిత్స ఇవ్వడం వల్ల మంచి ఫలితం ఉంటుంది.

## హెపటైటిస్ బి, సి, హెర్పిస్‌లకు చెక్

**హెపటైటిస్...** ఈమధ్యకాలంలో చాలా మందిని భయపెడుతున్న వైరస్ ఇది. ఇతర జబ్బులకు చికిత్స కోసం వెళ్లినపుడు, అనుకోకుండా చేసిన పరీక్షల్లో హెపటైటిస్ ఉన్నట్లు భయటపడుతుంది. దాంతో ఇక తమ జీవితం ముగిసనట్టేనని నిర్ధారణకు వస్తారు. ఈ వైరస్ శరీరంలో నుంచి పూర్తిగా పోదని, దీర్ఘకాలంలో కాలేయం దెబ్బతినే అవకాశం కూడా ఉందని వైద్యులు చెప్పడంతో వాళ్లు ఆ నిర్ణయానికి వస్తారు. నిజానికి హెపటైటిస్ వైరస్‌ను కట్టడి చేసే మందులు హోమియోలో ఉన్నాయి. హెపటైటిస్ ఉందని నిర్ధారణ అయ్యాక భయపడకుండా హోమియో వైద్యం తీసుకుంటే ఆరోగ్యవంతమైన జీవితం గడిపే అవ కాశం దక్కుతుంది. ఆకలి వాంతులు వచ్చినట్టు అనిపించడం, ఒళ్లంతా నొప్పులు, మూత్రం పచ్చగా రావడం, కామెర్లు, చర్మంపైన దద్దుర్లు రావడం జరుగుతుంది. కడుపులో ఉబ్బరంగా ఉండటం, పొట్టలో నొప్పి వంటి లక్షణాలన్నీ హోమియో మందులతో దూరమవుతాయి.

**హెర్పిస్ సింప్లెక్స్ :** పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. సాధారణ పొక్కులే కదా అని వాటిని నిర్లక్ష్యం చేస్తారు. కానీ ఆ నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు మాదిరిగా తయారవుతాయి. పురుషుల్లోనే కాకుండా స్త్రీలలో కూడా యోని మీద చిన్న చిన్న పొక్కులలాగా వచ్చి ఎర్రగా మారి విపరీతమైన నొప్పి ఉంటుంది. ఈ సమస్యకు చికిత్స తీసుకోకుండా వదిలేస్తే అనేక ఇతర సమస్యలకు దారితీస్తుంది. శృంగార జీవితం దెబ్బతింటుంది. సుఖం దూరమవుతుంది. దంపతుల మధ్య గొడవలకు కారణమవుతుంది. అయితే హెర్పిస్ సమస్యకు హోమియో అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స అనంతరం వ్యాధి మళ్లీ తిరగబె ట్టడం ఉండదు. శృంగారజీవితం ఆనందమయం అవుతుంది.

## టాన్సిల్స్ సమస్య మళ్లీ రాదు

**టాన్సిల్స్** వాపు పిల్లల్లో సాధారణంగా కనిపించే సమస్య. ఒక్కోసారి పెద్దవాళ్లలో కూడా కనిపిస్తుంది. టాన్సిల్స్ రావడానికి ముఖ్య కారణం ఇన్‌ఫెక్షన్స్ స్ట్రెప్టోకోకస్ టపోజన్స్, హెచ్ ఇన్‌ఫ్లూయెంజ, స్ట్రెప్టోకోకస్ ఆరస్, స్ట్రెప్టోకోకస్ న్యుమోనియా వంటి బ్యాక్టీరియాల వల్ల టాన్సిల్స్ వచ్చే అవకాశం ఉంది. టాన్సిల్స్ వాపు బ్యాక్టీరియాపై ఆధారపడి ఉంటుంది. హైపర్‌కెరటోసిస్, టాన్సిలోలిత్స్, కాన్‌డిడియాసిస్, సిఫిలిస్ వల్ల కూడా టాన్సిల్స్ ఇన్‌ఫెక్షన్ల బారినపడతాయి. దీర్ఘకాలిక టాన్సిల్స్ వాపు ఉంటే గొంతునొప్పి, నోటి దుర్వాసన, గురక ఎక్కువగా పెట్టడం కనిపిస్తుంది. తరచుగా బాధిస్తుంటే క్రానిక్ టాన్సిలైటిస్ అని ఎక్యూట్ టాన్సిలైటిస్ అని రెండు రకాల టాన్సిల్స్ కనిపిస్తాయి. ఎక్యూట్ టాన్సిలైటిస్ బ్యాక్టీరియా, వైరస్ సంక్రమణం వల్ల వస్తుంది. బ్యాక్టీరియా కారణంగా వచ్చే దీర్ఘకాలిక టాన్సిలైటిస్‌లో టాన్సిల్స్‌పై చీము కూడా కనిపిస్తుంది.

**లక్షణాలు :** ప్రతి పది, పదిహేనురోజులకొకసారి దగ్గు, జలుబు లక్షణాలు కనిపిస్తాయి. వీటితోపాటు జ్వరం కూడా ఉంటుంది. గొంతునొప్పి ఉంటుంది. ఒక్కోసారి నొప్పి చెవి వరకు విస్తరిస్తుంది.నోటిలో దుర్వాసన వస్తూ ఉంటుంది. గురక, నిద్రలో నోటితో గాలిపీల్చుడం వంటి లక్షణాలు కనిపిస్తాయి. ఆహారం మింగడం కష్టమవడం, మెడ బాగంలోని లింఫ్ గ్రంథులు వాయడం వంటి లక్షణాలు ఉంటాయి.

**చికిత్స :** హోమియో మందుల వల్ల వాచిన టాన్సిల్స్ వాపు తగ్గి సాధారణ పరిమాణంకు వస్తాయి. అనారోగ్య టాన్సిల్స్ సాధారణ స్థితికి చేరుకొని సమర్థవంతంగా దేహరక్షణకు తోడ్పడతాయి. తరచుగా జలుబు, గొంతునొప్పి, జ్వరం రాకుండా శరీరంలో రోగనిరోధకశక్తి పెంపొందుతుంది. బ్రాంకైటిస్, సైనస్‌ల వాపు తగ్గిపోతుంది. ఆస్తమా వంటి శ్వాసకోశ వ్యాధులు రాకుండా నిరోధింపబడతాయి.



# కమనీయం సీతారామకల్యాణం

జానక్యాః కమలాంజలి పుటేః యా పద్మ రాగాయితాః
న్యస్తారాఘవ మస్తకేచ విలసత్కుంద ప్రసూనాయితాః
న్యస్తా శ్యామల కాయ కాంతి కలితాః యా ఇంద్ర నీలాయితాః
ముక్తాస్తాశ్శుభదా భవంతు భవతాం శ్రీరామ వైవాహికాః

అంటూ ప్రతి శుభలేఖలోనూ సీతారాముల కల్యాణ దృశ్యాన్ని వేస్తూ పై శ్లోకం రాస్తారు. వధూవరుల పెళ్లి సందర్భంలోనూ పురోహితులు చదివే లగ్నాష్టకంలోనూ ఆ వధూవరులకు ఎల్లప్పుడూ సీతారాముల ఆశీర్వాదం ఉండాలనే భావనతో తప్పనిసరిగా ఆ శ్లోకం చదువుతారు. రాముడు లేనిదే సీతాదేవి లేదు, సీతాదేవి లేని రాముడు లేడు.

కొత్తగా పెళ్లయిన దంపతులకు సీతారాముల అనుబంధమే ఆదర్శనీయం. సీతారాములవలె పదికాలాలు వర్ధిల్లండని ఆశీర్వదిస్తారు అందుకే. దాంపత్య జీవన విధానానికి ఆదర్శం సీతారాములు.

వసంత ఋతువులోని చైత్ర శుద్ధ నవమి తిథే శ్రీరామనవమి. అయితే మధ్నాహ్నం పూట వచ్చిన నవమి తిథిని మాత్రమే రామనవమిగా పరిగణిస్తారు. పునర్వసు నక్షత్రం, కర్కాటక లగ్నంలో, చైత్ర శుద్ధ నవమి గురువారం రోజు ఆ శ్రీమహావిష్ణువే శ్రీరామచంద్రుడుగా ఇక్ష్వాకువంశ తిలకమై అవతరించాడు. ఆయన జన్మ తిథి రోజునే సీతారాముల కల్యాణం జరగడం ఒక ప్రత్యేక విశేషం.

### శ్రీరామ నవరాత్రులు

రామాయణ ముఖ్య ఘట్టాలన్నీ చైత్రమాసం లోనే సంభవించాయి. రావణ సంహారానంతరం శ్రీరాముడు అయోధ్య చేరింది చైత్రమాసంలోనే. రాముడు రాజ్యలక్ష్మిని స్వీకరించింది ఉగాదిరోజే. అందుకే ఆరోజు నుంచి నవమి వరకూ ఆ

**ఏప్రిల్ 15 శ్రీరామనవమి సందర్భంగా...**

తొమ్మిది రోజులనూ రామ నవరాత్రులని పిలుస్తారు. ఈ నవరాత్రుల్లో రామాయణాన్ని పారాయణం చేయాలి. రామనవమి నాటికి పారాయణం ముగించి సీతారామకల్యాణం చేస్తారు.

### రమ్యమైనది రామనామం

భగవన్నామంలో రామ నామానికి ఉన్న శక్తి మహత్తరమైనది. ఓం నమో నారాయణాయ అనే అష్టాక్షరీ మంత్రంలోని ఐదవ అక్షరం 'రా', ఓం నమశ్శివాయ అనే శివ పంచాక్షరీ మంత్రంలోని రెండవ అక్షరమైన 'మ' కలయిక నుండి ఉద్భవించిందే రామ శబ్దం. సంసార సాగరాన్ని అవలీలగా దాటించేదే రామనామం. శ్రీరామ నామస్మరణతో సకల పాపాలూ నశించి సుఖ సంపదలు సమకూరుతాయి. ముమ్మారు రామనామ స్మరణ చేసినంతనే విష్ణు సహస్ర నామ స్తోత్రం పఠించినంత ఫలం లభిస్తుందని ఆ స్తోత్రం ఉత్తర పీఠికలోనే చెప్పబడింది.

**శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే**
**సహస్రనామ తత్తుల్యమ్ రామనామ వరాననే**

### ప్రజలపై ప్రభావం

భారతీయ వాఙ్మయంలో రామాయణం ఆది కావ్యంగా వాల్మీకి మహాముని ఆదికవిగా సుప్రసిద్ధం. 24,000 శ్లోకాలతో కూడిన రామాయణంలోని పాత్రలన్నీ ప్రజా జీవనంపై అనితర ప్రభావం కలిగించేవే. తండ్రీ కొడుకులు, భార్యాభర్తలు, అన్నదమ్ములు, యజమాని సేవకులు, మిత్రులు, రాజు ప్రజలు, భగవంతుడు భక్తుల మధ్య సంబంధబాంధవ్యాలు, ప్రవర్తనా విధానాలు రామాయణంలో చెప్పబడ్డాయి.

వాల్మీకి రామాయణం తర్వాత పేరెన్నికగన్నవి వేదవ్యాసుని ఆధ్యాత్మ రామాయణం, భవభూతి ఉత్తర రామచరితం. రామకథను ఎందరు గ్రంథస్థం చేసినప్పటికీ వాల్మీకి రామాయణమే ప్రామాణికం. పండిత సభల్లో, పవిత్ర కార్యాల్లో ఆదికవి వాల్మీకి ప్రార్థన నేటికీ కవి సంప్రదాయమే.

### విదేశాలలో

అన్ని భారతీయ భాషల్లో, ప్రాంతీయ భాషల్లో, సకల కళా ప్రక్రియల్లో ఆదరణీయమైనదీ, పూజనీయమైనదీ రామాయణ కావ్యం. ఇండోనేసియా, థాయిలాండ్, కంబోడియా, మలేసియా, వియత్నాం, లావోస్ సహా దేశదేశాలలో రామాయణ గాథ వ్యాప్తిలో ఉంది. ఇండోనేసియాలోని బాలీ దీవిలో రామాయణ నృత్యనాటకం నేటికీ ఎంతో ప్రసిద్ధి పొందిన ప్రక్రియ.

### రామస్య ఆయనం రామాయణం

ఆయనం అంటే గమనం, కదలిక. రామాయణం అంటే రామగమనం. అదే ధర్మ సంచారం. ఈ సృష్టి చక్రానికి మూలాధారం ధర్మ బలమే.

# తెలుగునాట ప్రత్యేక పండుగ శ్రీరామనవమి



చైత్ర శుద్ధ నవమి రాముని జన్మదినం. మన తెలుగురాష్ట్రాల్లో మాత్రం శ్రీరామ జన్మదినంతో పాటు, సీతారాముల కల్యాణం కూడా ఘనంగా నిర్వహించు కుంటాం. తెలంగాణ ప్రాంతంలోని భద్రాచలక్షేత్రంలో సీతారాముల కల్యాణ ఉత్స వాలు అంతర్జాతీయ ఖ్యాతినొందాయి. సీతారాములు నడయాడిన ప్రాంతంగా ప్రసిద్ధి పొందిన ఈ దివ్య క్షేత్రంలో వారి కమనీయ కల్యాణ వైభోగాన్ని కనులారా తిలకించేందుకు భక్తులు తరలివెళతారు. ఆంధ్రప్రదేశ్‌లో ఏకశిలా నగరంగా పేరు పొందిన ఒంటిమిట్ట శ్రీకోదండరామస్వామి దేవాలయంలో శ్రీసీతారామ కల్యాణం యేటా ఘనంగా నిర్వహిస్తారు. ఒకేశిలపై సీతారామలక్ష్మణ మూర్తులు ఉండడం ఇక్కడ విశిష్టత. రామాయణంలోని కొన్ని సన్నివేశాలు ఈ ప్రాంతంలో జరగాయన డానికి అనేక ఆధారాలు ఇక్కడ ఉన్నాయి. పోతన తన భాగవతాన్ని అంకిత మిచ్చింది ఆ స్వామివారికే అని కొందరు వాగ్గేయకారులు చెబుతున్నారు.

కంటికి కనిపించే ఈ జగత్తులోని సకల సుగు ణాలు, సుఖాలు శుభకర్మలు అనుసరించి ఉండేది ధర్మాన్నే. ధర్మలోపం జరిగిన మరుక్షణం అవన్నీ అదృశ్యమైపోతాయి. అందుకే ధర్మో రక్షతి రక్షితః అన్నారు. అందుకే శ్రీరామ పాదంలోని ప్రతి అడుగూ ధర్మ స్వరూపాన్నే ప్రతిబింబిస్తుంది.

### రామో విగ్రహవాన్ ధర్మః

జన్మబంధాలు లేని పరమాత్ముడు లోక కల్యా ణాన్ని కాంక్షించి నరుడై జన్మించాడు. ధర్మాన్ని ఆచరించి సమస్త లోకాలకు. ధర్మాచరణను చాటి చెప్పాడు.

### శ్రీరామావతారం

తాటక సంహారానంతరం శివ ధనుర్భంగం, సీతారాముల కల్యాణం జరిగింది. శివధనుర్భంగం, సీతాపరిణయ వేడుక స్వీయ శౌర్యపరాక్రమ సాఫల్యమేనని శ్రీరాముడు గర్వించలేదు.

**ప్రియా తు సీతా రామస్య దారాః పితృకృతా ఇతి**
**గుణాద్రూప గుణాచ్చాపి ప్రీతిర్భూయోభ్యవర్ధత**

తండ్రి దశరథుడు అంగీకరించిన వివాహ వేడుక కనుకనే రామునికి సీతపై ప్రేమ కలిగింది. సీత తన సౌందర్యము చేతనూ, సద్గుణముల చేతనూ రామునకు తనపై గల ప్రేమను ఇంకా వృద్ధి చేసింది అంటాడు వాల్మీకి. తనయుని వివాహ విషయంలో తండ్రిదే సర్వాధికారం అన్న వైదిక వివాహ ధర్మానికి కట్టుబడినవాడు శ్రీరా ముడు.

శ్రీరామ పట్టాభిషేక ముహూర్త నిర్ణయం జరిగింది కానీ అదే ముహూర్తానికి పదునాలు గేళ్లు వనవాసం చేయాలనే పినతల్లి కైక ఆదే శాన్ని శ్రీరాముడు చిరునవ్వుతో అంగీకరించాడు. నీకు మనఃస్ఫూర్తిగా అంగీకారమేనా? అని రాముని సమ్మతి కోరిన కైకకు, **'రామో ద్విరాభి భూషతే'** అని సమాధానమిస్తాడు శ్రీరాముడు. అమ్మా! ఈ రామునకు రెండు నాలుకలు లేవు. పితృవాక్య పాలనమే నా ధర్మం అని దాని తాత్పర్యం. ఒకే మాట, ఒకే బాణం, ఒకే ఆలి. ఇదే శ్రీరాముడు ఆచరించిన ధర్మం. మనసా వాచా కర్మణా ఒక్క టిగా ఉన్నప్పుడే ధర్మాచరణ సాధ్యం. ఈ ధర్మా చరణే శ్రీరాముడి యశస్సును అజరామరం చేసింది.

### ఆదర్శ సతి

**శ్రీరామ పత్నీ జనకస్య పుత్రీ సీతాంగనా సుందరకోమలాంగీ**
**భూగర్భజాతా భువనైక మాతా వధూవ రాభ్యాం వరదా భవన్తు**

## శ్రీరామనవమి వ్రతం



నవమినాడు ఉదయం శ్రీరామనవమి వ్రతాన్ని ఆచరించాలి. పూజామందిరం, ఇల్లు శుభ్రం చేయాలి. సీతారామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నుల చిత్తరువు లేదా శ్రీరామ ప్రతిమను పూజకు ఉపయోగించవచ్చు. రాముని సపరి వారంతో ఆవాహన చేసి, వివిధ రకాల పుష్పాలతో షోడపోపచార పూజ చేయాలి. నైవేద్యంగా పిండివంటలతో పాటు వడపప్పు, బెల్లం నివేదనం చేయాలి. కొందరు ఉపవాస నియమం పాటిస్తారు. నవమినాడు రాము నికి సంబంధించిన స్తోత్రాలు, భజనలు చేస్తూ జాగరణ చేయాలి. మరుసటి రోజు పునఃపూజతో ఉద్వాసన చేస్తే రామనవమి వ్రతం పూర్తవుతుంది.

సీతాదేవి గొప్పతనాన్ని వివరించిన శ్లోకం ఇది. అలాంటి ఆదర్శ జీవన విధాన స్ఫూర్తిని వధూవరులు సంగ్రహించాలి. వధువు తన పాత్రను సీతాదేవిలా సమర్థంగా నిర్వహించాలి.

అవతార పురుషులలో ఉత్తముడు, ఉదాత్తుడు శ్రీరామచంద్రుడు. అపురూపమైన ఆయన చరితం రామాయణం. 'సీతాయాశ్చరితం మహత్' అని వాల్మీకే స్వయంగా ప్రవచించాడు. ధర్మ కర్మ క్రియల్ని సీతారాములిద్దరూ అనుష్ఠించి చూపారు. శ్రీరామ విజయానికి కారకులైన స్త్రీలెందరో. వారందరిలో సీతాదేవే ప్రథమురాలు. ఆమె లేని రామాయణమే లేదు. ఈ సాంకేతిక యుగంలో తల్లిదండ్రులు చాలా మంది తమ పిల్లలకు సీత అనే పేరు పెట్టేందుకు ఇష్టపడటం లేదు. ఆమె పేరులోని పరమార్థాన్నీ, ఆమె గుణశీలాలను తెలుసుకుంటే వారిలో అలాంటి ఆలోచనే అంకు రించదు. మానవ జీవనంలో అనుకోని అవాంత రాలు, అందునా కుటుంబంలో వ్యక్తుల వల్ల ఇబ్బందులు సహజం. వాటిని ఎలా అధిగమిం చాలో, ఆచరించాలో, అనుభవించాలో స్వానుభ వంతో లోకాలకు చాటి శాశ్వత యశస్సుతో నిత్య స్మరణీయమెంది సీతాదేవి. అధర్మం పీచమణి చేందుకు సాగిన క్రతువులో సీతాదేవి పాతివ్రత్య ధర్మానికి ఎదురైన కడగండ్లను చక్కగా వర్ణించిన కావ్యం రామాయణం. శ్రీరామ చరితను తర తరాల పారాయణ గ్రంథంగా తీర్చిదిద్దిన దివ్య పాత్ర సీతాదేవి. ధర్మాచరణ వైశిష్ట్యమే ఆమెను అంతటి ఉన్నత పథానికి చేర్చిందన్నది లోక విదితం. వలదని వారించినా రాముని వెంట అర ణ్యాలకేగింది. పురుషచిత్తమెరిగిన గుణశీల. వీర్య శుల్క, భర్తతో కలిసి జీవించడమే సతీధర్మమని చాటిన ఇల్లాలు. జీవితంలో భార్యకు గల భాగ స్వామ్యాన్ని నిర్దేశిస్తూ రాముడికే హితోపదేశం చేసిన నేర్పరాలు. సుగుణాల రాశి సీత. కనుకనే

**'నేదానీం త్వదృతే సీతే స్వర్గోపి మమరోచతే'**

అంటూ ఆమె అనురాగాన్ని అభినుతించాడు శ్రీరాముడు.

**- దహగాం గోవిందరావు శర్మ**

# నీవు నాటిన విత్తు

ఆదెళ్ళ శివకుమార్



**సుబ్రహ్మణ్యంగాడు నాలుగు రోజుల్నించీ వాకింగ్‌లో కనబడటం లేదు. ఫోన్ చేస్తే రింగవుతుంది కానీ ఎత్తడం లేదు. టిఫిన్ చేశాక వాడిని చూద్దామని బయలుదేరాను.**

**మా కాలనీకి కొంచెం దూరంలో బ్రహ్మాండమైన ట్రిప్లెక్స్ కట్టుకుని దాంట్లో ఉంటాడు వాడు. ఇంట్లో ఉన్నాడో లేడో అనుకుంటూనే బయలుదేరాను. వాడూ నేనూ చిన్నప్పటి నుంచీ బాల్యస్నేహితులం. ఒకే ఊరు. ఒకటో తరగతి నుంచి డిగ్రీదాకా కలిసే చదువుకున్నాం. ఉద్యోగరీత్యా నేను చాలా ప్రాంతాలు తిరిగినా రిటైరైన తర్వాత సిటీ కొచ్చి స్థిరపడ్డాను.**

“వెయ్యి గజాల స్థలం కొనుక్కున్న వాడివి పెద్ద బిల్డింగ్ కట్టుకోకుండా ఈ చిన్న టూ బెడ్‌రూం ఇల్లేంటి? ఇన్ని మొక్కలు, చెట్లు ఇవన్నీ ఎందుకు పెంచుతున్నావు? టైంవేస్ట్. ముందు నాలుగు షాపులు కట్టించి అద్దెకిస్తే బోలెడంత డబ్బులొస్తాయి కదా! అయినా అసలు నిన్ను ఐఏయస్‌కు ఎవరు సెలక్ట్ చేశార్రా, ఈమాత్రం తెలీదా?” అంటూ నాకు క్లాసుల మీద క్లాసులు పీకుతూ ఉంటాడు.

నేను ఐఏయస్ ఆఫీసరుగా సెలక్ట్ అయిన రోజున మా నాన్నగారు ఓ మాట చెప్పారు. అది నాకింకా గుర్తుంది. “ఇదో కర్తవ్యం, బాధ్యత, అంతే. అధికార దర్పం ప్రదర్శించేందుకు మాత్రం ఎప్పుడూ ఉపయోగించుకోకు..” అని చెప్పాడాయన. ఆ వయస్సులో

ఆయన మాటల్లోని గొప్పదనం నేను అర్థం చేసుకోగలిగాను.

"నువ్వింత చాదస్తపుగాడివి కాబట్టి కానీ అదే నేను నీ పోస్ట్‌లో ఉండి ఉంటే సగం హైద్రాబాద్ కొనేసి ఉండేవాడిని." సుబ్రహ్మణ్యం తరచూ తన దృష్టిలో నా అసమర్థత, చేతకానితనాలను ఎత్తి చూపుతూ ఉంటాడు. నేను నవ్వి మౌనంగా ఉండి పోతాను. వాదనలు, సంభాషణల కారణంగా మను ష్యుల ఆలోచనలు, అభిప్రాయాలు మారవని నాకు తెలుసు.

అడుగు కూడా ఖాళీ ఉంచకుండా బ్రహ్మాండ మైన ఇల్లు కట్టుకుని కింద అంతా షాపులకు అద్దెకిచ్చాడు సుబ్రహ్మణ్యం. సిటీలో, చుట్టుపక్కల వాడికి చాలా ఇళ్లున్నాయి. స్థలాలు, వ్యాపారాల్లో వాటాలు, బ్యాంక్ బాలెన్సుల సంగతి నాకు చెబు తూనే ఉంటాడు. నేను విన్నట్లుగా నటిస్తూ ఊ కొడుతూ ఉంటాను కానీ బుర్రలోకి ఎక్కించు కోను. 'నేనింత సంపాదించాను' అని చెప్పి నాలో అసూయ రేకెత్తించడానికి. అసలు నాకంటూ ఆ భావం ఉండాలి కదా! "డబ్బు, ఆస్తులు సంపా దించడమే జీవిత పరమార్థం" కాదని నమ్మే నాకు ఎదుటివాడు ఈ భూమండలం మొత్తం కొనేసుకున్నాడని తెలిసినా పెద్ద రియాక్షన్ ఏముంటుంది?

మూడో అంతస్తులో ఉంటాడు వీడు. ఆరేళ్ల క్రితం చెల్లాయి పోయింది. అప్పటినుంచీ ఒంటరి వాడై పోయాడు. ఆవిడ బ్రతికున్న రోజుల్లో సంవ త్సరానికి రెండు సార్లయినా ఏదో ఒక గుడికో, తీర్థయాత్రకో బలవంతాన లాక్కుపోయేది. ఇప్పుడు అడిగేవాళ్లు లేరు కాబట్టి మరింతగా విజృంభించాడు.

"ఇంతకాలం ఎంత సంపాదించానో దానికి రెట్టింపు ఆస్తులు ఈ ఐదేళ్లలో కొనేశాను తెలుసా?" అంటూ ఉంటాడు గర్వంగా.

చాలాసేపు కాలింగ్ బెల్ కొట్టిన తర్వాత వచ్చి తలుపు తీశాడు. పీక్కుపోయిన ముఖం, లోపలికి లాగేసిన కళ్లు, పెరిగిపోయిన గడ్డం, ముఖమంతా పరుచుకున్న నీరసం..

"ఏంటీ ఒంట్లో బాలేదా?" ఆదుర్దాగా అడి గాను నేను లోపలకు అడుగుపెడుతూ.

నీరసంగా తలాడించి కూర్చోమన్నట్టుగా సోఫా చూపించాడు. "కనీసం ఓ ఫోన్ చేయచ్చు కదా! నేను ఫోన్ చేసినా నువ్వు రెస్పాండ్ కాలేదు. ఇప్పుడెలా ఉంది ఒంట్లో?"

నా ఎదురుగా సోఫాలో కూర్చున్నాక "పర్లేదు కొంచెం నిమ్మళంగా ఉంది. ఎందుకో మనస్సు బాలేక ఎవరి ఫోన్లూ ఎత్తలేదు. ఏమనుకోకు.."అన్నాడు అదే నీరసం నిండిన స్వరంతో.

నాకు చాలా ఆశ్చర్యం వేసింది. భార్య పోయినప్పుడు కూడా వీడు ఇంతగా నీర సించిపోవడం, డీలా పడటం నేను చూడ లేదు. అందులోనూ మనస్సు బాలేదంటున్నా డంటే "ఏం జరిగింది? ఎనీథింగ్ సీరియస్?"

నేను అడిగిన ప్రశ్నకు నావైపు ఓ క్షణం కళ్లా ర్పకుండా చూశాడు. ఆ తర్వాత 'కాఫీ పెట్ట మంటావా ఇద్దరికీ..' అన్నాడు. వాడు టాపిక్ డైవర్ట్ చేస్తున్నాడని నాకర్థం అయింది.

"నేనొచ్చింది కాఫీ తాగిపోవడానికి కాదు. నీకే మయిందో తెల్సుకోవడానికి.." అన్నాను సీరి యస్‌గా వాడివైపే చూస్తూ.

"ఏం లేదురా, ఒంట్లో కొంచెం నలతగా ఉంది అంతే.."

"నీ వ్యక్తిగత విషయాల గురించి గుచ్చి గుచ్చి అడిగే హక్కు నాకు లేదని తెలుసు కానీ మనసు ఉండబట్టలేక అడుగుతున్నాను చెల్లాయి పోయి నప్పుడు కూడా నువ్వింతగా కుంగిపోవడం నేను చూళ్లేదు.."

సుబ్రహ్మణ్యం హఠాత్తుగా రోదించటం మొదలు పెట్టాడు.

నేను ఒక్కసారిగా సోఫాలోంచి పైకి లేచి వాడి పక్కన కూర్చుని ఓదారుస్తున్నట్లుగా వాడి భుజం మీద చేయి వేశాను. ఇన్ని సంవత్సరాల కాలంలో సుబ్రహ్మణ్యం ఏడవటం అనేది నేను ఎప్పుడూ చూసిందే లేదు. తల్లీతండ్రీ పోయిన ప్పుడు, భార్య హఠాత్తుగా మరణించినప్పుడు కూడా వాడు ధైర్యంగానే నిలబడి త్వరగానే కోలు కున్నాడు. అటువంటిది ఇప్పుడు ఏడుస్తున్నా డంటే అంతటి ఉత్పాతం ఏం జరిగి ఉండొచ్చు?

"ఏదైనా ప్రాణాంతక వ్యాధి సోకిందని డాక్టర్లు చెప్పారేంట్రా?"



"కేన్సర్, అంతకంటే భయంకరమైన రోగం వచ్చుంటే హాయిగా చచ్చిపోయి ఉండేవాడిని. అనుక్షణం ఈ రంపపు కోత నాకు తప్పేది.." అన్నాడు రోదిస్తూనే. వాడి మాటలకు ఎలా రియాక్ట్ కావాలో నాకు అర్థం కాలేదు. వీడు మానసికంగా ఇంతలా బలహీనపడిపోవడానికి కారణం ఏమై ఉండొచ్చు? ఆరోగ్యం కాదంటున్నాడు. పోనీ ఆర్థికంగా ఏదైనా దెబ్బతగిలిందా?

ఐదు నిమిషాల తర్వాత తేరుకున్నాడు. కిచెన్‌లోకి వెళ్లి కాఫీ తయారు చేసి రెండుకప్పుల్లో పోసి తీసుకొచ్చాడు. నేను వాడిని గమనిస్తూనే ఉన్నాను. మనిషి బాగా కుంగిపోయినట్లుగా అయిపోయాడు. రెండు మూడు రోజుల్లో జీవితంలో ఊహాతీతమైన మార్పులు, కష్టాలు ఏం వచ్చుంటాయ్ వీడికి?

"కాఫీ సూపర్‌గా పెట్టావురా.." అన్నాను నేను సిప్ చేస్తూ

వాడు బలహీనమైన నవ్వొకటి నవ్వి తన కప్ అందుకుని కాఫీ తాగటం మొదలుపెట్టాడు.

"అజయ్ ఫోన్ చేశాడు.." అన్నాడు ఉపోద్ఘాతంలా.

"వెరీగుడ్... పండక్కి ఫ్యామిలీని తీసుకుని ఇండియాకు వస్తున్నాడంటనా?" అని అడిగాను.

వాడు మళ్లీ మౌన ముద్రలోకి వెళ్లిపోయాడు. సుబ్రహ్మణ్యం ఏకైక కొడుకు అజయ్. మాస్టర్స్ చేసి అమెరికాలోనే సెటిల్ అయిపోయాడు. పెళ్లి కూడా అక్కడి అమ్మాయినే చేసుకున్నాడు. తెల్ల పిల్లను చేసుకున్నాడన్న కోపం కంటే భారీ మొత్తం రావల్సిన కట్నం చేజారిపోయిందన్న బాధే ఎక్కువగా వీడిలో కనిపించింది. అజయ్ అమెరికా వెళ్ళి వెళ్లటంతోనే పెళ్ళిళ్ళ మార్కెట్‌లో తన కొడుక్కి ఎన్ని కోట్లు కట్నం డిమాండ్ చేయాలా అని వీడు కిందామీదా అయిపోతూ ఉండేవాడు.



**కోడి ఎక్కువలో ఎక్కువ 13 సెకన్లకు మించి గాలిలో ఎగరలేదు.**

"కట్నం తీసుకోవటం చట్టరీత్యా నేరం.." అన్నాను నేను నవ్వుతూ.

"ఒరేయ్ నువ్వు చట్టం సంగతి వదిలేసి మన అజయ్‌గాడికి కట్నం కింద ఎంత డిమాండ్ చేయొచ్చో ఓ ఫిగర్ చెప్పొచ్చుగా నాకు.."

"వివాహబంధానికి కట్నం ప్రాతిపదిక కాదు. ఇద్దరు వ్యక్తులు ఒకళ్లనొకళ్లు మనస్ఫూర్తిగా ఇష్టపడి జీవితాంతం కల్సి ఉండటం కంటే గొప్ప అదృష్టం, కానుక ఇంకేం ఉంటాయి" అన్నాను నేను.

వాడు తలకొట్టుకున్నట్లుగా అభినయిస్తూ "నాకు బుద్ధిలేక నిన్ను అడిగాను చూడు..నువ్వెప్పుడు నాకు అర్థం అయ్యేలాగా మాట్లాడావో చెప్పు! మాట్లాడితే వేదాంతం చెబుతావు లేదా కవిత్వ బాష మాట్లాడతావు. రేపు నీ కొడుకులకి ఎంత కట్నం లాగుతావో నేనూ చూస్తానుగా.."

**అతడెప్పుడూ చలాకీగా ఉండేవాడు. ఆస్తులు కూడబెట్టడంకోసమే చెమటోడ్చేవాడు. తన స్నేహితుడికి కూడా అలాంటి సలహాలే ఇచ్చేవాడు. అలాంటి వ్యక్తి అకస్మాత్తుగా వైరాగ్యం ప్రదర్శించడం ప్రారంభించాడు. కర్మఫలం తప్పదు అనే పదాలు ఉచ్చరించడం ప్రారంభించాడు. అతడిలో ఎందుకింత మార్పు? అతడికి జీవితంలో ఏదైనా ఎదురుదెబ్బ తగిలిందా?**

అన్నాడు అసహనంగా.

నేను సమాధానం చెప్పకుండా నవ్వి వదిలేశాను. నా కొడుకులిద్దరూ ఎరేంజ్డ్ మ్యారేజెస్ చేసుకున్నారు. పైసా కట్నం కూడా తీసుకోలేదు. నా ఇద్దరు కోడళ్లు కూడా కూతుళ్లు లేని లోటు తీరుస్తూ ఉంటారు. అత్తమామల మాదిరిగా కాకుండా తల్లిదండ్రుల్లా మమ్మల్ని ఆప్యాయంగా, అభిమానంగా చూసుకుంటారు. ఓ ఆడపిల్ల మన ఇంట్లో కాలుపెట్టి దీపం వెలిగించి వంశాన్ని ఉద్ధరించినందుకు మగపిల్లాడి తల్లిదండ్రులే ఎదురు కట్నం ఇవ్వాలంటాను నేను.

"కొడుకు ఇండియా వస్తుంటే ఉత్సాహంగా ఉండాల్సింది పోయి డల్ అయిపోతావేంటి?" నేను కాఫీ కప్పు కింద పెడుతూ అన్నాను.

"వాడేం రావటం లేదు. నన్నే వెళ్లి ఓల్డేజ్ హోమ్‌లో చేరమంటున్నాడు.."

నేను షాక్ తిన్నట్లుగా సుబ్రహ్మణ్యం వైపు చూశాను.

"వాడు ఎప్పటి నుంచో అన్యాపదేశంగా చెబుతూనే ఉన్నాడు. నాకే అర్థం కాలేదు. నాల్రోజుల క్రితం సీరియస్‌గా చెప్పాడు. ఆస్తులన్నీ అమ్మేసి వెళ్లి ఓల్డేజి హోమ్‌లో చేరిపోమన్నాడు.."

వాడు మళ్లీ రెక్ అయ్యాడు.

ఎలా ఓదార్చాలో తెలీక నేను స్థాణువులా అలానే కూర్చుండిపోయాను. అజయ్ అంతమాట అన్నాడా? జీవితకాలం నిద్రాహారాలు మానేసి, అష్టకష్టాలు పడి, వీడు ఇన్ని కోట్ల ఆస్తి సంపాదించింది అజయ్ కోసమే కదా! తల్లిపోయి తండ్రి ఒక్కడే ఇండియాలో ఒంటరిగా ఉంటున్నప్పుడు కూడా తండ్రిని తన దగ్గరకు తీసుకువెళ్లడమో లేకపోతే వీలయినప్పుడల్లా వచ్చి తండ్రిని చూసిపోవటమో చేయాలి కానీ వృద్ధాశ్రమంలో చేరమని చెప్పటం ఏమిటి?

"అజయ్‌తో నన్ను మాట్లాడమంటావా?"

"వద్దు" అన్నాడు భారంగా నిట్టూరుస్తూ" ఎక్కడ ఏ స్థలం, పొలం చౌకగా వస్తుందా, ఏ ఆస్తి కొంటే ఎంత వేగంగా దాని ధర పెరుగుతుందా, ఏ ఫిట్టింగులు పెట్టి నా కన్ను పడ్డ ఆస్తులు సొంతం చేసుకోవాలా అని అనుక్షణం రకరకాల పథకాలు వేస్తూ వచ్చాను. అలా సంపాదించిన ఆస్తిని చూస్తూ ఇంతకాలం మురిసిపోతూ నా తెలివితేటలకు, మేధస్సుకు నన్ను నేనే అభినందించుకుంటూ వచ్చాను కానీ నా ఇంట్లోనే ఓ విషవృక్షం పెరుగుతోందన్న విషయం మాత్రం గ్రహించలేకపోయాను. అజ్ఞానిని నేను.."

సుబ్రహ్మణ్యం మాటలు నాకెందుకో చాలా విభిన్నంగా అన్పించాయి. వాడు ఎప్పుడు నోరు తెరిచినా ఫలానా చోట ఆ ప్రాజెక్ట్ రాబోతుంది, అక్కడ స్థలాలు కొంటే సంవత్సరం తిరిగే సరికల్లా ఇంత లాభం వస్తుంది, వాళ్లు ఆర్థికంగా దెబ్బతిని ఇల్లు అమ్మేయబోతున్నారు, తక్కువ రేటుకి కొనుక్కుంటే ఆ తర్వాత అక్కడ అపార్ట్‌మెంట్స్ కట్టి అమ్మితే ఇంత మిగులుతుంది ఇటువంటి విషయాలే చెబుతూ ఉంటాడు.

నిజానికి వాడు చాలా గుంభనం మనిషి. ఏ విషయం కూడా ఇతరుల దగ్గర ప్రస్తావించడు. నాలుగు మాటలు మాట్లాడాల్సి వస్తే ఒక్క మాటతో సరిపెట్టి ఎదుటివాళ్లు చెప్పేది శ్రద్ధగా వింటూ అందులోంచి తనకు ఏదైనా లాభపడే అంశం దొరుకుతుందాని ఎదురుచూసే మనిషి. అటువంటివాడు ఈ విషయాలన్నీ నాకెందుకు చెబుతాడంటే వాడితోపాటు పోటీపడే ఉద్దేశం నాకు లేదు కాబట్టి, ఆస్తుల సముపార్జనలో నేను వాడికి పోటీకాదు కాబట్టి.

వీడు కుంగిపోవడానికి కారణం ఏమిటో నాకు అప్పుడు అర్థమైంది. కొడుకు వెళ్లి 'వృద్ధాశ్రమంలో చేరు' అని చెప్పే సరికి రెక్ అయిపోయినట్లున్నాడు. అయినా వీడికి వృద్ధాశ్రమంలో చేరాల్సిన ఖర్మ ఏముంది? ఇరవైకి పైగా సొంత ఇళ్లున్నాయి. ఎంత డబ్బయినా పడేసి పనివాళ్లను పెట్టుకోగల ఆర్థిక స్వాతంత్ర్యం ఉంది. మరిన్ని కోట్లు సంపాదించగల తెలివితేటలు, నేర్పు ఉన్నాయి. అయినా అమెరికాలో ఉండే అజయ్ ఇలా మాట్లాడటం తప్పు కదా! కన్న తండ్రి విషయంలో తనకు ఉండే బాధ్యతలను విస్మరించి ఇంత నిర్దాక్షిణ్యంగా, అమానుషంగా ఎలా ప్రవర్తిస్తారు బిడ్డలు? సుబ్రహ్మణ్యం గాడేంటి, ఏ తండ్రికయినా ఇటువంటి పరిస్థితి ఎదురైతే గుండె బద్దలు అయిపోదూ?

"వంట ప్రోగాం ఏదీ పెట్టుకోకు. నేను ఇంటికెళ్లి క్యారేజి పట్టుకొస్తాను.." అని చెప్పి ఇంటి కొచ్చాను. "మీ సుబ్రహ్మణ్యం అన్నయ్యకు ఒంట్లో బాలేదు. లైట్‌గా మిరియాల రసం, సొరకాయ కర్రీ చేయి. వెళ్లి ఇచ్చొద్దాం.." మా ఆవిడకు చెప్పి హాల్లోకొచ్చి కూర్చున్నాను.

కొంచెంసేపు తర్జనభర్జనలు పడిన తర్వాత

ఓ నిర్ణయానికి వచ్చి అజయ్‌కి ఫోన్ చేశాను. అది వాళ్లకు రాత్రి సమయం అని తెలుసు కానీ కుదురుగా ఉండని నా మనస్సు అదేం పట్టించుకునే స్థితిలో లేదు.

"హు ఈజ్ దిస్.." అజయ్ స్వరం విసుగ్గా వినిపించింది. "అజయ్, నేను నాన్నా పరమేశ్వర్రావు అంకుల్ని.." అన్నాను.

"ఓ అంకుల్ మీరా? ఏంటి ఈ టైంలో ఫోన్ చేశారు?" అన్నాడు మరింత విసుగ్గా.

"సారీ టు డిస్టర్బ్యూ. బట్ వాడి పరిస్థితి చూసేసరికి నీకు ఫోన్ చేయకుండా ఉండలేక పోయాను.."

"మా డాడీ పక్కనే ఉన్నాడా?" అని ప్రశ్నించాడు అజయ్. నేను అర్థంకాక "లేదు ఎందుకు?" అని అడిగాను.

"సో.. నా మీద కంప్లయింట్స్ చెప్పి మీతో ఫోన్ చేయించాడన్నమాట! సారీ అంకుల్, ఎవరు చెప్పినా నా నిర్ణయం మారదు. ఈ వయస్సులో ఆయన ఫైరానా పడే కంటే హాయిగా ఓల్డేజ్ హోమ్‌లో ఉండొచ్చు కదా?"

"అది కాదు అజయ్..నేను చెప్పేది కొంచెం అర్థం చేసుకో. మీ మమ్మీ పోయాక తను బాగా కుంగిపోయాడు. నువ్వు కూడా ఇలా బిహేవ్ చేస్తే వాడి పరిస్థితేంటి?" అన్నాను కాస్త మందలింపు ధోరణిలో.

"ఐ డోంట్ వాంట్ టు డిస్కస్ అవర్ ఫ్యామిలీ మ్యాటర్స్ విత్ థర్డ్ పర్సన్, సారీ అంకుల్ బై.." అని నిర్లక్ష్యంగా ఫోన్ కట్ చేసేసరికి నాకు పరిస్థితి తాలూకు తీవ్రత అర్థమైంది.

నేను, మా ఆవిడా క్యారేజ్ పట్టుకెళ్లేసరికి వాడు సోఫాలో పడుకుని శూన్యంలోకి చూస్తున్నాడు. వాడిని ఆ పరిస్థితిలో చూసే సరికి నా హృదయం ద్రవించిపోయింది. ఎంత ఉత్సాహంగా, చురుగ్గా ఉండేవాడు? ఒక్క క్షణం ఖాళీగా ఉండకుండా ఆస్తులు, సంపాదనతో హడావిడిగా తిరుగుతూ ఉండేవాడు. అటువంటిది కొడుకు అనే వేటగాడు సంధించిన బాణం దెబ్బకు విలవిలలాడుతూ నేల కూలిన ముసలి పక్షిలా మౌనంగా రోదిస్తూ..

"నాలుగు రోజులకే ఇలా అయిపోయారేంటన్నయ్యా" అంటూ మా ఆవిడ బాధపడుతూ భోజనం వడ్డించింది. వాడు మా బలవంతం మీద ఏదో తిన్నాననిపించాడే కానీ వాడికి భోజనం మీద కూడా ఆసక్తి లేదని అర్థమవుతుంది.

"మాతో పాటు ఇంటికొచ్చేయండి. నాలుగైదు రోజుల తర్వాత తేరుకున్నాక వద్దురుగానీ.." అంది మా ఆవిడ సుబ్రహ్మణ్యంతో. "వద్దు తల్లీ, ఏదో మనసు కొంచెం బాలేదు. అంతే నా ఆరోగ్యానికి ఢోకా ఏమీ లేదు. పాపీ చిరాయువు అంటారు కదా!" అన్నాడు శుష్కమందహాసం చేస్తూ.

మేమిద్దరం మరో గంటసేపు కూర్చుని ఇంటికి తిరిగొచ్చిన తర్వాత మా ఆవిడ ఇంటిపనుల్లో పడింది. సాధారణంగా నేను వీలయినంత ప్రశాంతంగా, కంపోజ్డ్‌గా ఉండేందుకు ప్రయత్నిస్తూ ఉంటాను. కానీ సుబ్రహ్మణ్యం పరిస్థితి చూస్తుంటే మనసు ఎందుకో తీవ్రమైన వేదనకు గురవుతోంది. అమెరికాలో కోట్లు సంపాదిస్తున్న అజయ్‌కు ఇప్పుడంత అర్జంటుగా ఆస్తులమ్మేసి క్యాష్ చేసుకోవాల్సిన అవసరం ఏముంది? అన్నింటికంటే ముఖ్యంగా తండ్రిని వెళ్లి వృద్ధాశ్రమంలో చేరమని ఆర్డర్స్ జారీ చేస్తున్నాడంటే వాడిలో ఏమాత్రం మానవత్వం, మమకారం లేవని అర్థం అవుతోంది. బిడ్డలు తల్లిదండ్రుల పట్ల ఇంత కఠినంగా, కర్కోటకంగా, ఎలా ప్రవర్తించగలుగుతారు? తమ భవిష్యత్తుకోసం తల్లిదండ్రులు ఎన్ని కష్టాలు పడ్డారో అన్నీ తెలిసి కూడా తమకంటూ ఓ కుటుంబం, జీవితంలో సెక్యూరిటీ ఏర్పడిన తర్వాత ఏమాత్రం కృతజ్ఞతాభావం లేకుండా తల్లిదండ్రుల్ని ఓల్డేజ్ హోమ్స్‌లో ఎలా డంప్ చేయగలుగుతున్నారు?

ఆలోచనలతో నా బుర్ర వేడెక్కింది.

సరిగ్గా అదే సమయంలో సుబ్రహ్మణ్యం ఫోన్ చేశాడు. "నువ్వు అజయ్‌కి ఫోన్ చేశావేంట్రా?" అని అడిగాడు.

" అవును నీకెలా తెలుసు?" ఆశ్చర్యంగా అడిగాను.

"వాడిప్పుడే నాకు ఫోన్ చేసి అడ్డమైన వాగుడంతా వాగాడు. నేనే దగ్గరుండి వాడికి ఫోన్ చేయించానుకుంటున్నాడు. ఎంత చెప్పినా వాడి ధోరణి వాడిదే కానీ ఏదీ వినటం లేదు. ప్రారబ్ధ కర్మ అంటే ఏమిటో నాకు ఇప్పుడిప్పుడే అర్థమవుతోందిరా.." అన్నాడు సుబ్రహ్మణ్యం. వాడి గొంతు వింటుంటేనే అజయ్ ఎలా మాట్లాడి ఉంటాడో అర్థమవుతుంది.

"సర్లే. ప్రస్తుతానికి అన్నీ వదిలేసి ప్రశాంతంగా ఉండు. ఏదో పరిష్కారం దొరక్కపోదు. తను ఏదో ప్రాజెక్ట్ టెన్షన్స్ మీద ఉండి ఉంటాడు. అసలు తప్పంతా నాదే! నువ్వు వద్దు అని చెప్పినా తనకు ఫోన్ చేయడం నా తప్పే కదా?" అన్నాను గిల్టీగా.

"వాడు నీతో ఎలా మాట్లాడి ఉంటాడో నేను ఊహించగలను. వాడికిప్పుడు డబ్బు పిచ్చి పట్టింది. పిచ్చి కూడా కాదు ఉన్మాదం. ఆ డబ్బు ఉన్మాదంతో వాడు మంచీ చెడూ మర్చిపోయి కరాళ నృత్యం మొదలుపెట్టాడు. ఎనీ హౌ సారీరా! తండ్రిగా వాడి తరపున నేను అపాలజీ చెబుతున్నాను..."

"ఒరేయ్..వాడూ నా బిడ్డలాంటి వాడే! నువ్వు అనవసరంగా విషయాలను బూతద్దాల్లోంచి చూడకు. అన్నీ సర్దుకుంటాయి. ప్రశాంతంగా ఉండు. సాయంత్రం వస్తాను ఈవెనింగ్ వాక్‌కు వెళదాం." అని ఫోన్ పెట్టేశాను.

సుబ్రహ్మణ్యం గాడిలాంటి వ్యక్తి నోటి వెంట 'ప్రారబ్ధకర్మ' లాంటి పదాలు వినటం నన్ను ఎంతో ఆశ్చర్యానికి గురిచేసింది. డబ్బు, ఆస్తులు చూసుకుని వాడు ఎంత ధీమాగా, అతిశయంగా ఉండేవాడు? అటువంటివాడు ఈ రోజు కాలసర్పం చేతిలో చిక్కిన కప్పలా విలవిల్లాడుతున్నాడు. ఎందుకో నా మనస్సు గతంలోకి ఎగురుకుంటూ వెళ్లిపోయింది.

"నీక్కానీ పిచ్చెక్కిందా? యాభై లక్షలు ఖరీదు

## ఆయన తెగ నచ్చేశాడట!

అబ్బాయిలకు అమ్మాయిలు త్వరగా నచ్చుతారు. కానీ ఆడపిల్లలకి అబ్బాయిలు అంత త్వరగా నచ్చరు. ఒక వేళ నచ్చినా ఆ విషయాన్ని నోరు తెరిచి బయటకి మాత్రం వెంటనే చెప్పేయరు. హీరోయిన్ అమీజాక్సన్ ఈ విషయంలో పూర్తిగా విరుద్ధం. ఎలాగంటే.. కోలీవుడ్ హీరో విజయ్ ఆమెకి తెగ నచ్చేశాడట! అపార్థం చేసుకోకండి. రూపంలో కాదుకానీ, విజయ్ నటన తెగ నచ్చేసిందట! ఎక్కడ ఎప్పుడు మాట్లాడినా అమీ ఈ విషయాన్ని తప్పకుండా చెబుతోంది. నాకు విజయ్ అంటే చాలా ఇష్టం. ఆయన నటనకి ఫ్లాట్ అయిపోయాను అంటూ ఊకదంపుడు ఉపన్యాసాలు ఏకబిగిన ఇచ్చేస్తోందట!



చేసే ఇంటిని స్కూల్‌కిచ్చేస్తావా?"

"అమ్మానాన్నల పేరు మీద ఏదో ఒక మంచి పని చేయాలనుకుని పూర్వీకుల నుంచీ వారసత్వంగా వచ్చిన ఇంటిని ఒక స్కూలుకు గిఫ్ట్‌గా ఇస్తే ఇందులో తప్పేముంది?"

"నీకు బుర్ర పనిచేయడం లేదు. ఉండు నీపని చెబుతాను.." అంటూ నా ముందు నుంచే సుబ్రహ్మణ్యం గాడు నా ఇద్దరి కొడుకులకు ఫోన్ చేశాడు. ఒకడు బెంగుళూరులో, ఇంకోడు పాట్నాలో ఉంటారు.

"మీ బాబు పూర్వీకుల ఆస్తులు ఇష్టమొచ్చినట్లు దానధర్మాలు చేస్తూ ఉంటే మీరేం పట్టించుకోరేంటీ?" అని వాళ్లిద్దరినీ ఎగదోసే ప్రయత్నం చేశాడు.

"ఏది మంచో ఏది చెడో డాడీకి చెప్పేంత జ్ఞానం, అనుభవం మాకు లేదంకుల్! ఆయన ఏంచేసినా బాగా ఆలోచించే చేస్తారు. కొడుకులుగా ఆయన ఏది చేసినా మేము మనస్ఫూర్తిగా అంగీకరిస్తాం." ఇదీ నా కొడుకులు చెప్పిన సమాధానం.

"నిన్ను మించిన చాదస్తులుగా తయారు చేశావురా నీ పిల్లల్ని. వయస్సులో ఉన్నప్పుడే




ఆస్తులు వెనకేసుకోవటం మీద ధ్యాస లేకపోతే ముందు ముందు వీళ్లెలా బతుకుతారు?" నా కొడుకులతో ఇంటిని స్కూల్‌కిచ్చేసే ఆలోచనకు అడ్డుపుల్ల వేయాలన్న ప్రయత్నం ఫలించకపోవడంతో నా మీద ఉక్రోషంతో ఎగిరాడు.

సమాధానంగా నవ్వి ఊరుకున్నాను.

కష్టం అంటే ఏమిటి? జీవితంలో డబ్బు ఎంత వరకు సంపాదించాలి? ఆత్మసంతృప్తితో బతకడం ఎలా? ఇటువంటి విషయాల గురించి నా కొడుకులకు నేనెప్పుడూ ఉపన్యాసాలు దంచలేదు. నా జీవిత విధానాన్ని చూసి వాళ్లు నేర్చుకున్నారనుకుంటాను. అందుకే బాల్యం నుంచే సెలవు రోజుల్లో బ్లూక్రాస్ లాంటి సంస్థలకు వెళ్లి వాలంటీర్లుగా పనిచేసేవాళ్లు. చదువు, స్పోర్ట్స్‌లో ఎంత చురుగ్గా ఉండేవాళ్లో సామాజిక కార్యకలాపాలు, చారిటీ పనుల్లో కూడా అంతే యాక్టివ్‌గా ఉండే వాళ్లు. వాళ్ల బర్త్‌డేలను అనాథ శరణాలయాలు, ఓల్డేజ్‌హోమ్‌లో సెలబ్రేట్ చేసుకునే వాళ్లం.

నాకు బాగా గుర్తు. చిన్నప్పుడు ఓరోజు అజయ్ వీధిలోంచి కుక్కపిల్ల నొకదాన్ని తెచ్చుకున్నాడు. "ఛీ ఛీ వీధికుక్క అవతల పడేయ్.." అని వీడు విసుక్కుంటే అజయ్, "నేను దాన్ని పెంచుకుంటాను" అని ఏడుపు మొదలెట్టేసరికి "దానికి పాలూ, బిస్కెట్లూ, అన్నం, రోగాలు రాకుండా వ్యాక్సిన్స్ బోల్డంత ఖర్చు. తీసుకెళ్లి వీధిలో పడేయ్, నీకు టాయ్‌గన్ కొనిస్తాను.." అని వాడితో బేరం పెట్టాడు. వాడు తెచ్చుకున్న కుక్కపిల్లను చిన్నముఖం చేసుకుని వీధిలో వదిలేసి వచ్చాడు.

నేను గతం తాలూకు ఆలోచనల్లో మునిగి ఉండగానే విజయవాడ నుంచి ఫోనొచ్చింది. మాఆవిడ బాబాయ్ గారికి సీరియస్‌గా ఉందనీ. మేము హడావిడిగా బయలుదేరాం. దార్లో ఫోన్ చేసి విషయం చెప్పగానే "నేను బానే ఉన్నాను, వెళ్లి బాబాయ్‌గారి దగ్గర ఉండండి.." అన్నాడు సుబ్రహ్మణ్యం.

తిరిగి హైద్రాబాద్ చేరటానికి వారం రోజులు పైగా పట్టింది. బాబాయ్ గారు కొంచెం కోలుకున్నాక తిరిగొచ్చేసాం. మధ్యలో ఫోన్ చేసినప్పుడు సుబ్రహ్మణ్యం నుంచి మెస్సేజ్ వచ్చింది. "ప్లీజ్ డోంట్ డిస్టర్బ్ మీ, ఐ కాల్ యూ బ్యాక్.." అంటూ. నేనెప్పుడు ఫోన్ చేసినా ఇదే వరస. దాంతో ఫోన్లు చేయడం తగ్గించాను.

సిటీకి రాగానే మా ఆవిడను ఇంట్లో వదిలేసి సుబ్రహ్మణ్యం దగ్గరకు బయలుదేరాను. వాడి ఇంటికి వెళ్లేసరికి తాళం వేసిన గేటుకి 'హౌస్ ఫర్ ది సేల్' అనే బోర్డు కన్పించగానే నాకు కళ్లు తిరిగినంత పనయింది. వెంటనే వాడికి ఫోన్ చేశాను. లిఫ్ట్ చేయలేదు. అయిష్టంగానే అజయ్‌కు ఫోన్ చేశాను. తనూ ఫోన్ ఎత్తలేదు. అసలేం జరిగుంటుంది? ఇల్లెందుకు అమ్మకానికి పెట్టాడు? వీడు ఎక్కడకు వెళ్ళినట్లు? సవాలక్ష ఆలోచనలతోనే ఇంటికి తిరిగొచ్చాను. గంట తర్వాత వాడి నుంచి నాకు ఫోనొచ్చింది.

"ఏరా, బాబాయ్‌గారు ఎలా ఉన్నారు?" అని అడిగాడు. నేను ఆత్రుతతగా "బానే ఉన్నారు కానీ నువ్వెక్కడున్నావ్? ఇంటి ముందు ఆ బోర్డేమిటి"? అని అడిగేసరికి అవతల నుంచి వాడు నవ్వినట్లుగా శబ్దం వినిపించింది.

"ఒరేయ్ నేను చెప్పేది జాగ్రత్తగా విను. కంగారు పడకు. నేను క్షేమంగా, ప్రశాంతంగానే ఉన్నాను. ఇంతకాలం లేని ప్రశాంతతా, సంతృప్తీ రెండ్రోజులకే ఈ ఓల్డేజ్ హోమ్‌లో లభించింది.."

"ఏంటీ, నువ్వెళ్లి ఓల్డేజీ హోమ్‌లో చేరావా?" నేను నమ్మలేనట్లు అడిగాను.

"అవును...ఓ మంచి భర్తను, స్నేహితుడిని, మనిషిని కాలేకపోయాను. కనీసం మంచి తండ్రిని కావాలనుకుంటున్నాను. నేను పోయాక నా ఆస్తులన్నీ వాడికేగా! కాకపోతే నేను చావక ముందే వాడు కావాలంటున్నాడు. వాడితో నాకు ఘర్షణ, గొడవ ఎందుకు? ఏ రోజు వాడికి మానవత్వం, కరుణ, మమకారం ఉండేలా పెంచాను గనుక ఇప్పుడు వాడికీ లక్షణాలు రావడానికి? నువ్వూ, నీ ఇద్దరు కొడుకులూ ఆదివారాలు బ్లూక్రాస్‌కెళ్లి జంతువులకు సేవలు చేస్తుంటే అది చూసి మేమిద్దరం నవ్వుకునే వాళ్లం.

కానీ ఇప్పుడు అర్థమవుతోందిరా మనం ఏది విత్తుతామో ఆ పంటనే కదా కోసుకుంటాం. వాడు విషవృక్షం అంటూ వచ్చానేగానీ వాడి మనస్సులో ఆ భావాలను, స్వార్థాన్ని, డబ్బు దాహాన్ని, వస్తు వాంఛను నాటింది నేనే కదా! అందుకే దాని ఫలితాన్ని నేనే అనుభవించక తప్పదు. నువ్వు కంగారు పడి పరిగెత్తుకుంటూ రాకు. నేనిక్కడ హాయిగానే ఉన్నాను. ఆ లంపటాన్ని వదిలించుకున్నాక మనసంతా ఎందుకో తెలీదు కానీ హాయిగా, సంతృప్తిగా, ప్రశాంతంగా ఉంది. ఉంటానురా చెల్లాయిని అడిగానని చెప్పు..." అని వాడు ఫోన్ పెట్టేశాడు.

సుబ్రహ్మణ్యం గాడి పరిస్థితికి మనసంతా నల్లటి మేఘంలాంటి దుఃఖం, వేదన, బాధతో నిండిపోయింది.

హు జీవితం? విధి ఎక్కడ తన్నితే ఎక్కడకు వెళ్లి పడ్డాడు? సుబ్రహ్మణ్యం జీవితం నుంచి ఈ సమాజం, మనుష్యులు ఏమైనా గుణపాఠం నేర్చుకుంటారా? ఏమో తెలీదు నేర్చుకోవచ్చు. ఆ క్షణంలో ఎందుకో మానాన్న తరచుగా అనే ఓ మాట గుర్తొచ్చింది. "ప్రారబ్ధ కర్మను ఎవ్వరూ తప్పించుకోలేరు. అనుభవించి తీరాల్సిందే.."

బాల్యం నుంచీ బిడ్డలకు చుట్టూ ఉండే ప్రకృతి, మూగజీవాలు, మానవ సంబంధాల పట్ల గౌరవం, మమకారం, ఆపేక్ష, ఆర్తి నేర్పకపోతే పెరిగి పెద్దయ్యాక పిల్లలు అజయ్‌లానే తయారవుతారు. జీవితంలో ఆర్థిక విజయాలు సాధించే రోబోట్స్ మాదిరిగా ప్రోగ్రాం చేయకుండా ఎమోషన్స్, విలువలుండే మనుష్యులుగా పిల్లల్ని పెంచడం తల్లిదండ్రుల కర్తవ్యమనీ సుబ్రహ్మణ్యంగాడి జీవితాన్ని చూశాక ఈ సమాజం నేర్చుకుంటే బావుండు.

నవ్య

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
# 'గౌటీ ఆర్థరైటిస్' సమస్యకు సరైన చికిత్స

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



మానవ శరీరంలో ఎటువంటి కదలికలోనైనా కీళ్ళు ప్రధాన పాత్ర పోషిస్తుంటాయి. అంతటి ప్రాధాన్యం సంతరించుకున్న కీళ్ళలో ఏదైనా నొప్పి కలిగితే అది మన రోజువారీ దినచర్యను ఖచ్చితంగా ప్రభావితం చేస్తుంది. ఉదయాన్నే నిద్ర లేచేసరికి కాలి బొటనవ్రేలులో తీవ్రమైన నొప్పి, సలపరం, మంట మరియు వాపు ఏర్పడి ఆ మరుక్షణం నుండి కాలి బొటనవ్రేలు తాలూకు ఏ కదలికైనా భరించలేనంత నొప్పిగా ఉంటుంది. ఇంతటి నొప్పి కేవలం గౌట్ వల్లనే కలుగుతుంది. నేటితరంలో గౌట్ సమస్య నానాటికీ పెరుగుతూనే ఉంది. నేడు ప్రతి 1000 మందిలో 45 మంది ఈ వ్యాధితో బాధపడుతున్నారు. స్త్రీల కంటే పురుషులలో 3 రెట్లు అధికంగా ఈ వ్యాధిని మనం చూడవచ్చు. సాధారణంగా మన రక్తంలో 'యూరిక్ ఆమ్లం' అనే రసాయనం ఉంటుంది. యూరిక్ ఆమ్లం ఉండవలసిన మోతాదు కంటే ఎక్కువగా ఉన్నప్పుడు అది కీళ్ళలోకి వచ్చి చేరుతుంది. ఇలా కీళ్ళవద్దకు ఎక్కువగా చేరుకున్న యూరిక్ ఆమ్లం, స్ఫటికాల రూపంలో ఎక్కువగా పేరుకుపోయినప్పుడు కీళ్ళు వాచి, కదలికలు కష్టంగా మారతాయి. దీన్నే వైద్యపరిభాషలో 'గౌట్' లేదా 'గౌటీ ఆర్థరైటిస్' అని అంటారు.

కారణాలు: ప్యూరిన్ ఎక్కువగా ఉండే ఆహారాలు: లివర్, మాంసము, పుట్టగొడుగులు, స్వీట్ బ్రెడ్ మొ॥వి అధికంగా తీసుకోవడం, మద్యపానం ఎక్కువగా చేయటంతో యూరిక్ ఆమ్లపు స్థాయిలు పెరగటంతో 'గౌట్' ఉత్పన్నమవుతుంది. అధికబరువు, మధుమేహం, అధిక రక్తపోటు మరియు కొలెస్ట్రాల్ అధికంగా పేరుకుపోవటం మొ॥వి ఈ వ్యాధికి కారణాలు కావచ్చు.



లక్షణాలు: తీవ్రతను బట్టి 'గౌట్' వ్యాధి లక్షణాలు చాలా ప్రస్ఫుటంగానే కనిపిస్తాయి. ఈ సమస్య ఎక్కువగా కాలి బొటనవ్రేలులో కనిపిస్తుంది. ఉదయాన్నే నిద్ర లేచేసరికి లేదా అర్ధరాత్రి సమయంలో గానీ కాలి బొటనవ్రేలులో విపరీతమైన నొప్పి, సలపరం, మంటతో పాటు వాపు ఉంటుంది. మరియు ఆ ప్రాంతమంతా ఎర్రగా కందిపోయి ఉంటుంది. ఇవన్నీ 'గౌట్' వ్యాధిలో కనిపించే ప్రధాన లక్షణాలు. మొదట్లో ఈ వ్యాధి ఒకటి లేదా రెండు కీళ్ళకు మాత్రమే పరిమితమైనప్పటికీ, నిర్లక్ష్యం చేస్తే క్రమేపీ ఇది దీర్ఘకాలికంగా మారి ఇతర కీళ్ళకు కూడా వ్యాపించి, వాటిని బాగా దెబ్బతీసేందుకు అవకాశముంటుంది. కాబట్టి అవసరమైన జాగ్రత్తలు మరియు తగిన చికిత్స తీసుకోవటం ద్వారా ఈ సమస్యల నుండి కీళ్ళను కాపాడుకోవచ్చు.



రోగ నిర్ధారణ పరీక్షలు: రక్తంలో యూరిక్ ఆమ్లం ఎక్కువగా ఉన్నంత మాత్రాన 'గౌట్' ఉన్నట్లుగా నిర్ధారించరాదు. యూరిక్ ఆమ్లం రక్తంలో అధికంగా ఉండటంతో పాటు కీళ్ళలో ఆర్థరైటిస్ లక్షణాలు కూడా ఉన్నప్పుడు, దానిని తప్పనిసరిగా 'గౌట్'గా నిర్ధారించుకోవాలి. అలాగే మరికొన్ని ఇతరత్రా సందర్భాలలో కూడా రక్తంలో యూరిక్ ఆమ్లపు శాతం ఎక్కువగా ఉండవచ్చు.
ఉదాహరణకు సోరియాటిక్ ఆర్థరైటిస్, కిడ్నీ ఫెయిల్యూర్, లుకేమియా వంటి సమస్యలు తలెత్తినప్పుడు కూడా రక్తంలో యూరిక్ ఆమ్లం ఎక్కువగా ఉంటుంది. రక్తపరీక్ష (రక్తంలో యూరిక్ ఆమ్లం ఎక్కువగా ఉండటం, ఈఎస్ఆర్ స్థాయిలు పెరగడం), ఎక్సరే (మృదుకణజాలాల్లో వాపు కనిపిస్తుంది), కీళ్ళలోని ద్రవం తీసి పరీక్షించటం మొ॥ పరీక్షల ద్వారా వ్యాధి నిర్ధారణ చేయబడుతుంది.

ఆహార నియమాలు: గౌట్ బాధితులు మాంసకృత్తులు తినటం బాగా తగ్గించాలి. ముఖ్యంగా 'హై ప్యూరిన్ డైట్' తీసుకోకూడదు. మాంసకృత్తులు (ప్రోటీన్లు) 2 రకాలు. (1) ప్యూరిన్స్, (2) పిరమిడైన్స్. గౌట్ బాధితులు ప్యూరిన్స్ రకం ప్రోటీన్లు ఎక్కువగా తీసుకోరాదు. మాంసాహారాలు: మేక, గొర్రె, బీఫ్ వంటివి తినరాదు. జంతు అవయవాలు: లివర్, కిడ్నీ, ఎముకల మూలుగు, పేగులు మొ॥వి తినరాదు. శాకాహారాలు: పాలకూర, క్యాబేజీ, క్యాలీఫ్లవర్, చిక్కుడు, వివిధ రకాల బీన్స్, పుట్టగొడుగులు మొ॥వి తగ్గించాలి. ఆల్కహాల్ వంటివి సేవించకూడదు.

హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స: 'గౌటీ ఆర్థరైటిస్' సమస్యకు హోమియోకేర్ వారి కాన్స్టిట్యూషనల్ వైద్యవిధానంలో ఉత్తమమైన చికిత్స లభిస్తుంది. ఇందులో రోగి యొక్క శారీరక, మానసిక స్థితిగతులను క్షుణ్ణంగా విచారించి, అందుకు అనువైన చికిత్స చేస్తారు. ఇంతేకాకుండా, 'కీళ్ళ'లో యూరిక్ ఆమ్లపు స్ఫటికాలు ఏర్పడకుండా చూసి, రక్తప్రసరణలోని వివిధ రసాయనాల సమతుల్యతను కాపాడటం ద్వారా గౌట్ వ్యాధిని పూర్తిగా నయం చేయవచ్చు.

ఉచిత కన్సల్టేషన్ **955 000 1188 / 99**

www.homeocare.in



# కందుగాడి కాశీయాత్ర

## - శివసతీపురం శర్మ

7

దశాశ్వమేధ్‌ఘాట్ దారి పొడుగునా అన్నీ స్వీట్‌షాప్‌లే! ఏదీ హోటల్‌లా లేదు. స్వీట్ షాపుల్లో వేడివేడిగా జిలేబీలూ, సమోసాలూ తయారు చేస్తున్నారు.

"తీర్థాల్లో ఏద్దైనా వేడివేడిగా తినెయ్యాలి. తినేస్తే ఏ సమస్యా ఉండదు. లేకపోతేనే తల నొప్పులు." డాక్టర్‌బాబు ఎప్పుడో చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి కందుకి.

"ముందు ఇవి వేడివేడిగా లాగిద్దాం." అన్నాడు.

"సమోసాలూ జిలేబీలూ తింటాంవంటారు, అదే కదా మీరు చెప్పేది." అని నవ్వాడు మోహన్. రండ న్నట్టుగా ముందుకు దారి తీశాడు. లోపలికి వెళ్ళి ఓ టేబుల్ దగ్గరగా కూర్చున్నారంతా. దాహం అని పించిందేమో! సుబ్బారావు టేబుల్ మీది గ్లాసు అందుకుని నీరు తాగబోయాడు. వారించాడు డాక్టర్ బాబు.

"ప్యాకేజ్డ్ డ్రింక్ తాగడం బెటర్. వాటర్‌బాటిల్ చెప్పండ్రా." అన్నాడు బాబు. దగ్గరగా వచ్చిన సర్వ ర్‌కి ముందుగా మూడు వాటర్‌బాటిల్స్ చెప్పాడు కందు. చల్లగా ఎక్కడ తగలేస్తాడేమోనని భయ పడ్డాడు సుబ్బారావు. గట్టిగా అరిచాడు.

"ప్లైన్! ప్లైన్ వాటర్‌బాటిల్స్"

"ఓకేసార్" అన్నాడు సర్వర్. ప్లైన్‌వే మూడు వాటర్‌బాటిల్స్ తెచ్చాడు.



"ఇంకా" అడిగాడు. ఆశ్చర్యపోయారు ఆ మాటకి. 'ఇంకా' అన్నాడంటే? తెలుగువాడే అనుకున్నారు.

"నీకు తెలుగు వచ్చా?" సర్వర్‌ని అడిగింది వాణి.

"మాది రాజమండ్రి మేడం." అని నవ్వాడు సర్వర్.

"చెప్పండి, ఏం కావాలి?"

"పెసరట్టూ ఉప్మా ఉందా?" అడిగాడు సుబ్బా రావు.

"ఊరుకాని ఊరు, వేళకాని వేళ పెసరట్టూ ఉప్మా ఎలా దొరుకుతుందయ్యా? నీ తిండి యావా నువ్వూ." కసిరింది నిర్మల.

"దొరుకుతుందేమోనని..." నీళ్ళు నమిలాడు సుబ్బారావు.

"అలాంటివన్నీ కొంచెం ముందుకెళ్తే అయ్యర్ హోటల్లో దొరుకుతాయి సార్! ఇక్కడ ఓన్లీ సమోసా జిలేబీ...చెప్పండి ఎన్ని ప్లేట్లు?" అడిగాడు సర్వర్.

"ప్లేట్లొద్దుగాని, ఒకొక్కరికీ ఒకొక్క సమోసా, రెండేసి జిలేబీలు పట్రా." చెప్పింది వాణి. చెప్పి నట్టుగానే సర్వ్ చేశాడతను. వేడివేడిగా జిలేబీలు బలే రుచిగా ఉన్నాయి.

విదేశీపిల్లలిద్దరు సమోసా తిని, ఆ మాత్రం కారాన్ని కూడా తట్టుకోలేక నోరుని సున్నాలా చేసి గాలిపీల్చడాన్ని గమనించాడు కందు. నవ్వుకున్నాడు. దగ్గరగా పిలిచాడు వాళ్ళని. వచ్చిన వాళ్ళకి తియ్య తియ్యగా జిలేబీ తినిపించాడు.

"ఎలా ఉంది?" ఆంగ్లంలో అడిగాడు.

"స్వీట్" అని నవ్వారు పిల్లలు. మంచి కలర్‌లో ఉన్నారు పిల్లలిద్దరూ. కొనదేలిన ముక్కులూ, తేనె రంగు కళ్ళూ చూడముచ్చటగా ఉన్నారు.

"సరదాగా ఫోటోలు తీసుకుందామా?" అడి గాడు.

"ఓకే" నవ్వారు పిల్లలు. వాళ్ళతో మోహన్‌సహ అంతా ఫోటోలు దిగారు. ఎక్కువగా సెల్ఫీలు తీసు కున్నారు. బిల్ వచ్చింది. అది తాను చెల్లిస్తానంటూ హడావుడి చేశాడు మోహన్.

"మీకెందుకండీ? బలేవారే" అని బాబు బిల్ చెల్లించాడు.

ఆసరికి అయిదున్నరయింది. చిరుచీకట్లు కమ్ముకుంటున్నాయి. చలిచలిగా ఉంది.

"రండి" అని లేవదీశాడందర్నీ మోహన్. హార తిని చూసేందుకు గంగ ఒడ్డుకు బయల్దేరదీశాడు.

మిత్రబృందం మొదటిసారిగా గంగను చూడ బోతోంది. ఉత్కంఠగా ఉంది అందరికీ.

"ఇక్కడ గంగ ఉత్తరదిశగా ప్రవహిస్తుంది, తెలుసా?" అడిగాడు సుబ్బారావు.

"తెలీదు" అన్నాడు బాబు.

"ఉత్తరదిశగా ప్రవహించే జీవనదుల ప్రాంతాలు కళలకు పుట్టిళ్ళవుతాయట! అలాగే ఆ ప్రాంతా లంటే దేవతలకు చాలా ఇష్టమంట."

"ఇది కూడా శివపురాణంలో ఉందా?"

"లేదు! నేను ఇంకో దగ్గర చదివాను." అన్నాడు సుబ్బారావు.

కూరగాయల మార్కెట్‌లోంచి, చిన్న చిన్న గల్లీల్లోంచి తిప్పి తిప్పి, ఆఖరికి విశాలమైన గంగా నది ఒడ్డుకు చేర్చాడు మోహన్. చల్లనిగాలి శరీ రానికి తగిలింది. చలి పెట్టింది. ఘాట్‌లో ఉన్న జనవాహినిని తప్పించుకుని, ముందుకు వెళ్ళారు. గంగను చూశారు.

ఆకాశం అంత గంగ! అనంతంగా ఉంది. భూదేవంత గంగ! బుజబుజరేకుల్లా ఉంది. కళ్ళ నిండుగా గంగ! కన్నీరంత ఉంది. గుండె నిండుగా గంగ! గుడిదీపంలా ఉంది.

కళ్ళు మూసుకున్నారంతా. చేతులు జోడించి నమస్కరించారు.

హారతికి సిద్ధమవుతున్నారు పండిట్‌లు. ముందుగా భక్తిగీతాలు వినవస్తున్నాయి. గీతాలన్నీ గంగ పైనే!

"ఈ గంగలో ఒక్కసారి, ఒకే ఒక్కసారి స్నానం చేస్తే చాల్రా! సర్వపాపాలూ పోతాయి." గోల గోలగా చెప్పాడు సుబ్బారావు.

"చేసిన పాపాలన్నీ ఈ ఒక్కరాత్రీ మనతో ఉండనీ. రేపు పోగొడదాం." అని నవ్వాడు బాబు.

స్త్రీలంతా చిన్న చిన్న దొప్పల్లో పువ్వులూ, దీపాన్నీ ఉంచి గంగలో వదులుతున్నారు. నీలా కాశంలో నక్షత్రాల్లా మెరుస్తూ ప్రయాణిస్తున్నాయి దీపాలు. వాటిని క్లిక్ చెయ్యని కెమెరా లేదు.

అభిముఖంగా కూర్చుని హారతిని తిలకించడం బాగుంటుంది. అందుకు యాత్రికులంతా పడవల్లో ప్రయాణమవుతున్నారు. మనిషికి 'ఇంత' అని ఓ పద్ధతి లేదు. గీసి గీసి బేరాలు ఆడుకోవాలి. అదృష్టం కలిసొస్తే ఏభై రూపాయలకు పడవలో కూర్చుని హారతిని చూడగలరు. కలసి రాలేదూ, వెయ్యి రూపాయలు పైబడే సమర్పించుకోవాల్సి ఉంటుంది.

మనిషికి అయిదువందలు చొప్పున మిత్ర బృందం ఆరుగురికీ మూడువేల రూపాయలు ఇమ్మన్నాడు పడవవాడు. ఇవ్వనన్నాడు మోహన్. మనిషికి రెండువందల చొప్పున పన్నెండువందలు ఇస్తాను. ఘాట్‌లన్నీ చూపించి, హారతి సమ యానికి ఇక్కడ కూర్చోబెట్టాలన్నాడు. కుదర దన్నాడు పడవవాడు. వెళ్ళిపోయాడు.

"మనిషికి మూడొందలు అంటే వస్తాడేమో" అన్నాడు కందు.

"పరిగెత్తుకుని వస్తాడు. ఎందుకు రాడు? రెండొందలు రీజనబుల్. వాడే వస్తాడు. వెయి ట్చేద్దాం." అన్నాడు మోహన్.

"ఇసుకతో ఉన్న ఆ అవతలి గట్టేంటండీ?" అడిగాడు సుబ్బారావు.

"అదే వ్యాసకాశి" అన్నాడు మోహన్.

"వ్యాసకాశి అంటే?"

"అంటే...అదో పెద్దకథ. చెబుతాను, వినండి! ఒకరోజు శిష్యులసహా వ్యాసుడు కాశీలో భిక్షాటన



చేయసాగాడు. అయితే ఆ రోజు ఎవరూ వ్యాసుడికి పిడికెడు అన్నం పెట్టలేకపోయారు. దాంతో వ్యాసునికి కోపం వచ్చింది. కాశీని శపించాడు.

'ఈ కాశీ మూడుతరాలపాటు దరిద్రంతో కొట్టుకోవాలి. అజ్ఞానంతో అలమటించాలి. మోక్షం అన్న మాటే ఇక్కడ వినిపించకూడదు.'

వ్యాసుని శాపానికి అన్నపూర్ణ విలవిల్లాడింది. ఆమెను భయపడవద్దన్నాడు పరమేశ్వరుడు.

ఊరికి అది ఆఖరి గడప. ఆ ఇంట అన్నం దొరికిందా సరేసరి! లేదంటే ఆనాటికి పస్తు తప్పదు అనుకున్నాడు వ్యాసుడు. ఆ ఇంటి ముందు నిలిచి బిచ్చం అడిగాడు. శిష్యులసహా ఉన్న వ్యాసుణ్ణి లోనికి ఆహ్వానించింది ఆ ఇంటి ఇల్లాలు. అందరికీ పంచభక్ష్యపరమాన్నాలతో విందు చేసింది. సంతృప్తి చెందాడు వ్యాసుడు.

'తల్లీ! నువ్వు ఉన్న ఈ ప్రాంతంలో పశుపక్ష్యాదులుసహా ఎవరూ పస్తుండరు. అలాగే ఈ క్షేత్రం అంతా సిరిసంపదలతో తులతూగుతుంది.' అని దీవించాడు. ఆ మాటకు ఇల్లాలు నవ్వుకుంది. చాటుగా ఉన్న భర్తని చూసింది. చాటు నుంచి తప్పుకున్నాడు భర్త. ముందుకు వచ్చాడు. అడిగాడిలా.

"అదేమిటి స్వామీ! గంటకి ఓ మాట! ఘడియకి ఓ మాట! ఇంతకు ముందే తమరు మూడు తరాలపాటు ఈ కాశీ దరిద్రంతో కొట్టుకోవాలనీ, అజ్ఞానంతో అలమటించాలనీ, మోక్షం అన్న మాటే ఇక్కడ వినిపించరాదనీ శపించి, అంతలోనే వరాల వెల్లువా?"

కాశీని శపించిన సంగతి తానే మరచిపోయాడు. ఈ మానవమాత్రునికి ఎలా తెలిసింది? ఆలోచనలో పడ్డాడు వ్యాసుడు. దీర్ఘంగా ఆలోచించాడు. ఆలోచిస్తే ఆ భార్యాభర్తలు మానవ మాత్రులు కారనీ, సాక్షాత్తు పార్వతీపరమేశ్వరులని తెలుసుకున్నాడు. చేతులు జోడించి నమస్కరించాడు వారికి. చేసిన తప్పు క్షమించమన్నాడు. క్షమించడం వీలుకాదన్నాడు శివుడు. తప్పు చేసినందుకు శిక్ష తప్పదన్నాడు.

'ఇకపై నీకు కాశీలోకి ప్రవేశం లేదు.' అన్నాడు. ఆ మాటకి నిలువెల్లా వణికిపోయాడు వ్యాసుడు.

'ఎంత మాట అన్నావయ్యా! గంగలో స్నానం చేసి మిమ్మల్ని సేవిస్తేనేగాని పొద్దు గడవని నాకు, ఈ కాశీలోకి ప్రవేశం లేదా? నేను ఒప్పుకోను. తప్పు చేశాను, ఒప్పుకుంటాను. అందుకు శిక్షతో పాటు నిన్ను దర్శించే భాగ్యం కూడా ప్రసాదించు." అని వేడుకున్నాడు. ఆ వేడుకోలుకి పార్వతీపరమేశ్వరులు కరిగిపోయారు.

'అయితే ఓ పని చెయ్యి! పక్షంలో ఎనిమిదవ రోజు, పదిహేనవరోజు మాత్రమే వచ్చి కాశీలో మమ్మల్ని దర్శించుకో! మిగిలిన రోజులు మాత్రం రావడానికి వీల్లేదు. వెళ్ళిపో.' అంటే వ్యాసుడు వెళ్ళిపోయాడు. వెళ్ళిపోయి అవతలిగట్టున ఉండసాగాడు. అందుకే ఆ గట్టుకి 'వ్యాసకాశి' అని పేరొచ్చింది." అని ముగించాడు మోహన్. ఆసరికి మనిషికి నాలుగు వందలు ఇమ్మంటూ వచ్చాడు పడవవాడు. వీలు కాదన్నాడు మోహన్. రెండు వందలే ఇస్తానని మొండికేశాడు. పదిహేనేళ్ళుగా తానిక్కడే ఉంటున్నాననీ, తనకి ఎంత ఇవ్వాలో తెలుసనీ అన్నాడు. ఇక్కడ ఉండీ, ఇక్కడి వాళ్ళ కష్టాన్నే దోచుకుంటావా? అని అడిగాడు పడవవాడు. దోచుకోవట్లేదన్నాడు మోహన్.

వాణితో పాటుగా సరదాగా మెట్లు దిగి, గంగను సమీపించాడు కంరు. గంగను స్పృశించాడు. ఏదో తెలియని ఆనందం. వాణిలో కూడా అదే ఆనందం. ఇద్దరూ తడి చేతుల్ని శిరస్సుకు రాసుకున్నారు.

"గంగ శిరసును అంటింది కదా! కనీసం ఓ క్వార్టర్ పాపాలు ఈ పాటికి పోయి ఉంటాయి." అన్నాడు కంరు.

"వెధవ మందు భాషా నువ్వూ, ఆపు." అంది వాణి. నవ్వింది. అంతలో గుర్తు వచ్చిందేమో! అడిగిందిలా.

"మావారి అస్థికలు నిమజ్జనం చేసేదెప్పుడ్రా?"

"అది నీ ఇష్టం. అయినా ఈ ప్రశ్న నన్ను నువ్వు అడక్కూడదు. వివరాలు కావాలంటే మోహన్‌ని అడగాలి. మంత్రాలూ, పంతుళ్ళూ పెద్ద వ్యవహారం ఉంటుంది కదే దానికి."

**దశాశ్వమేథ్ ఘాట్‌కి వెళ్ళే వీధిలో అన్నీ స్వీట్ షాపులే. అవన్నీ చూస్తూ ఒకచోట సమోసా, జిలేబీ తిని మిత్రబృందం మెల్లిగా ఘాట్‌కి చేరింది. గంగా హారతి చూసేందుకు పడవవాడితో ఓవైపు బేరసారాలు జరుగుతుంటే మరోవైపు కంరు పరిసరాలు గమనించసాగాడు. గంగలో పాప పరిహారం చేస్తున్న ఓ యువతి కంరును చూసి గతుక్కుమంది. ఆమె కళ్ళల్లో ఆందోళన? ఎవరామె? కంరుని చూసి తత్తరపడిందెందుకు?**

"అవునవును" అని ఏదో చెప్పబోతూ ఉంటే... ఆమె మాటల్ని పట్టించుకోక కన్నార్పకుండా కుడివైపు చూస్తున్న కంరుని గమనించింది వాణి.

"అటేం చూస్తున్నావు?" అడిగింది.

"ఇప్పుడే వస్తాను" అన్నాడు కంరు. పరుగులాంటి నడకతో కుడివైపు బయల్దేరాడు అక్కణ్ణుంచి.

"తప్పో ఒప్పో జరిగిందేదో జరిగిపోయింది. ఇక దాని గురించి ఆలోచించకు. చెప్పిన పని చెయ్యి. గంగలో మూడు మునకలు వేసి పద! శివుణ్ణోసారి చూసుకుని, మన ఊరు మనం పోదాం."

తండ్రిలా ఉన్నాడు. ఏభై ఏళ్ళుంటాయతనికి. ప్యాంటూ షర్టు మీద ఉన్నాడు. కళ్ళద్దాలు కూడా ఉన్నాయి. ఓ చేత్తో ఆ కళ్ళద్దాలు సర్దుకుంటూ, మరో చేత్తో ఏడుస్తున్న యువతిని పట్టుకుని నడిపిస్తున్నాడతను. ఆ యువతి చేతిలో చిన్న బ్యాగు ఉంది.

"అలహాబాద్‌లో త్రివేణీసంగమంలో స్నానం చేశావు. ఇప్పుడు ఈ గంగలో స్నానం చేస్తున్నావు. నిన్ను పరిశుద్ధి చేసేందుకు ఇంత కన్నా పవిత్ర జలాలు లేవు." అన్నాడతను. కన్నీళ్ళతో చూసింది ఆ యువతి.

"ఈ కాలంలో ప్రేమలూ, దోమలూ అంటూ వెంటపడకూడదమ్మా! పడితే ఇదిగో ఇలాగే ఏడవాల్సి వస్తుంది." అన్నాడతను.

"వాడికి కావాల్సింది నీ ప్రేమ కాదమ్మా! నీ యవ్వనం కావాలి. వాడుకున్నాడు. వెళ్ళిపోయాడు. వెళ్ళిపోతూ వెళ్ళిపోతూ వాడి అడుగుజాడలు నీ కడుపులో వదిలేశాడు. వాటిని వదిలించుకుందికి ఇంత దూరం రావాల్సి వచ్చింది." అన్నాడతను.

ఆ యువతి నిల్చున్న చోటనే కూలబడి రోదించసాగింది. కింది మెట్టు మీద వాళ్ళుంటే పై మెట్టు మీద ఉండి, అంతా గమనిస్తున్నాడు కంరు.

"వెళ్ళు! స్నానం చెయ్యి." అన్నాడతను.

యువతి గంగలోకి దిగింది. ఓ మునక వేసింది. లేచింది. రెండో మునక వేసింది. లేచింది. మూడో మునక వేసింది. లేచింది.

"ఇదిగో ఈ నల్లగౌను కూడా గంగలో కలిపేయ్." అరిచాడతను. బ్యాగులోని బురఖా తీసి విసిరాడు. దాన్ని అందుకుంటూ గట్టు మీది కంరుని చూసి దిగ్భ్రాంతి చెందిందామె. తెల్లారుజామున రైల్లో చూసింది అతన్ని. ఇప్పుడిక్కడ చూస్తోంది. ఎందుకు వచ్చాడిక్కడి? ఆమె కళ్ళు అనేక అనుమానాలతో విచ్చుకున్నాయి. ఆమె ముక్కూ, పై పెదవీ అదరసాగాయి.

అదురుతున్న ముక్కుకీ పై పెదవికీ మధ్య గల పుట్టుమచ్చ, ఆమె జీవితానికే మాయని మచ్చలా కనిపించింది కంరుకి. చివాలున తల తిప్పుకున్నాడతను. వాణి పిలుస్తోంటే అటుగా వెళ్ళిపోయాడు.

**(సశేషం)**



# కామరూప

-డాక్టర్ ధేనువకొండ శ్రీరామమూర్తి
సెల్: 98852 97983

**ఐఫోను చిరుగంట చిన్న మెసేజ్ అందించింది. మెసేజ్ చూసుకుని ఆశ్చర్యపోయాడు డాక్టర్ రామచంద్రుడు. తమ్ముడు రవి అకస్మాత్తుగా ఇండియాకి వస్తున్నట్లు మెసేజ్ సారాంశం. సడన్‌గా రావటం కొంచెం కలవర పెట్టింది. ఫ్లైట్ టైం నోట్ చేసుకుని టైం చూసుకున్నాడు. వెంటనే డ్రైవర్‌ను కేక వేసి నిద్రలేపాడు. రవి రాక గురించి భార్యకు చెప్పి ఎయిర్‌పోర్టుకు బయల్దేరాడు.**

అర్ధరాత్రి దాటడంతో ట్రాఫిక్ పూర్తిగా తగ్గిపోయింది. తను హాస్పిటల్ నుంచి రావటం బాగా ఆలస్యం అయింది. మరునాడు జరగాల్సిన "సైబర్‌నైఫ్" ప్రారంభోత్సవ ఏర్పాట్లు చూడటంతో బాగా ఆలస్యం అయింది. ఈ సందర్భంగా అమెరికా నుండి వచ్చే డాక్టర్ దాక్షాయిణికి ఆహ్వానం పలికే ఏర్పాట్లను ఆంకాలజీ డిపార్ట్‌మెంట్ వారు చూస్తుండటంతో తను వెళ్లలేదు.

రవి కోసం రావటం యాదృచ్ఛికమే! దాక్షాయిణి వచ్చేది కూడా అదే ఫ్లైట్ కావటం సంతోషం కలిగించింది.

తమ్ముడు రవి ఇండియా వచ్చి చాలా కాలమైంది. రెండు సంవత్సరాల క్రితం కాన్ఫరెన్స్‌కు వెళ్ళినప్పుడు న్యూయార్క్‌లో కలవటం జరిగింది.

అమెరికాలో తను బోస్టన్ యూనివర్సిటీ హాస్పిటల్‌లో పని చేస్తూ ఉన్నప్పుడు, రవికి ఇష్టం లేకపోయినా తన బలవంతం మీద అమెరికా రావటం, సెటిల్ అవడం జరిగింది. గ్రీన్‌కార్డు వచ్చినా కూడా డాక్టర్ రామచంద్రుడు ఇండియా తిరిగి రావడం యాదృచ్ఛికం.

రాజీవ్‌గాంధీ ఇంటర్నేషనల్ ఎయిర్‌పోర్టు చేరుకున్నాడు. ఎరైవల్ లాంజ్‌లో కూర్చున్నాడు. డాక్టర్ దాక్షాయిణీ రిసీవల్‌కు వచ్చిన వారు రామచంద్రుణ్ణి చూసి దగ్గరగా వచ్చి విష్ చేశారు. "అదేమిటి సార్! మీరు శ్రమ తీసుకుని వచ్చారు!" ఆశ్చర్యపోయి అడిగారు.

"మా బ్రదర్ రవి వస్తున్నాడు ఇదే ఫ్లైట్‌లో, అందుకని" వివరించాడు రామచంద్రుడు.

పొద్దున వచ్చిన దాక్షాయిణి మెయిల్ పదే పదే గుర్తుకు వస్తోంది.

"రామచంద్రా, నీ దగ్గరకు వస్తున్నందుకు చాలా సంతోషం. నీ గురించి వార్తలు వింటుంటే మీ అమ్మగారి ఆశయాలు నెరవేరుస్తున్నందుకు చాలా చాలా సంతోషం. అక్కడికి రావడం చాలా ఆసక్తిగా ఉంది." బిజీగా ఉన్నా చాలా సార్లు మరలామరలా ల్యాప్‌టాప్‌లో చూసుకొని చదువుకున్నాడు.

కొన్ని ఫీలింగ్స్ అర్థమయ్యేవి కావు. రూపరహితంగా ఉంటాయి. పలవరించాల్సిందే.

(కొత్త సీరియల్ ప్రారంభం)

ప్రయాణికులు ఒక్కొక్కరు రావటం మొదలయింది. ఇంక ఒక్క క్షణంలో దాక్షాయిణిని చూడబోతున్నాడన్న ఆనందం, రవి వస్తున్నాడన్న ఆసక్తితో లేచి నుంచొని కొంచెం ముందుకు జరిగాడు రామచంద్రుడు.

దాక్షాయిణి వస్తోంది.

ఇంద్రజాలిక లీలాలొలిత చంచరీకం! రామచంద్రుడిని గుర్తుపట్టి నవ్వుతూ విష్ చేస్తూ వస్తోంది. దగ్గరగా వస్తోంది. తన ఒంటి పరిమళం, హాయిని నింపేసింది.

మాయమ్మై సాక్షాత్కరించిన అనుభూతి. ఎన్నాళ్ళైంది. ఇలా కలిసినప్పుడు 'ఇప్పటి దాకా విడి

## నవ్యవీక్లి-లక్ష్మీనారాయణ జైని మెమోరియల్ ఛారిటబుల్ ట్రస్ట్ సంయుక్త నిర్వహణలో

# ద్వితీయ బహుమతి పొందిన నవల

పోయి ఉన్నాం' అనే స్పృహ ఇద్దరిలో అలజడి కలగ జేసింది. దాక్షాయిణిని చూడగానే ఇప్పటిదాకా మనసులో రవి గురించిన ఆందోళన తగ్గి, ఎదురేగి నిలబడ్డాడు.

"ఎలా ఉన్నావు" ఆప్యాయంగా అడిగింది.

"నువ్వెలా ఉన్నావు" ఎదురు ప్రశ్నించాడు నవ్వుతూ.

"ఐ యామ్ లీవింగ్ ఫరెవర్" అని చెప్పి వెళ్లిన దాక్షాయిణి, ఇప్పుడు తన ఎదురుగా.

ఇద్దరి ముఖాలపై చిరునవ్వులు మొలిచాయి. చేతిమీద చేయివేసి ఆర్ద్రంగా అద్దింది దాక్షాయిణి. రిసీవల్‌కు వచ్చిన వారు ఫ్లవర్ బొకే అందజేశారు.

దూరంగా మరదలు రమ్య రావడం కనబడింది. రవి కూడా ఇదే ఫ్లైట్‌లో వస్తున్నాడని, తనని గెస్ట్‌హౌస్‌కి వెళ్ళమని, అక్కడికి వచ్చి కలుస్తానని చెప్పి, బై చెప్పాడు. హాస్పిటల్ సిబ్బందితో దాక్షాయిణి వెళ్ళింది. రమ్యకు కొంచెం దూరంలో వీల్‌చెయిర్‌లో రవి కూర్చుని వస్తున్నాడు. వడివడిగా రవి దగ్గరకు వచ్చాడు. రమ్య పలకరించింది.

అందరూ మౌనంగా కారు దగ్గరకు నడిచారు. ఎవ్వరూ మాట్లాడలేదు. ఇంటికివెళ్ళాక రూమ్‌లో విశ్రాంతిగా పడుకో బెట్టి వచ్చింది రమ్య.

రామచంద్రుడు అమ్మగారు వసుంధర, రమ్య హాల్లో కూర్చున్నారు. అందరికి కాఫీలు తెచ్చింది రామచంద్రుడి భార్య సీత.




మెల్లమెల్లగా కాఫీ తాగుతూ, "అసలేమైంది. ఇంత సడన్‌గా రావటం, వీల్‌ఛైర్‌లో రావడం ఏమిటి? ఏమైంది?"

"నేను హెల్ప్‌లెస్, డ్రెడెడ్ సిట్యువేషన్" అంది రమ్య.

"ఎనీ క్రైసిస్?"

"రవికి పిచ్చి తలనొప్పి, పిచ్చి కోపం. మానియాక్ అయ్యేవాడు. సైకియాట్రిస్ట్‌కి చూపించా. కౌన్సెలింగ్ చేయించా. ఉపయోగం లేదు. మీ హెల్ప్ ఉంటుందని సడన్‌గా బయల్దేరి వచ్చాం. ఒక రకంగా పోలీస్‌హెల్ప్ కూడా తీసుకున్నా".

గతంలో అనుభవాల్ని గుర్తుకు తెచ్చుకుంటూ ఆవేశంగా భయానకంగా చెప్పుకుపోతోంది రమ్య. ముఖమంతా చెమటలు పట్టాయి. వసుంధర లేచి దగ్గరగా వెళ్లి తల మీద చేయి వేసి నిమురుతూ సాంత్వన పరుస్తోంది.

రవి లేచిన శబ్దం అయింది.

అందరూ లోనికి వెళ్ళారు. వసుంధర బెడ్ మీద కూర్చుని రవి నుదుటి మీద చేయి ఉంచి "నిద్ర లేచావా నాన్నా" అంటూ తల నిమురుతోంది.

"అవునమ్మా, బాగా నిద్రపట్టింది. హాయిగా ఉంది".

"లే రవి, కాఫీ తాగుదువుగాని" అన్నాడు రామచంద్రుడు.

తల్లి వసుంధర ఆదేశం ప్రకారం రామ చంద్రుడు అమెరికా నుంచి రావడం, ఇక్కడ ఆధునిక వైద్య సదుపాయం కల్పించే సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్ ఏర్పాటు చేయడం జరిగింది. అమెరికాలో గడించిన అనుభవం బాగా తోడయింది రామ చంద్రుడికి. కేవలం సేవా దృక్పథం కాకపోయినా అందరికీ అనుకూలంగా ఉంటూ ఒక దశాబ్ద కాలంలో అత్యున్నత స్థాయికి చేరింది. కేన్సరుకు సంబంధించి ఇటీవలి కాలంలో స్టాన్‌ఫోర్డ్ యూనివర్సిటీలో ప్రొఫెసర్ జాన్‌రాడ్లెర్ ఆధ్వర్యంలో కనుగొన్న 'సైబర్ నైఫ్ రేడియేషన్ థెరపీ' న్యూరోసర్జరీలో అత్యంత ప్రాచుర్యంలోకి వచ్చింది. అక్కడే తర్ఫీదు పొందిన డాక్టర్ దాక్షాయిణి కొంత కాలం ఇక్కడే ఉండి, ఆమె ఆధ్వర్యంలో సర్జన్లకు తర్ఫీదు ఇచ్చే విధంగా కార్యక్రమం ఏర్పాటు చేయబడింది.

హాస్పిటల్ అంతా పండుగ వాతావరణం ఉంది. కేన్సరు వ్యాధి చికిత్సలో గొప్ప విప్లవాత్మక మార్పు వస్తుందని ఇక్కడి డాక్టర్లలో విశ్వాసం నెలకొంది. ఎవరికి తోచిన విధంగా వారు భాష్యాలు చెప్పుకుపోతున్నారు.

రవి విషయంలో రామచంద్రుడి అంతరంగం కల్లోలమై ఉంది. ఉత్సాహం కొరవడింది. రేడియాలజీలో ప్రపంచ ప్రసిద్ధుడైన డాక్టర్ సుబ్బారావు

గారు ఫంక్షన్‌కి వచ్చారు. జ్యోతి ప్రకాశనం కావించి డా. సుబ్బారావుగారు డిక్లేరు చేశారు. డా. దాక్షాయిణిని పరిచయం చేస్తూ, "ఇద్దరం ఎం.బి.బి.ఎస్‌లో సహాధ్యాయులం. ఆమె ఎంతో డెడికేటెడ్‌గా కృషి చేసి వైద్యరంగంలో ఉన్నత శిఖరాలు అందుకుంది. ఆమె మన సంస్థకు రావడం నిజంగా మన అదృష్టం" అన్నాడు రామచంద్రుడు.

డా. దాక్షాయిణి మాట్లాడుతూ "డా. రామచంద్రుడు గారు అమెరికాలో ఉండి ఉంటే ఆయనకు నోబెల్‌ప్రైజ్ వచ్చి ఉండేది. పరిశోధనా సమయంలో ఇండియా వచ్చారు. అయితే ఆయనకు పరిపూర్ణమైన తృప్తి ఉంది. అది ఏమిటంటే తల్లి మాట గౌరవించి ఇక్కడ వైద్య సేవ చేయడం".

"ఈ సైబర్‌నైఫ్ చికిత్స రోబో టెక్నిక్ ద్వారా చేసే రేడియేషన్ చికిత్స.

దీనిలో ఉండే విశేషగుణం కేవలం కేన్సర్ కణాలను నిర్మూలించడం, ఆరోగ్య కణాలకు ఎటువంటి నష్టం కలగకుండా చేయడం.

ఇది కేన్సర్ చికిత్సకు ప్రత్యామ్నాయం కాదు. సున్నితమైన ప్రదేశంలో రేడియేషన్ చికిత్సకు ఉపయోగం".

పవర్‌పాయింట్ ప్రెజెంటేషన్ ఏర్పాటయింది. సభ అనంతరం శాంతి మంత్రం చదివారు. విందు కార్యక్రమం జరిగింది. డా. దాక్షాయిణి చుట్టూ మీడియా వారు అందరూ మూగారు, ప్రశ్నల పరంపర కొనసాగింది. చాలా ఓర్పుతో సమాధానం చెప్పింది.

వసుంధర రెండు మూడుసార్లు రవి గది లోకి వెళ్ళి తిరిగి వస్తున్నది. రవి మంచి నిద్రలో ఉన్నాడు. ఎంతసేపటి నుంచో నిద్రపోతూ ఉన్నాడు. లోనికి వెళ్ళి మరలా తిరిగి వస్తోంది.

"జెట్‌లాగ్" ఉంటుంది, నిద్ర లేపవద్దు. "రామచంద్రుడి మాట పదేపదే గుర్తుకు వచ్చి లేపలేదు. డా. దాక్షాయిణి లంచ్‌కి ఇంటికి వస్తుంది అని చెప్పటంతో సీత లంచ్ ఏర్పాట్లలో ఉంది.

"ఎక్కడయినా హోటల్లో అరేంజ్ చేయక పోయారా. మన వంట నచ్చుతుందో లేదో" ప్రశ్నార్థకంగా అంది సీత.

"అమ్మను చూడటానికి ఇంటికి వస్తానంది. సరేనని లంచ్‌కి రమ్మన్నాను".

"ఎన్నాళ్లు ఉంటుందో..."

"నెల రోజులు".

"ఈ నెల మీరు బిజీ అన్నమాట".

ఆమెకేసి వింతగా చూశాడు రామచంద్రుడు. అంటే ఇన్ని సంవత్సరాలయినా ఆమె మనసు లోంచి అనుమానం తొలగి పోలేదన్నమాట.

ఎంతో విశిష్టమైన చికిత్సను తనే ప్రథమంగా ఆవిష్కరించబోతున్నాను అనే సంతోషం ఆవిరయింది. ఈ విరుపు మాటలు ఎంతగా బాధిస్తాయి. ఎన్ని సార్లు చెప్పినా అర్థం కాదు. తనను లంచ్‌కు పిలవకుండా ఉండాల్సింది అనిపించింది.

కాలేజ్ రోజుల జ్ఞాపకాలు దృశ్యమాలికలా కదలాడింది. తను, దాక్షాయిణి క్లినికల్ క్లాసుల్లో పక్కపక్కనే ఉండటం, స్వరూప స్వభావాలు ఒకేలా ఉండటం, తర్కించుకోవటం, పరస్పర ఆరాధన ప్రేమలేఖల్లో వ్యక్తం కావడం మొదలైంది.

తన ప్రేమ, స్నేహం, ఇష్టం, ఆకర్షణ తన చుట్టూ అందమైన కలలా ఒక రహస్యంలా ఎవరికీ తెలీకుండా పదిలంగా ఉంచుకోవాలనిపించేది.

ఆ వయస్సులో తెలిసింది ఒక్కటే. ప్రేమ అంటే అది పెళ్లికి దారితీయాలి. ప్రేమలోని ఊహలన్నీ పెళ్లి చుట్టూ పెనవేసుకునేవి. కానీ లోలోపల ఇద్దరికీ సంకోచం, భవిష్యత్తు గురించి ఎన్నో భయాలు, ఇద్దరివీ మధ్య తరగతి కుటుంబాలే, ఆర్థిక ఒడిదుడుకుల జీవితాన్ని కలిసి పంచుకుంటే ప్రేమను నిలబెట్టుకోగలమా? కొన్ని ఫీలింగ్స్ అర్థం కావు. కావాలని ప్రేమలో పడాలనుకుంటే పడం కానీ తెలీకుండానే కూరుకుపోతాం. అదీ ప్రేమకున్న బలం.

మిత్రుడు వరదం తన బర్త్‌డే పార్టీ ద్వారకా హోటల్‌లో ఏర్పాటుచేసి సన్నిహితులందర్నీ ఆహ్వానించాడు. పార్టీ అయ్యాక "కొద్దిసేపు కూర్చొని మాట్లాడుతూ ఉండండి. అందరినీ పంపించి వస్తాను" అని వరదం రూం తాళాలు ఇచ్చి వెళ్లాడు.

"రూమ్‌లో కూర్చోమన్నాడు వరదం" అని చెప్పాడు రామచంద్రుడు.

"రూమ్‌కి వెళ్ళాలా?" కోపం, అసహనం, ఆశ్చర్యంతో ప్రశ్నించింది దాక్షాయిణి.

"కొన్నిక్షణాలు ప్రశాంతంగా కూర్చుందామని తాళాలు తీసుకున్నా".

దాక్షాయిణి ముఖంలో కోపం తగ్గలేదు. తను లిఫ్ట్ వైపు నడిచాడు. తనూ అనుసరించింది.

"నాకిష్టం లేని పనులు, నాకు తెలీకుండానే చేసేట్లయితే నేనసలు నీతో మాట్లాడను" నిశ్చయంగా అంది.

లిఫ్ట్ తెరుచుకుంది.

"లేడీస్ ఫస్ట్" అంటూ వంగి చేతులు చాపాడు.

ఫ్లోర్ బటన్ నొక్కాడు. లిఫ్ట్ తలుపులు మూసుకున్నాయి.

ఒంటి పరిమళం అతన్ని మత్తెక్కించింది. తనను తాను నిగ్రహించుకోలేక, సడన్‌గా ఆమె పెదవుల్ని సున్నితంగా తన పెదాలతో స్పృశించాడు.

ఏం జరిగిందో తెలిసేలోగా వివశమైపోయింది. మరుక్షణంలోనే అతన్ని నెట్టేసింది.

లిఫ్ట్ ఆగింది. ఒక్క ఉదుటున బయటకు దూకింది.

ఆమె శరీరం ప్రతి అణువులో ఓ ప్రకంపనం.

ఎరుపెక్కిన చెక్కిళ్లతో ఆమె ముఖం అంతా ఎరుపెక్కింది.

వచ్చి పక్కనే నిలబడ్డాడు.

"సారీ, ఆగలేకపోయాను".

గబగబా మెట్ల వైపు నడిచింది.

"ప్లీజ్ వెళ్ళొద్దు, ఈ ఒక్కసారి నా మాట విను"

"వరదం వచ్చే దాకా ఉండి వెళదాం" అని బ్రతిమలాడాడు.

మౌనంగా ఉండిపోయింది.

అతని కళ్లల్లో ఆరాధన భావం ఆమెను ఆపేసింది.

**అమెరికాలో శాశ్వత పౌరసత్వ జీవితాన్ని వదులుకుని తల్లి ఆదేశంతో సొంతూరు చేరుకుని అత్యాధునిక ఆసుపత్రి స్థాపించాడు. ఇష్టంలేని పెళ్ళితో జీవితంలో అడ్జస్ట్ అయిపోయాడు. కేన్సర్ చికిత్సలో అత్యాధునికమైన సైబర్ నైఫ్ టెక్నాలజీని తన ఆసుపత్రిలో ఆవిష్కరించాడు. దాక్షాయిణి దానికి ఆలంబనగా నిలిచింది. ఆమె ఎవరు? అతడికి ఏమవుతుంది? ఆసుపత్రిలో ఏం జరిగింది?**

## ఒక్కటంటే ఒక్క సినిమా కూడా లేదు...

*'నీర్జా' తరువాత సోనమ్ బిజీ అవుతుందని బాలీవుడ్‌లో చాలా మంది భావించారు. కానీ వారనుకున్నదేదీ జరగలేదు. ఆ సినిమా విడుదల తరువాత సోనమ్ ఏ సినిమాను ఒప్పుకోలేదు. తోటి హీరోయిన్లు షూటింగ్‌లతో బిజీగా ఉంటే తను మాత్రం చేతిలో సినిమాలు లేక ఖాళీగా ఉండడంతో సోనమ్ డిప్రెషన్‌లోకి వెళ్ళిందట! 'నీర్జా' మంచి విజయాన్నే సాధించినా అవకాశాలు రాకపోవడం పట్ల ఆమెతో పాటు ఆమె సన్నిహితులు బాధపడుతున్నారట!*

రూమ్‌వైపు దారితీశారు. అంతలో వరదం వచ్చాడు. రూమ్‌లోకి వెళ్లకుండానే "బై" చెప్పి వచ్చేశారు.

•••

ఆ క్షణం నుంచి అతని కళ్లలో తన మీద ఆరాధన భావం గమనించినప్పుడల్లా మరో ఆలోచన లేకుండా అతని చేతుల్లో వాలిపోవాలనిపించేది దాక్షాయిణికి. స్త్రీ సహజమైన గుణం లాంటిది ఏదో తొంగిచూసేది. తన అందం మీద, తన దేహం మీద, తన వ్యక్తిత్వం మీద తనకొక ఆత్మ విశ్వాసం కలిగినట్లు అనిపించేది.

ఉదయం నిద్రలేవగానే రామచంద్రుడికి కలిగే ఆలోచన దాక్షాయిణి రూపం, రాత్రి పడుకునే ముందు దిండు మీద తలవాల్చినప్పుడు వచ్చే చివరి ఆలోచన దాక్షాయిణికి రామచంద్రుడి రూపం, ఇప్పుడు ఏం చేస్తుంటారు అనే ఊహ. ఇద్దరిదీ అదే పరిస్థితి.

•••

రామచంద్రుడు లంచ్‌కి ఇంటికి వెళ్లేప్పటికి దాక్షాయిణి వచ్చి ఉంది. అందరూ వెయిట్ చేస్తున్నారు.

"సారీ, లేటైంది. ఎమర్జెన్సీ కేస్ అటెండ్ అవ్వాల్సి వచ్చింది".

"పరవాలేదు, అమ్మగారితో పాత సంగతులు గుర్తు చేసుకుంటున్నాను" అని ఆగి.

"ఏది రవి బాగా సిక్ అయ్యాడట, రమ్య పరిచయం అయింది. ఇప్పుడే తను చెప్తోంది" అంది దాక్షాయిణి.

"యస్, కొంచెం డీటైల్డ్‌గా డిస్కస్ చేయాలి, భోజనాల తర్వాత" నెమ్మదిగా అన్నాడు రామచంద్రుడు.

"నో నో, ఇప్పుడే చేద్దాం, గెట్ ఆల్ ది రిపోర్ట్స్".

రవిని డిస్టర్బ్ చేయకుండా రిపోర్ట్స్ అన్నీ రమ్యను తెమ్మన్నాడు. తీసుకువచ్చి అన్నీ వివరంగా చూపిస్తూ ఎవరెవర్ని కన్సల్ట్ చేసిందీ వివరంగా చెప్పింది.

"వెల్ ఐ వాంట్ టు సీ రవి లేటర్".

"ఓకే!" అని అందరూ లేచారు డైనింగ్ టేబుల్ దగ్గరకు.

తెల్లని కాటన్‌చీర, గులాబీ రంగు చిన్నచిన్న పూలు, పల్లూ మీద పూలతో పాటు సన్నని తీగలు, లేత ఆకులతో ధరించిన చీరలో సీత ఆకర్షణీయంగా ఉంది.

"మీరూ రండి సీత గారు" అంది దాక్షాయిణి.

"మీరు కూర్చోండి నేను తరువాత వస్తాను" అంది సీత.

"కూర్చో సీతా, నేను వడ్డిస్తా కూర్చో" అంది వసుంధర.

లేచొచ్చి వసుంధర వడ్డిస్తోంది.

రవి, రమ్య కూడా వచ్చి జాయిన్ అయ్యారు.

రవిని దాక్షాయిణికి పరిచయం చేశాడు రామచంద్రుడు.

"ఆర్ యూ కంఫర్టబుల్".

"బెటర్ టుడే" అన్నాడు రవి.

"వంట చాలా బాగుంది సీత గారు. ఎన్నాళ్ళయిందో ఈ రుచి, వాసన ఆస్వాదించి, చాలా చాలా థాంక్స్" అంది మెచ్చుకోలుగా.

"చాలా సంతోషం, అసలు మీరు గెస్ట్‌హౌస్‌లో ఎందుకు? మా ఇంట్లోనే ఉండొచ్చు గదా?" అంటూ రామచంద్రుడి వైపు చూసింది సీత.

నిశ్శబ్దంగా ఆలోచిస్తూ తింటున్నాడు రామచంద్రుడు.

"అవునమ్మాయి, ఇక్కడ ఉన్నంతకాలం, ఇక్కడే మాతోనే ఉండమ్మా" అంది వసుంధర.

భోజనాలు అయ్యాక బయలుదేరుతూ, రవిని సాయంత్రం హాస్పిటల్‌కు తీసుకు రమ్మంది రమ్యతో.

•••

ఇంటి వాతావరణం వింతగా అనిపిస్తోంది రామచంద్రుడికి. అంతా కలిసిపోయి ఆప్యాయంగా మాట్లాడుకుంటున్నారు. వసుంధర అన్న కూతురు సీత. సీత నాన్నగారు మంచి స్థితిపరులు. రామచంద్రుడు హౌస్‌సర్జెన్సీ టైంలో సీత పెండ్లి విషయమై బాగా ఒత్తిడి తెచ్చారు. కుటుంబ ఆర్థిక పరిస్థితి దృష్ట్యా రామచంద్రుడు ఒప్పుకోక తప్పలేదు. తల్లి ఒత్తిడి ఎక్కువయింది. పరిస్థితులను ఎదుర్కోలేని మనస్తత్వం ఒప్పుకునేలా చేసింది.

సీత మాటతీరు తనకు అంగీకారం కాదు. అహంభావంతో కూడిన ఆమె అందం చాలా అసౌకర్యంగా ఫీల్ అవుతాడు రామచంద్రుడు.

## అవసరం అయితే చూపిస్తుందట!

*హీరోయిన్ నందిత, దర్శకనిర్మాతలకు బంపర్ ఆఫర్ ఇచ్చేసింది! ఇప్పటి వరకూ నందిత సినిమాల్లో పెద్దగా స్కిన్ షో చేయడం కానీ, గ్లామర్‌గా కనిపించడం గానీ చేయలేదు. అలా చేయమని నన్నెవరూ అడగలేదు. నేను చేయలేదు. అవసరమైతే పై రెండింటికీ నేను రెడీ. అవసరానికి తగ్గట్టు చూపించడానికి నేను ఎప్పుడూ రెడీనే అంటోంది.*



తన ఇష్టంతో నిమిత్తం లేకుండానే నిర్ణయం జరిగిపోయింది.

ప్రేమించడం నేర్పలేని వివాహ వ్యవస్థను అనుమానిస్తూనే అంగీకరించాడు. కేవలం తల్లి మాట గౌరవించడం వలనే వివాహం జరిగింది.

స్త్రీ, పురుషుల మధ్య ప్రేమ ప్రసక్తి లేకుండా అనంగీకారంగానే వివాహం జరిగిపోయింది. అతని ఉద్దేశంలో ఇద్దరు వ్యక్తులు తమ వ్యక్తిత్వాన్ని, స్వార్థాన్ని, నేను అనే చైతన్యాన్ని నాశనం చేసుకునే సందర్భం పెళ్లి అంటే. ప్రేమ లేని వివాహాలు వ్యక్తులను బాధిస్తాయి. యాంత్రికంగా సాగిపోతాయి.

సీత అందమైనదే. పెద్ద కళ్ళు, గుండ్రటి ముఖం. తనూ అందగత్తే. సందేహం లేదు. కానీ అప్పటికప్పుడు అకారణంగానే వికృత రూపం ధరిస్తుంది. ఆమె వికృతానికి కారణం తాను అందగత్తెనన్న అహం.

ధనవంతుల బిడ్డనన్న నిర్లక్ష్యం. దానితో ఆమెలోని అసలు అందం హరించుకుపోయిందని రామచంద్రుడి భావన.

నిజానికి ఒక్కో మనిషికి ఎన్ని ముఖాలో! ఎన్నెన్ని కోర్కెలో! చిరునవ్వులు, కొరివి ముఖాలు! ఎప్పటికి ఏది అవసరమో, అది ఆ ముఖంలోకి దూరిపోవటంతో ముఖం మనసు, రంగు మారిపోతాయి.

కేవలం పిల్లల కోసమే దాంపత్యం. ఆమెకు ఇష్టమైనప్పుడే ఆమెను తాకాలి. అసలు తాము కలుసుకునేది జీవి సృష్టి కోసమే. అయినా మరో జీవి వారి మధ్యకు రావడానికి జంకుతోంది.

పెళ్లయిన వారం రోజుల్లోనే అర్థం అయింది రామచంద్రకు వారి దాంపత్య పరిస్థితి.

బెడ్రూంలో మంచానికి అడ్డంగా పడుకొని నిద్రిస్తోంది సీత. నిద్రలో కూడా తన అందాన్ని ద్విగుణీకరించుకుని విలాసంగా నిద్రిస్తోంది. అందం తెచ్చుకున్న కనుబొమ్మలు, అసలే పెద్దకళ్ళు, నిద్రలో కూడా తృణీకారం తొంగి చూస్తోంది.

నేను నిద్రిస్తుంటే ఎలా ఉంటాను? ప్రశాంతంగానే ఉంటానా? నన్ను కూడా సీత ఇలాగే గమనిస్తుందా? రామచంద్రుడిలో ఆలోచనల పరంపర సాగుతోంది.

•••

కన్సల్టేషన్ చాంబర్ వెనక ఉన్న ఖాళీ రూంలో ఇద్దరూ కాఫీ తాగుతూ కూర్చున్నారు.

హాస్పిటల్ వ్యవహారాలు చర్చకు వచ్చాయి. రామచంద్రుడు చర్చించడానికి పెద్దగా ఆసక్తి చూపించలేదు.

"ఆ సంగతులు సరే, నీ సంగతి ఏవిటి, దాదాపు ఏభై సంవత్సరాలు వస్తున్నాయి. ఎన్నాళ్లిలా? జీవితానికి అర్థం, గమ్యం ఏమీ లేవా? ఒంటరిగా ఎన్నాళ్లు చెప్పు" అడిగాడు రామచంద్రుడు.

"రామ్, ఈ ప్రపంచంలో జీవితానికి అర్థం, గమ్యం అంటూ ఆలోచించేది ఒకే ఒక జీవి. అది మనిషి పుట్టటం, పెరగటం, పునరుత్పత్తి, చావటం మాత్రమే జీవితం" అంటూ చప్పరించింది.

"నీ మేధ చాలా గొప్పది. యూ ఆర్ జీనియస్. ఇప్పుడు గొప్ప వేదాంతిగా తయారయ్యావు" లోపలి అంతరంగాల్లో ఎగిసిన భావన.

జీవిత భాగస్వామిగా ఒకరినొకరు ఊహించుకుని కాలం ముందు తలవంచారు. ఏదో శూన్యం ఇద్దరినీ వెంటాడుతూనే ఉంది. సుఖాలు, దుఃఖాలు కొంతకాలం మాత్రమే! అవి ఆవిరైపోయి శూన్యం మిగులుతుంది.

"నీకు అన్నీ తెలుసనుకుంటావు కానీ.." ఆగిపోయి, "అదేమిటీ? నా మీద నీకు ప్రేమ, ఆరాధన ఈ రోజున లేవు అని చెప్పగలవా?" సూటిగా కళ్లల్లోకి చూస్తూ ప్రశ్నించింది.

దాక్షాయిణికి దగ్గరగా జరిగాడు. ఆమె దూరంగా జరగలేదు. చేతిమీద చేయివేసి ఆర్ద్రంగా అంది దాక్షాయిణి, "నీ శూన్యానికి కారణం నిన్ను... నీవు కోరుకున్నది నీ దగ్గర లేకపోవడమే!"

"మనం కోరుకున్నది పొందలేకపోవడమే".

"ఏదో శూన్యం నన్ను వెంటాడుతోంది. జీవితానికి అర్థం గమ్యం అంటూ లేకపోవడం ఒకటి. సుఖాలు దుఃఖాలు కొద్దిసేపే. అవి అంతం కాగానే అంతా శూన్యం. దాంతో అసహనం" తన అంతరంగాన్ని ఆవిష్కరించాడు రామ్.

"నువ్వే అన్నావుగా తలవంచేసుకున్నాను" అని.

సెల్ మోగింది. ఇంటి నుంచి రమ్య కాల్.

"రవికి బాగా తలనొప్పి వచ్చింది. వాంతులు కూడా అవుతున్నాయి" ఆందోళనగా చెప్తోంది.

వెంటనే ఇంటికి అంబులెన్స్ పంపే ఏర్పాటు చేసి హాస్పిటల్‌కి తీసుకువచ్చే ఏర్పాటు చేశారు.

ఎమర్జెన్సీ వార్డుకు వెళ్లి డాక్టర్లను ఎలర్ట్ చేశారు. రవిని తీసుకువచ్చి సెడేషన్ ఇచ్చి ఐ.సి.యు.లో ఉంచి రక్త పరీక్ష శాంపిల్స్ తీశారు.

దాక్షాయిణి ఎం.ఆర్.ఐ., బ్రెయిన్ ఏర్పాట్లు చూస్తోంది. రేడియాలజీ డిపార్ట్‌మెంట్ హెడ్ స్వయంగా అన్నీ చూస్తున్నాడు. మధ్యాహ్నానికి పరీక్షలన్నీ పూర్తి అయ్యాయి. మెదడులో ట్యూమర్ తలనొప్పికి కారణం అని తేలింది. వెంటనే గ్రూప్ డిస్కషన్ ఏర్పాటయింది. అందరూ ఆయా విభాగాల నిపుణులు చర్చలో పాల్గొన్నారు.

సైబర్‌నైఫ్ చికిత్స బాగా ఉపయోగపడుతుందని దాక్షాయిణి చాలా కాన్ఫిడెంట్‌గా చెప్పింది.

సైబర్‌నైఫ్ ఇన్‌స్టలేషన్ అప్పటికే పూర్తవడం అనుకూలించింది. డాక్టర్లకు ఆ పరికరం ఉపయోగించడంపై అవగాహన కల్పించే విధంగా వివరాలు తెలియజెప్పింది. యూనిట్‌ను సిద్ధం చేసింది.

ఇటువంటి ఆధునిక పరికరం ఇప్పుడే ఏర్పాటు కావటం, రవి మొదటి పేషెంట్ కావటం యాదృచ్ఛికంగా భావించాడు రామచంద్రుడు. దాక్షాయిణి అన్నీ పరిశీలిస్తూ సూచనలిస్తూ సీరియస్‌గా ఉండి పోయింది.




రామచంద్రుడు ఆపరేషన్ థియేటర్‌లోకి వెళ్లలేదు.

దాదాపు రెండు గంటల తరువాత దాక్షాయిణి సి.డి. తీసుకువచ్చి రామచంద్రుడి రూమ్‌లో ల్యాప్‌టాప్‌లో పెట్టి ఆపరేషన్ నిర్వహించిన విధానాన్ని వివరించింది.

కృతజ్ఞతాపూర్వకంగా రెండు చేతులతో ఆమె చేతులను తీసుకొని అభినందించాడు.

ఆమె ముఖం చిరునవ్వులతో వెలిగిపోయింది.

"రామ్, ఎంత విచిత్రం, ఏదో కార్యకారణ సంబంధం ఉండి ఉంటుంది. నేను రావడం, ఇప్పుడే రవికి ఇటువంటి ప్రాబ్లం రావటం విచిత్రంగా లేదా?"

"ఎగ్జాక్ట్లీ నేనూ అదే అనుకుంటున్నాను".

"ఎనీ హౌ, హి ఈజ్ ట్రబుల్ ఫ్రీ".

"ఐసీయులోకి రెండు గంటల తరువాత షిఫ్ట్ చేద్దాం. నువ్వు వెళ్లి చూసిరా, ఇంకా రికవర్ కాలేదు".

"నో, నో, తరువాత వెళ్తాను. షిఫ్ట్ అయ్యాక" అన్నాడు రామచంద్రుడు.

ఇంతలో సుమ వచ్చాడు. సుమ అనబడే సుబ్రమణ్యం. రామచంద్రుడి మేనత్తకొడుకు. ఒకప్పుడు "ఏరా" అని చనువుగా పిలవగలిగేవాడు. ప్రతి నియమాన్ని అతిక్రమించడమే అతని నైజం. అతని చేష్టలన్నీ యాంత్రిక దృష్టితో చూసేవాళ్లకి చాలా వికృతంగా ఉంటాయి. సుమను పరిచయం చేసి కాఫీలు తెప్పించి మాట్లాడుతూ ఉండమని చెప్పి చాంబరు బయటికి వెళ్లాడు రామచంద్రుడు.

వరుసకు అన్న అయినా సీతకు సుమ అంటే మంట, వాడిలో ఉన్న విద్యను విమర్శించి వాడి వికృత చేష్టల్ని భూతద్దంలో చూస్తుంది. అతని అధివాస్తవికత రామచంద్రుడికి ఆకర్షణ. ఎప్పుడూ గలగలా ప్రవహించే సెలయేరులా మాటల ప్రవాహంతో చలాకీ స్వభావంతో ఉంటాడు. కుదురుగా ఒక దగ్గర ఉండడు. ఎక్కడో జీవితంలో ఆనందం ఆగిపోయినట్లు దాన్ని వెతుకుతున్నట్లు ఉంటాడు.

రామచంద్రుడు తిరిగి వచ్చాడు.

"రవి రికవర్ అయ్యాడు, ఐసీయూలోకి మార్చారు".

"ఒక వారంలో డిశ్చార్జ్ చేయవచ్చు" అంది దాక్షాయిణి.

"అమ్మ, రమ్య అక్కడే ఉన్నారు. ఇంటికి వెళ్లమన్నాను. రమ్య ఉంటానంది".

రవిని చూసి వస్తానని సుమ వెళ్లాడు.

ప్రకృతిలో ప్రతి చిన్న విషయానికీ ఓ వికృతిని చూపే సుమకు, జారిపోతున్న భూతద్దాల కళ్లజోడును ప్రతిసారి పైకి ఎగదోసుకుంటూ మాట్లాడటం రివాజు.

నియమము అన్న ప్రతిదాన్ని అతిక్రమించడం అతని నియమం. సుబ్రమణ్యం నాన్నగారికి ట్రాన్స్‌ఫర్ అయి ఎనిమిదవ తరగతిలో రామచంద్రుడు చదివే స్కూల్లోనే చేరాడు. వికృతి ప్రకృతి కలిసినట్లుండేది వారి స్నేహం. భిన్న ప్రవృత్తులు అయినా అన్యోన్యం.

"నీ పేరేంటిబాబూ కొత్తగా చేరావా?" అని మొదటి రోజు క్లాసులో మేరీ టీచర్ అడిగింది. కొత్తగా ఉపనయనం చేసుకుని పంచశిఖలతో సుమ క్లాసులోకి వచ్చాడు. నిలబడి రెండు చేతులు కట్టుకొని దర్పంగా రెండు చేతులూ మెలికవేసి చెవులను స్పృశిస్తూ గోత్ర సహితంగా ప్రవర చెప్తే భీతిల్లిన మేరీ టీచర్ "వెధవా, వేలెడు లేవు. పేరడిగితే ఏమేమిటో చెప్తావురా, అంతగా గేలి చేస్తావా నన్ను?" అని అరిచిందామె.

"లేదు టీచర్! ఎవరైనా నీ పేరు అడిగితే ప్రవర మొత్తం చెప్పమన్నారండీ మా నాన్న గారు" అన్నాడు సుమ.

అందరు నవ్వుకున్నారు. మేరీ టీచర్‌కు సహోద్యోగులు ప్రవర అంటే అర్థం చెప్తేగాని అర్థం కాలేదు. అప్పటి నుంచి వాణ్ణి పలకరించాలంటే భయపడేది మేరీ టీచర్. బాగా ఎదిగాక ఎప్పుడు కలిసినా ఆ సంఘటన చెప్పుకొని పగలబడి నవ్వుకోవటం అలవాటయింది.

***(ఇంకావుంది)***

## హోమియో లైఫ్

డా॥ A.M.రెడ్డి
పాజిటివ్ హోమియోపతి
డాక్టర్ కన్సల్టేషన్ కొరకు :
9246199922
www.positivehomeopathy.com



# సైనసైటిస్ - హోమియో చికిత్స

సైనసైటిస్ అంటే గాలిగది. కణాలపు ఎయిర్ నందు ముక్కుకు రెండు నైపులా అమరి కొన్ని గాలిగదులు ఉన్నాయి. ఇవి అన్నీ ముక్కులోకి దాగుచూ ఉంటాయి. వీటిని పారానాసర్ సైనసస్ (ముక్కు సంబంధించిన గాలి గదులు) లేక సైనసస్ అంటారు. ఇవి నాలుగు రకాలుగా ముక్కు చుట్టూ ఉండే ఎముకల లోపల గాలి గదులుగా అమరి ఉన్నాయి. 1) మాగ్జిల్లర్ సైనసెస్ 2) ఎథ్మాయిటల్ సైనసెస్ 3) ఫ్రాంటిల్ సైనసెస్ 4) స్ఫెనాయిడ్ సైనసెస్

సైనసస్ నిర్మాణము : సైనసెస్ లోపల మ్యూకస్ మెంబ్రేన్ అనే లైనింగ్ పొర ఉంటుంది. దీని నుండి కొంత మ్యూకస్ అనే జిగట వంటి పదార్థం వెలువడుతుంది. సైనసెస్ అన్నీ వాటికి ఉన్న ఆస్టియో అన్న రంధ్రం ద్వారా ముక్కులోనికి తెరుచుకుంటాయి. అందువలన మ్యూకస్ కూడా ముక్కులోకి, సైనసెస్ నుండి గొంతులోకి నెట్టివేయబడుతుంది. ఇది నిరంతరం జరిగే ప్రక్రియ.

సైనసస్ విధులు : సైనస్ యొక్క ముఖ్యమైన ఉపయోగం మనం పీల్చే గాలిని, మన శరీర ఉష్ణోగ్రతకు దగ్గరగా ఉండేటట్టు చేయటం.

ఇక రెండవ ఉపయోగం లోకల్ రెజొనెన్స్ అంటే మనం మాట్లాడేటప్పుడు గొంతులో తయారయిన శబ్దం నోటిద్వారాను, ముక్కు ద్వారాను చుట్టూ ఉన్న గాలి గదుల్లో ఉంటూ మాట ఒక ప్రత్యేకమైన క్వాలిటీని సంతరించుకుంటుంది.

సైనసైటిస్ : సైనసెస్‌లో ఇన్ఫెక్షన్ చేరి అక్కడ కఫము, చీము తయారై నిలువ ఉన్నప్పుడు దానిని సైనసైటిస్ అంటారు.

కారణాలు : నాసల్ ఎలర్జీ మరియు పాలిప్స్ (ముక్కులో ఉబ్బెత్తుగా ఉండే నిర్మాణాలు) వంటి వాటివలన అధికంగా మ్యూకస్ స్రవించబడిన లేదా రంధ్రం మూసుకుపోవటం ద్వారా లేదా పిప్పిపన్ను ఇన్ఫెక్షన్, సైనస్‌లోకి చేరితే సైనసైటిస్ వస్తుంది. మరియు టాన్సిల్స్ వ్యాధి, ఎడినాయిడ్స్ వ్యాధి, ముక్కులోపల ఉండే గోడ ప్రక్కకు వంగిన సైనసైటిస్ వస్తుంది.

వ్యాధి లక్షణములు : • తరచుగా జలుబు ఉండుట • ముక్కు ద్వారా గాలి పీల్చుకోవటం కష్టంగా ఉండుట • ముక్కు మరియు గొంతులోకి కఫము, చీముతో కూడిన కఫం • కొందరికి చెడు వాసన వస్తుంది •తలనొప్పి నుదుటి భాగంలో, కళ్లక్రింద, కనుబొమ్మల మధ్య మరియు తలకు ఇరుప్రక్కల, తల వేనుక భాగంలోను • తల ముందుకు వంచినపుడు మరియు దగ్గినప్పుడు తలనొప్పి ఎక్కువ అవుతుంది.

వ్యాధి నిర్ధారణ : ఎక్స్‌రే పరీక్ష మరియు సి.టి.స్కాన్ ద్వారా వ్యాధి నిర్ధారణ జరుగుతుంది.

సైనసైటిస్-దుష్పరిణామములు: సైనస్ లోపల ఉన్న ఇన్‌ఫెక్షన్ సైనస్ నుండి ఇతర భాగాలకు అంటే గొంతు, శ్వాసనాళములకు వ్యాపించి షారంటైటిస్, తాన్సురైటిస్, బ్రాంచైటిస్ మొదలయిన వ్యాధులు రావచ్చు. ఇన్‌ఫెక్షన్ చెవిలోకి చేరితే రావచ్చు.

సైనసైటిస్ వ్యాధి హోమియో చికిత్స : సైనసైటిస్ వ్యాధిని వాటి లక్షణముల ద్వారా సరైన సమయంలో గుర్తించిన యెడల ఎటువంటి ఆపరేషన్ అవసరం లేకుండా హోమియోపతి మందుల ద్వారా నివారించవచ్చును. సాధారణంగా హోమియో వైద్యవిధానంలో మనిషి యొక్క ఆహారపు అలవాట్లు మరియు వారి ఆలోచన విధానం, నడవడిక, కోరికలు వ్యాధి లక్షణములు ఆధారంగా మందులు సూచించటం జరుగుతుంది.

హోమియోపతి మందులు :

**మెపాల్ సలిర్లోలికము :** అతికోపము మరియు చిరాకు కలిగి ఉండి వాతావరణంలోని అతి తక్కువ చలిగాలికి వెళ్లిన యెడల సైనసైటిస్ లక్షణాలు ఎక్కువగాగ ఉన్నవారికి ఈ మందు సూచిస్తారు.

**మర్క్యూరిల్ :** రక్తహీనత కలిగి, అతినీరసంగా ఉండి మరియు ఏదైనా అల్సర్లు ఉన్నప్పుడు అవి త్వరగా మానవు. మరియు లాలాజలం ఎక్కువగా ఉత్పత్తి అవుతూ, గొంతుదగ్గర గ్రంధులు వాచి, నోరు తడిగా ఉన్నప్పటికి దాహం ఎక్కువగా వారికి ఈ మందు సూచించబడుతుంది. నోటి దుర్వాసన మరియు శ్వాస కూడా దుర్వాసన ఉంటుంది.

**కాలిక్ క్రోమిక్ :** అతి నీరసంగానే రోజు మొదలు పెడుతూ ఏ పని చేయాలి అన్నా ఇష్టం లేకుండా ఉంటూ పనులను వాయిదా వేస్తూ ఒంటరిగా ఉండటానికి ఇష్టపడతారు. ఆరు బయట గాలిలో ఆహ్లాదంగా ఉంటారు. గొంతు నుండి ముక్కు నుండి వచ్చే కఫము గట్టిగా, రాళ్లలాగా మరియు తీగెలుగా గట్టిగా సాగుతూ తీయటానికి కష్టంగా ఉన్నవారికి ఈ మందు సూచిస్తారు.

పైన తెలిపిన మందులు కాకుండా ఇంకా హోమియోపతిలో వేరే మందులు కూడా వారి లక్షణాలు. శరీర, మనస్తత్వాల ఆధారంగా సూచించటం జరుగుతుంది. వాటిలో కొన్ని : ఫాస్ఫరస్, ఆర్సనికల, ఆబ్బం, కాలకార్బ్, కాల్కేనియా కార్బ్, సైలీషియా, రస్టాక్స్ మొదలగునవి.

సైనసైటిస్ వ్యాధి - పాజిటివ్ హోమియోపతి వైద్యవిధానం :

పాజిటివ్ హోమియోపతి వైద్య విధానంలో సైనసైటిస్ వ్యాధికి చికిత్స విధానంలో అత్యద్భుతమైన, మెరుగైన, నాణ్యమైన మందుల ద్వారా చికిత్స ప్రారంభిస్తారు.

పైన చెప్పిన వాటిలో భాగంగా ముఖ్యంగా పాజిటివ్ హోమియోపతిలో "కాన్సిట్యూషనల్ థెరపి" ద్వారా వ్యక్తి యొక్క జీవనశైలిలో పెరిగిన మార్పులు, సంఘటనలు, అలవాట్లు పరిగణలోకి తీసుకొని మరియు జన్యుపరిణామాలను ఆధారంగా తీసుకొని ఒక క్రమానుసారంగా వ్యక్తిని పరిశీలిస్తూ, వారి వ్యాధినిరోధక శక్తిని పెంచుతూ ఎటువంటి సైడ్ ఎఫెక్ట్స్ లేకుండా చికిత్సా విధానం కొనసాగుతుంది.



# సినీ నారాయణీయం

## (ఎమ్మెస్ నారాయణ జీవితచిత్రం) 13

**ఎనిమిది వేల రూపాయలు మునిసిపల్ స్కూల్లో ఇస్తుంటే ఆ పర్మినెంట్ పోస్టుకు రిజైన్ చేసి ఒక టెంపరరీ పోస్టులో 250 రూపాయలకి నువ్వు జాయినవుతావా? నువ్వు లెక్చరర్ ఎలా అయ్యావయ్యా. నీకు బ్రెయిన్ ఉందా? నీలాంటి వెధవల వల్లే నిరుద్యోగ సమస్య ఎక్కువవుతోందయ్యా అన్న నాచు వెంకట్రామయ్యగారితో నేనన్నా, సార్ మీరు చెప్పిన మిగిలిన పాయింట్లన్నీ గొప్పవండీ, కానీ నిరుద్యోగ సమస్య ఎక్కువవుతుంది నీలాంటి వాళ్ళ వల్ల అనడం మాత్రం తప్పుసార్ అన్నా.**

ఏం అన్నారు. నేను ఒకగొప్ప పోస్టుకు రిజైన్ చేసి ఒక వెధవ పోస్టులోకి వచ్చా. ఆ గొప్ప పోస్టు ఇంకొకరికి ఇస్తారు. వాడికి ఎక్కువ డబ్బు వస్తుంది. నాకు ఇక్కడ తక్కువ డబ్బు వస్తుంది. నేను నిరుద్యోగ సమస్యను పెంచలేదు సార్, ఒక లెక్చరర్ అయ్యాను అన్నా!

### ఇంటా బయటా ఒకే రకం తిట్లు

హైస్కూల్లో ఉండగా టీచర్లందరికీ ఒకటే స్టాఫ్ రూమ్. కూర్చోడానికి ఒకటే బెంచీ. ఒకే నిన్ను పోషిస్తా అన్నాను.

అప్పటికే మా పాప శశికిరణ్ గర్భంలో ఉంది. 1977లో మాకు ఆడబిడ్డ పుట్టింది. చాలా ఆనందించాను. మా ఆవిడని ముందే రిక్వెస్టు చేశాను. అమ్మాయినే కను. ఒక ఆడపిల్ల తండ్రి జీవితం ఎంత గొప్పదో కణ్వాశ్రమంలో కాళిదాసు రచించాడు. కాబట్టి అమ్మాయిని కనమని. ఇదెక్కడ గొడవండీ ఎవరిని కంటామో ఎలా తెలుస్తుంది అంది. తర్వాత అమ్మాయే పుట్టింది. మేము వెరీ హ్యాపీ. నేను బత్తాయి రసం తీసి ఇచ్చేవాడిని మా ఆవిడకి. ఓ బంగారం లాంటి పాప పుట్టింది. అదే ఇప్పుడు శశికిరణ్. నా జీవితంలో మా

# పారిపోయి ప్రాణాలు దక్కించుకున్నాం

ఎంప్లాయ్‌మెంట్‌ను పెంచాను. నా ఉద్యోగాన్ని తగ్గించుకున్నాను అన్నాను. ఆయనకు ఏం మాట్లాడాలో తెలియలేదు. షాక్ అయ్యాడు. షాక్ అయ్యి ఏం చేస్తావిక్కడ? నీ జాబ్ పర్మినెంట్ అవ్వదు. అసలు ఆ పోస్టే లేదు. ఏదో ఆ పద్మనాభం నీ గురించి చేసేశాడు తప్పా. వాణ్ణి బాగా కాకా పట్టేశావు. వాడేం ఆలోచించాడో అతనికే తెలియదు. నువ్వు ఏం ఆలోచించావో నీకు తెలియదు అన్నారు. ఏదో ఒకటి లేండి సార్, నేను

రూం. కానీ ఇక్కడో! ఒక్కొక్కరికీ ఒకొక్క డిపార్ట్‌మెంట్. ఒకొక్క రూం. ఒక బీరువా. ఒక టేబుల్. ఫస్ట్ టైం నేను వెళ్ళి కూర్చున్నా. ఇంటికెళ్తే నాచు వెంకట్రామయ్యగారు ఏం తిట్టారో మా ఆవిడ కూడా అలాగే అంది. ప్రపంచంలో ఎవ్వరూ ఇలా చెయ్యరు. నీకు బుద్ధుందా అసలు అని తిట్టింది.

నేను లెక్చరర్ అవ్వాలి అయ్యాను. ఇప్పుడేంటి? నువ్వు టీచరు. నీ డబ్బులు నాకు అక్కర్లేదు. నేనే



పాపను చూస్తే చాలు నాకు. ఇవాల్టికీ శశికిరణ్ నాకు చిన్న పాపే. చాలా గ్రేట్ గర్ల్.

1979లో బాబు పుట్టాడు. అతనే విక్రం. బి.ఎస్సీ పేపర్లు దిద్దడానికి ఫ్యామిలీతో వైజాగ్ వెళ్ళాను. పిల్లల్ని తీసుకుపోయా. ఫస్ట్ ట్రిప్. అక్కడ హోటల్ రూం తీసుకున్నాను. అప్పటికి సెటిల్ అయ్యాననే ఒక భావం నాలో కలిగింది. గ్రాంట్స్ ఇచ్చిన తర్వాత నాకు ఎనిమిది వేల రూపాయల శాలరీ వచ్చింది. ఒక ఆన్సర్ పేపర్ దిద్దినందుకు ముప్పావలా ఇచ్చేవారు. ఆ డబ్బులు పెంచాలని మేం డిమాండ్ చేశాం. ఒకసారి అలాగే స్పాట్ వాల్యుయేషన్‌కి కడపకెళ్ళా. రీ ఓపెనింగ్ రిపోర్టు ఇవ్వమన్నారు. నిజంగానే చెప్తున్నా. కడప స్పెల్లింగ్ Cuddapah అని రాస్తారని అప్పుడు నాకు తెలియదు. అప్పటివరకు ఆ స్పెల్లింగ్ నేను రిటెన్‌గా చూడలేదు. తర్వాత తెలుసుకున్నా. కాని నేను ఓపెనింగ్ రిపోర్టులో Kadapa అని రాశా. ఆయనన్నాడు మీరు తెలుగు పండిట్ కదా అందుకే మీకు తెలియదు. అసలు స్పెల్లింగ్ ఇది కాదు అన్నాడు అక్కడున్న ప్రిన్సిపాల్ గారు. అంటే ఏంటండీ అన్నా. అనేటప్పటికి Cuddapah అని రాయమన్నాడు. రాయడమెందుకండీ మీరు చదివినప్పుడు మీకర్థమైంది కదా అన్నా. అర్థమైంది అన్నాడు. అయితే అది అలాగే ఉంచండి అన్నా. అదెలా ఉంచుతారయ్యా ఇక్కడ స్పెల్లింగ్ ఉంటేను అన్నాడు. నేనన్నా ప్రోపర్ నౌన్స్ మనకు కావల్సినట్టు రాసుకోవచ్చని గ్రామర్‌లో కూడా ఉందండి అది ఫాలో చేయండి



అన్నా. అది కుదరదు ఇది రాయి అన్నాడు. ఆయన తృప్తి కోసం రాశాను తప్పా, తర్వాత ఆ పేరును ప్రజల కోరిక మేరకు ఆ జిల్లా కలెక్టరు Kadapa అని మార్పు చేశారు. తప్పేమీకాదు, Cuddapah అని ఇంగ్లీషువాడు పెట్టిన పేరది. మనం ఇంగ్లీషుని తిడుతున్నాం. ఇంగ్లీషు వెధవని వదిలేస్తున్నాం. కానీ వాడు పెట్టిన పేరు రాయకపోతే నువ్వు నాతో దెబ్బలాడుతున్నావు అనే భావం నాది.

స్పాట్ వాల్యుయేషన్‌లో పేపర్లు నేను కొంచెం లిబరల్‌గా దిద్దేవాణ్ణి. దేశం సాంకేతికంగా అభివృద్ధి చెందుతున్న సమయంలో ఈ ఒక్క రీజనల్ లాంగ్వేజ్‌లో మనవాళ్ళు వెనుకబడి పోవటం ఎందుకని నాలో ఒక చిన్న భావం ఉండేది. ఆ భావం నాకు అప్పటికే ఉంది. నేను కొంచెం గ్రామర్ అటూ ఇటూగా దిద్దేసి పాస్ చేసేసేవాణ్ణి. అందరూ తిట్టేవారు. అయితే ఒకనాడు మొత్తం కడప లెక్చరర్‌లంతా కలిసి పరిగెత్తేస్తున్నారు. ఏంటని చూస్తే పక్కన ఆరుగురు విద్యార్థులు గొడ్డళ్ళు, కొడవళ్ళు పట్టుకుని ఎక్కడరా అని ఒకణ్ణి వెదుక్కుంటూ వెళుతున్నారు. కారిడార్ పక్కనుంచి వాళ్ళు ఆ కాలేజీలో పీజీ ఎగ్జామ్ రాస్తున్నవాణ్ణి పట్టుకుని వాణ్ణి నరికెయ్యాలని వెళ్తున్నారు వీళ్ళు. అందరూ కకావికలమయ్యారు పేపర్లు వదిలేసి. సరే నేను పేపర్లు అక్కడే పెట్టి ఒక కిటికీలోంచి చూస్తున్నాను. చిన్న క్యూరియాసిటీ కదా. వాళ్ళు మనల్ని ఏమీ చేయలేరని ఒక చిన్న ధీమా.

స్పోర్ట్స్ రూంలో ఉంటాడని వెళ్ళి తలుపు తన్నారు. అతను మంచి కండపుష్టి కలిగి కండలు తిరిగి ఉన్నాడు. అతను జావెలిన్‌త్రో పట్టుకొని ఉన్నాడు. రండ్రా అన్నాడు. వీళ్ళు ఆగారు. అతనూ ఆగాడు. అప్పుడు మధ్యలో లెక్చరర్‌లు వాళ్ళూ వీళ్ళూ వెళ్ళి పిల్లల్ని వెనక్కి పంపించేశారు. అతన్ని ఊరుకోబెట్టారు. ఇద్దరూ ఫ్యాక్షనిస్టులే. ఇదొక విచిత్రమైన దృశ్యం. సరే ఇంకొక కామెడీ ఏంటంటే, ఒక హోటల్ ఉండేది. అందరం భోజనాలు అక్కడే చేసేవాళ్ళం. మా తెలుగు లెక్చరర్లు అందరం కూడానూ. ఇంక రెండు మూడు రోజుల్లో మా పని పూర్తవుతుందనగా వెళితే హోటల్ మూసేశాడు. ఏంటయ్యా అని అడిగితే అప్పుడు చెప్పాడు, నేనేమో వేరుశనగ చెట్నీ మంచిగా చేసి పెడుతున్నాను, దాంతో విపరీతంగా తినేస్తున్నారండీ. నేను లేదనలేను. మీరేమో రేట్లు పెంచితే తినరు. అంచేత హోటల్‌కి సెలవు ఇచ్చానండి అన్నాడు.

### ఓ అటెండర్ మనస్తత్వం

నేను కాలేజీలో పనిచేసే రోజుల్లో ఓ అటెండర్ ఉండేవాడు. అతని ప్రవర్తన భలే విచిత్రంగా ఉండేది. రోజూ పేపర్ చదివేవాడు. చదువుతూ, ఉదాహరణకి "రాజీవ్‌గాంధీ విదేశీ పర్యటన.." మాస్టారూ ఇతను మంచోడేగాని చెప్పుడు మాటలు వినడం వల్లే పాడైపోయాడు అనేవాడు. మరల ఇంకో పేరు చదివేవాడు ఇతను మంచోడు కాదు మాస్టారూ, వీడి మాట నమ్మకండి! అని నాకు సలహా ఇచ్చేవాడు. నిన్న మార్కెట్‌లో మంచి తేగలు కొన్నానయ్యా, ఒక్కొక్కటీ ఇంతింత పొడుగు ఉన్నాయి అని వాటిని చూపించాను. ఎక్కడ కొన్నారు? అడిగాడు. బుధవారం మార్కెట్లో అన్నా! "అబ్బే లాభం లేదు మాస్టారూ పాలకొల్లు బస్టాండు పక్కనైతే ఇంతింత తేగలు ఉంటాయి అనేవాడు. ఓసారి మా ఇంటికి వచ్చినప్పుడు మా ఆవిడ ఇడ్లీలు పెట్టింది. ఇవి బాగానే ఉన్నాయి గానీ మాస్టారూ! రావులపాలెం దగ్గర ఇడ్లీలు ఇంకా బాగుంటాయి అనేవాడు. ఇలా ప్రతిదానికి ఏదో ఎదురు సమాధానం చెప్పేవాడు. తరువాత అతను మేకప్‌మ్యాన్ అయ్యాడు కాని ధోరణి మాత్రం మారలేదు. ఇలా రకరకాల మనుషులు, మనస్తత్వాలు నేను పరిశీలించేవాణ్ణి. నేను నటుడైన తర్వాత వేసే హాస్య పాత్రలకు ఇలాంటి ప్రాక్టికల్ మనస్తత్వాలన్నింటినీ అన్వయించేవాణ్ణి. అవే హిట్ అయ్యేవి.

**ప్రముఖ హేతువాది డాక్టర్ కోవూర్ భీమవరంలో ప్రదర్శనలు ఇచ్చారు. తర్వాత ఎమ్మెస్ కూడా అలాంటి ప్రదర్శనలే చేశారు. కత్తిపద్మారావుగారితో ఒకసారి మీటింగ్ ప్లాన్ చేసినప్పుడు ఛాందసవాదులతో చర్చ జరిగింది. అప్పుడు ఎమ్మెస్ ఘాటుగా మాట్లాడేసరికి సీన్ రివర్స్ అయింది. అప్పుడు ఛాందసవాదులు ఏం చేశారు? వీళ్ళ సభ సజావుగా జరిగిందా? లేదా?**

### ఛాందసవాదుల దాడి

భీమవరంలో కాలేజీలో పనిచేసే రోజుల్లో కఠారి ప్రభాకరరావుగారని ఒకాయన హేతువాద సంఘం నడిపేవారు. నాకు హేతువాద భావాలు బాగా తలకెక్కాయి. మూఢ నమ్మకాలు, దొంగ బాబాలకు వ్యతిరేకంగా ఈ సంఘం పనిచేసేది. ఓసారి డాక్టర్ కోవూర్ అని శ్రీలంక నుంచి ఓ సైకాలజిస్టును తీసుకువచ్చారు. ఆయన కేరళలో పుట్టినవాడే. ఆయనచేత భీమవరం టౌన్ హాలులో కొన్ని ప్రదర్శనలు ఇప్పించారు. ఒకసారి నేను కూడా ఆ ప్రదర్శనలు ఇచ్చాను. కత్తి పద్మారావు గారిని తీసుకువచ్చి మావుళ్ళమ్మ గుడివద్ద ఓ మీటింగ్ ప్లాన్ చేశాం. ఆ మీటింగ్‌కి ముందు కొంతమంది ఛాందసవాదులతో చర్చ జరిగింది. వాళ్ళు గోవధ నిషేధాన్ని సమర్థించమని, గోవు తల్లివంటిదని వాదించారు. నేను కలగచేసుకొని, మరి గేదెల మాటేంటి? మేకలు మీ మేనల్లుళ్ళా? వాటిని పూర్తిగా కోసుకుని తినేయొచ్చా? అని ప్రశ్నించా. వాళ్ళు దీన్ని వితండవాదం అన్నారు. కొద్దిసేపటికి సభ ప్రారంభం అయ్యేదే. వాళ్ళు కొంతమందిని పోగుచేసి మా మీద దాడిచేశారు. మేం కొద్దిమందిమే ఉన్నాం. ఇంకేం చేస్తాం పరుగు పెట్టి ప్రాణాలు రక్షించుకున్నాం.

### చదరంగం పిచ్చి

కాలేజీలో ఉద్యోగం చేసే రోజుల్లో చదరంగం పిచ్చి పట్టింది. చదరంగం పోటీలు జరిగితే పాల్గొనేవాణ్ణి. అలా ఒకసారి 1985లో ఎల్ఐసి వాళ్ళ జిల్లా వ్యాప్త పోటీల్లో పాల్గొన్నా. అవతలి ఆసామికి చెస్‌లో చాలా చరిత్ర ఉంది. పోటీ తీవ్రంగా సాగింది. నేనే గెలిచాను. అతని మిత్రులు ఆశ్చర్యం నుంచి తేరుకోలేదు. గురూజీ మీరు ఓడిపోయారా, నమ్మలేకపోతున్నాం అన్నారు. ఆయన కవర్ చేసుకోవడానికి, అతను తన నాలెడ్జ్ వల్ల గెలవలేదు అన్నాడు.

అప్పుడు నేను కలగజేసుకుని అవును ఆయన మూర్ఖత్వం వల్ల గెలిచా అన్నాను. వాళ్ళకు కోపం వచ్చింది. ఈ ఆటలో గెలుపు రెండు రకాలుగా వస్తుంది. మన నాలెడ్జ్ వల్లగానీ, ఎదుటివారి మూర్ఖత్వం వల్ల గానీ. ఏంటో మీరే చెప్పండన్నా. ఇంకేం మాట్లాడతారు? నెమ్మదిగా జారుకున్నారు. నాకు వెండికప్పు వచ్చింది. ఇప్పటికీ ఆ కప్పు నా దగ్గర ఉంది.

*(ఇంకావుంది)*

**-కూనపరాజు కుమార్**

**సెల్: 99899 99599**




**"నా తల్లి ప్రాస్టిట్యూట్ అని నీకు తెలుసా?" అన్న మాటకు షాక్ తింది మాధవి. ఆ మాటలన్నది మాధవి రూమ్మేట్ ఊర్వశి. వాళ్లిద్దరూ సివిల్స్ ఎగ్జామ్స్‌కి ప్రిపేర్ అవుతున్నారు.**

**మాధవి ఉన్నత మధ్యతరగతి కుటుంబం నుంచి వచ్చింది. చదువు కన్నా కొంచెం షోకులు ఎక్కువ. తల్లి పోరు పడలేక చదువుతోంది. మాధవి తల్లి, పరిస్థితులు అనుకూలించక చదువుకోలేదు. అందంగా ఉంటుంది కాబట్టి కట్నాల మార్కెట్‌లో ఎక్కువ డబ్బులు ఖర్చు పెట్టకుండానే మంచి ఉద్యోగస్థుడితో వివాహం జరిగింది.**

ఆడపిల్లకు ఆర్థిక స్వాతంత్ర్యం ఉండాలని ఆవిడ ఆలోచన. అందుకే మాధవిని చదువుకోమని పోరుపెట్టి ఇక్కడిదాకా తీసుకు వచ్చింది. ఊర్వశి ఒక ఆఫీసులో క్లర్క్‌గా పనిచేస్తోంది. ఇల్లు కోసం వెతుకుతుంటే మాధవి వాళ్ల ఔట్‌హౌస్ అద్దెకు ఉందని తెలిసి చూసుకునేందుకు వచ్చింది.

అది చాలా విశాలమైన కాంపౌండ్‌లో ఉన్న ఇల్లు. సామాన్లు పెట్టుకుందుకు రెండు గదులు కట్టి పైన ఆస్‌బెస్టాస్ రేకులతో కప్పిన ఇల్లది. చాలా రోజులు పనికిరాని సామానుతో నిండి ఉండేది. మాధవి తల్లికి అనవసరమైన సామాను చేర్చడం ఇష్టం లేక ఒకరోజు ఆ సామానులో కొంత అమ్మేసి, కావాల్సిన సామాను ఇంట్లోకి అట్టిపెట్టుకుని రెండు రూమ్‌లూ ఖాళీ చేసి, అద్దెకి ఇవ్వాలని నిర్ణయించుకుంది.

అలా ఆ ఇంట్లోకి అడుగుపెట్టింది ఊర్వశి. అనతికాలంలోనే ఆమె మంచితనంతో మాధవికి దగ్గరయింది. మాధవి తల్లికి ఊర్వశి పద్ధతి బాగా నచ్చింది. ఆమె ఉద్యోగం చేసుకుంటూ సివిల్స్‌కి తయారవుతోందంటే ఆమెకు ఆశ్చర్యం కలిగింది. మాధవిని కూడా సివిల్స్‌కి ప్రిపేర్ అవమని బలవంతపెట్టింది.

ముందు అంత ఇష్టం చూపలేదు మాధవి. కానీ ఊర్వశి మనస్తత్వం, ఆమె చల్లని చిరునవ్వుకి దాసోహం అంది. ఎప్పుడూ నవ్వుతూ అలసట తెలియనియ్యకుండా ఉండే ఊర్వశి అంటే ఎందుకో తెలియని ఇష్టత ఏర్పడింది.

పొద్దున్నే లేచి ఇంటిపనంతా చేసుకుని ఆఫీసుకి వెళ్లి మళ్లీ సాయంకాలం వచ్చి, వంట చేసుకుని శ్రద్ధగా పుస్తకాలు ముందు వేసుకుని చదువుకుంటుంది. అలా ఆమెను చూసిన మాధవికి ఈమెకు ఇలా యంత్రంలా పనిచేయటానికి విసుగు రాదా! అనే అనుమానం చాలాసార్లు వచ్చింది.

అప్పటిదాకా చదువు బోర్ అనుకున్న మాధవికి, ఊర్వశితో బాటు చదవడం మొదలుపెట్టాక చదువు మీద ఆసక్తి పెరిగింది. కూతురిలో వచ్చిన మార్పు ఆమె తల్లికి చాలా ఆనందం కలిగించింది. ఆమె గురించిన వివరాలు తెలుసుకోవాలని ప్రయత్నించింది.

"నాకెవరూ లేరాంటీ, అమ్మ పోయాక ఒంటరి పోరాటం" అన్న ఒక్క మాట తప్ప ఎప్పుడూ ఎక్కువ వివరాలు చెప్పడానికి ఇష్టపడటంలేదు. పిల్ల బుద్ధిమంతురాలు. అద్దె కూడా సమయానికి ఇస్తోంది. ఇంతకన్నా ఏం కావాలి?

మాధవి తండ్రికి అనుకోకుండా ప్రమోషన్ మీద ట్రాన్స్‌ఫర్ అవడంతో ఆ ఊరు వదిలి వెళ్లక తప్పలేదు. మాధవి తమ్ముడు హాస్టల్లో ఇంజనీరింగ్ చదువుతున్నాడు. ఇప్పుడు మాధవి గురించే సమస్య. ఒంటరి ఆడపిల్లను ఎక్కడ పెట్టాలి? అని.

విషయం విన్న ఊర్వశి "మీకు నా మీద నమ్మకముండి అభ్యంతరం లేకపోతే నాతో ఇక్కడే ఉంటుంది ఆంటీ" అంది.

"అలా అయితే ఈ ఔట్‌హౌస్ ఎందుకు? ఇద్దరూ కలిసి మా ఇంట్లో ఉండండి" అంది మాధవి తల్లి.

"ఇద్దరు మనుషులకు అంత ఇల్లు అవసరమా ఆంటీ. ఈ ఇంట్లో మీ అమ్మాయికి కావాల్సిన సౌకర్యాలు దొరకవని భయమా! ఒక రూమ్ పూర్తిగా తనను తీసుకోమనండి. ఎగ్జామ్స్ అయ్యే

దాకానే కదా! కొద్ది నెలలే ఇబ్బంది!" అంది.

"నీకేమైనా ఇబ్బందేమో! అని ఆలోచిస్తున్నాను."

"నాకేం ఇబ్బంది లేదు. ఈ ఒంటరి జీవితంలో ఒక తోడు" అంది.

అంతకన్నా గత్యంతరం లేదు. అదీకాక ఒక సంవత్సరం నుంచి ఆమెను చూస్తోంది. మంచి పిల్ల. ఒకరికొకరు తోడు. తన కూతురు ఆమెను చూశాక చదువులో శ్రద్ధ కనబరుస్తోంది. అందుకని భర్తను ఒప్పించి, వాళ్లుంటున్న ఇల్లు అద్దెకిచ్చి, సామాను తీసుకుని వెళ్లిపోయారు.

అలా వాళ్లిద్దరూ రూమ్మేట్స్ అయ్యారు. మాధవికి అసలు వంట చేతకాదు. ఊర్వశితో ఉండడం మొదలుపెట్టాక ఆమెతో పాటు పనుల్లో పాలు పంచుకోవడం అలవాటు చేసుకుంది. ఇప్పుడు పొద్దున్నే ఇద్దరూ కలిసి పనులు చేసుకుంటారు. సాయంకాలం ఊర్వశి ఆఫీస్ నుంచి వచ్చేసరికి వంట చేసి ఉంచుతుంది మాధవి. భోజనం అయ్యాక ఇద్దరూ కలిసి చదువులో పడతారు.

చదువుతో పాటు వాళ్ల మాటల్లో అనేక విషయాలు చర్చకు నాంది పలికేవి. ఎక్కువగా వక్త ఊర్వశే. చాలా విషయాల మీద అనర్గళంగా మాట్లాడే ఆమె వాగ్ధాటికి ఆశ్చర్యంగా చూడ్డం తప్ప ఏమీ చెయ్యలేకపోయేది మాధవి. ఊర్వశి అంటే ఒక విజ్ఞాన ఖని అనిపించేది. ఇంత చిన్న వయసులో ఇంత జ్ఞానం ఎలా సముపార్జించింది? అన్నది ప్రశ్న.

అలా ఒకరోజు వచ్చిన చర్చలో ఊర్వశి తన తల్లి గురించి చెప్పడం జరిగింది. ముందు ఆ మాటలకు షాక్ తింది మాధవి. ఆశ్చర్యంతో నోట మాట రాలేదు.

"ఏం ఆశ్చర్యంగా ఉందా? లేక అసహ్యంగా ఉందా?" అంది ఊర్వశి.

"చ అదేం లేదు. ఎప్పుడూ నువ్వు నీ వివరాలు చెప్పలేదు. నేను అడగలేదు. నీకెవరూ లేరని చెప్పాక అవసరం లేక ఆ విషయం గురించి తరచి అడగలేదు. ఇప్పుడు కూడా ఈ చర్చ మన ఇద్దరి మధ్య జరగకపోతే బహుశా నువ్వు చెప్పి ఉండేదానివి కాదేమో?" అంది మాధవి.

"నిజమే, నువ్వు ఆ మాట అనకపోతే నేను ఈ విషయం నీకు చెప్పి ఉండేదాన్ని కాదు"

వాళ్లిద్దరి మధ్య చర్చ మొదలయింది. దానికి కారణం చదువులో పైకి రావాలంటే దేనిలోనైనా విజయం సాధించాలంటే అనుకూల పరిస్థితులు ఉంటేనే కానీ సాధ్యం కాదని, ప్రతీవారి విజయం వెనక ఎవరిదో ఒకరి సహకారం ఉంటుందని మాధవి వాదన.

ఊర్వశి అలా కాదని, పట్టుదల ఉంటే జీవితంలో దేనినైనా సాధించవచ్చని, పరిస్థితుల్ని ఎదిరించవచ్చని వాదించింది. అది సాధ్యం కాదని మాధవి వాదన.

అదిగో అప్పుడే ఊర్వశి నోటివెంట ఈ మాటలు వెలువడ్డాయి.

"నీకు అభ్యంతరం లేకపోతే నీ కథ చెప్పు ఊర్వశి. నిన్ను చూస్తే నీ మాటలు నిజమనిపించటం లేదు. దానికి కారణం పతితలుగా పిలవబడే వాళ్ల మీద సమాజంలో ఎవరికీ సదభిప్రాయం లేదు. నాకు చాలా రోజులు వీళ్ల గురించి తెలియదు. జ్ఞానం పెరుగుతున్న కొద్దీ, అక్కడక్కడ వీరి గురించి చదివాక కొంత అవగాహన వచ్చింది. కానీ అలాంటి వాతావరణం లోంచి వచ్చి కూడా నువ్వు చదువు పట్ల ఇంత శ్రద్ధ చూపించటం, అదీకాక నువ్వు చెప్పినా నీ తల్లి అలాంటి వృత్తి చేసేదంటే నమ్మబుద్ధి కాదు" అంది మాధవి.

"తెలిసి కానీ, కావాలని కానీ ఆ వృత్తిని ఎవ్వరూ స్వీకరించరు మాధవి. నా తల్లి ఏ పరిస్థితుల్లో ఆ బురదలో ఇరుక్కుందో నాకు తెలియదు. నేను అడగలేదు. దానికి కారణం నా తల్లి చనిపోయేనాటికి నా వయసు పదేళ్లు. నా తండ్రి ఎవరో నాకు తెలియదు. నాలాంటి వాళ్లెవరికీ తెలియదు.

**జీవితం గుణపాఠం నేర్పుతుంది. వాటిని తేలిగ్గా తీసుకోకుండా ఆచరించినప్పుడే భవిష్యత్తు పూలబాటగా మారుతుంది. ఊర్వశి సరిగ్గా ఆ సూత్రాన్నే ఫాలో అయింది. తన తోటి అమ్మాయిలకు కూడా మార్గదర్శకంగా నిలిచింది. చిన్న వయసులోనే ఆమెకు అంత పరిణతి ఎలా వచ్చింది? తల్లీతండ్రీ లేని అనాథ అయినా కూడా జీవిత వైకుంఠపాళిలో పెద్ద పెద్ద పాముల్ని ఎలా తప్పించుకోగలిగింది? అసలామె కథ ఏమిటి?**

నా తల్లికి నన్ను చదివించి చాలా గొప్పదాన్ని చెయ్యాలన్న కోరిక బలంగా ఉండేది. దానికి కారణం నాకు తరువాత తెలిసింది, ఆమె రాసుకున్న తన అనుభవాల ద్వారా. స్కూలుకి వెడుతూ ఉండేదాన్ని. స్కూల్లో ఎవరికీ మా అమ్మ విషయం తెలియదు. బహుశా తెలిస్తే ఆ చిన్న వయసులోనే నా మనసు తూట్లు పడేదేమో! అమ్మ ఆ వృత్తిలో ఉందన్న విషయం నాకు చాలా రోజులు తెలియదు. తెలుసుకునేంత వయసూ లేదు. ఎవరి పుణ్యమో అమ్మకు ఎయిడ్స్ సోకింది. ఆ వ్యాధి ఆమెలో ఉందని బయటపడనంతవరకు మా జీవితానికి లోటు లేకుండా పోయింది. వ్యాధి లక్షణాలు బయటపడ్డాక అమ్మ ఎవర్నీ తన దగ్గరకు రానివ్వలేదు.

ఆ వ్యాధి ఆమెను చెదలా తినడం మొదలుపెట్టి, చివరికి ఆమె ప్రాణం తీసింది. ఆమెకు ఆ వ్యాధి ఉందని తెలిశాక ఆమె శవం తగలబెట్టడానికి కూడా ఎవరూ రాలేదు. అప్పటిదాకా నాకు మా అమ్మ, నా చదువు తప్ప వేరే ప్రపంచం తెలియదు. వ్యభిచారి కూతురిగా నన్ను అందరూ ఈసడించుకున్నారు. ఒళ్లు కొవ్వెక్కి అందరి దగ్గరకూ వెళ్లేది. అందుకే ఆ రోగం వచ్చింది అంటుంటే అప్పుడు ఆ మాటలకు నాకు అర్థం తెలియలేదు.

అమ్మ శవం దగ్గర కూర్చుని ఏడవడం తప్ప నేనేం చెయ్యగలను? ఎవరో మునిసిపాలిటీ వాళ్లకు ఫోన్ చేశారు. అమ్మ శవం తీసుకెళ్లిపోయారు. ఏడుస్తున్న నన్ను ఓదార్చడానికి ఎవరూ లేరు. దానికి కారణం నాకప్పుడు అర్థం కాలేదు. నా తల్లికి సోకిన వ్యాధి నాలో కూడా ఉందేమో! నన్ను ముట్టుకుంటే ఆ వ్యాధి వాళ్లకు కూడా సోకుతుందేమో అన్న భయం.

ఇల్లు అద్దెకు ఇచ్చిన పెద్దమనిషికి అప్పటిదాకా అమ్మ గురించి తెలియదు. మా అమ్మ వ్యాధి గురించి తెలిశాక ఇల్లు ఖాళీ చెయ్యమన్నాడు. అప్పుడు అమ్మ ఆ ఇల్లు ఖాళీ చేసి ఊరికి దూరంగా ఒక గది తీసుకుంది. నా స్కూలు అక్కడికి దూరం కాబట్టి నా చదువు ఆగిపోయింది.

అమ్మకు ఆ వ్యాధి సోకాక చాలా ఇబ్బందులు ఎదుర్కొన్నాం. ప్రభుత్వం ఈ వ్యాధి సోకిన వాళ్లకు మందులు ఇస్తుందని కానీ దీనికి ట్రీట్మెంట్ ఉందని కానీ అప్పట్లో అమ్మకు తెలియదనుకుంటాను. ఏమైతేనేమి అమ్మ ఆ వ్యాధికి బలయిపోయింది. పై లోకాలకు వెళ్లిపోయింది.

ఏడ్చి సొమ్మసిల్లి నిద్రపోయిన నేను లేచేసరికి మా ఇంట్లో ఉన్న కాస్త సామాను ఎవరో ఎత్తుకుపోయారు. ఏం చెయ్యాలో తోచని పరిస్థితి. ఆకలేస్తోంది. తినడానికేం లేదు. కుండలో



ఉన్న మంచి నీళ్లు ముంచుకు తాగాను. జీవితంలో మొట్టమొదటిసారి అర్థం అయింది దోచుకోబడడానికి గొప్పవాళ్లే అవక్కరలేదని, మాలాంటి వాళ్లను కూడా దోచుకుంటారని.

ఆ ఉన్న గదంతా వెదకగా నా బట్టలు, అమ్మ పాత చీరలు, ఒక చిన్న పుస్తకం. అది డైరీ కాదు అమ్మ రాసుకున్న చిన్న నోట్‌బుక్. ఆరోజుకి మంచినీళ్లతోనే నా ఆకలి తీర్చుకున్నాను. అమ్మ లేదు ఏం చెయ్యాలి? అమ్మ ఉన్నన్నాళ్లూ అమ్మ విలువ తెలియదు. అమ్మ ఒక కవచంలా మనని కాపాడుతుంది. కవచం ఉన్నన్నాళ్లూ యుద్ధభూమిలో దెబ్బలెన్నయినా కాచుకోవచ్చని, ఆ కవచం దూరమయ్యాక బతుకు దుర్భరమని నాకు జీవితం పాఠం నేర్పింది.

అమ్మ చేతి గోరుముద్దలు తింటూ స్కూలుకి వెళ్లి నా పుస్తకాలే నా ప్రపంచం అనుకున్న నేను, అది కాక ఇంకో ప్రపంచం ఉందని, దాంట్లో బతకడం అంత సులభం కాదని అర్థం చేసుకున్నాను. ఆ రోజు నించి నా జీవితపోరాటం మొదలయింది. నాకు ఏ పనీ చేత కాదు.

మర్నాడు ఆకలికి ఆగలేక బయటకు వెళ్లి అడుక్కున్నాను. ఒక అమ్మ పెట్టిన రొట్టెతో కడుపు నింపుకున్నాను. మళ్లీ ఆకలి మధ్యాహ్నం అయ్యేసరికి నేనున్నానంటూ మొదలయింది. చెయ్యి చాచడానికి ఇంకో అమ్మ తలుపు తట్టాను. ఆ అమ్మ తలుపు తీసి "అడుక్కుందుకు సిగ్గు లేదూ, కాళ్లూ చేతులూ బాగున్నాయి పని చెయ్యచ్చు కదా!" అంది,

అప్పుడు తెలిసింది పని చేస్తే

### మనిషి తొడ ఎముకలు కాంక్రీట్ కంటే గట్టివి!



డబ్బులు వస్తాయని. "అయితే పని ఇప్పించండి చేస్తాను. అమ్మ చచ్చిపోయింది. పని రాదు కానీ చెపితే చేస్తాను. ఆకలిగా ఉంది" అన్నాను. ఆ చల్లని తల్లి కేకలేసినా కడుపు నిండా అన్నం పెట్టింది. అన్నం తిన్నాక "ఏం పని చేస్తావు? నువ్వు పనిపిల్లలా లేవు" అంది.

"నేను స్కూల్లో చదువుకున్నాను. అమ్మకు జబ్బు చేశాక స్కూలు మానేశాను. పని రాదు. అమ్మ ఎప్పుడూ పని చెప్పలేదు. మీరు చెపితే చేస్తాను. ఏ పనయినా సరే నాకు అన్నం పెట్టండి చాలు" అన్నాను.

అలా పనిమనిషిగా అవతారం ఎత్తాను. నాకు పని ఆ అమ్మే నేర్పింది. అంట్లు ఎలా తోమాలో? ఇల్లు ఎలా తుడవాలో, బట్టలు ఉతకడం అన్నీ నేర్పింది. రెండు పూటలా అన్నం పెట్టి నెలాఖరుకు నాకు జీతం కూడా ఇచ్చింది. కాలక్రమేణా డబ్బులు సంపాదించడం ఎలాగో తెలుసుకున్నాను. ఆ అమ్మ సహాయంతో ఇంకో ఇంట్లో కూడా పని దొరికింది.

చిన్నప్పటి నుంచీ చదువు మీద నాకున్న ధ్యాస అమ్మ జబ్బుతో మూతవెయ్యాల్సి వచ్చింది. నేను పని చేస్తున్న ఇంట్లో నా ఈడు అమ్మాయి చదువుకోవడం చూశాక నాకు కూడా మళ్లీ చదువుకోవాలన్న ధ్యాస కలిగింది. పొద్దస్తమానూ ఇళ్లల్లో పనిచేసి చదువుకోవాలంటే సాధ్యం కాదు.

నాలుగో క్లాస్‌తో ఆగిపోయిన నా చదువు మళ్లీ మొదలుపెట్టాలి. ఎలాగా? ఆ అమ్మ గారి అమ్మాయి పుస్తకాలు తెచ్చుకుని రాత్రుళ్లు చదవడం మొదలుపెట్టాను. స్కూలుకి వెళ్లి చదువుకోవడం నాకు సాధ్యం కాదు.

ఒకరోజు నేను పని చేస్తున్న అమ్మగారిని అడిగాను. నాకు చదువుకోవాలని ఉందని. ఆమె చెప్పిన సలహా మేరకు పొద్దున్నే స్కూలుకి వెళ్లే ముందు పని చేసేదాన్ని. సాయంకాలం స్కూలు నుంచి వచ్చాక పనిచేసేదాన్ని. అలా టెన్త్ వరకు చదువుకున్నాను." అంటూ ఆపింది ఊర్వశి.

"పని చేస్తూ ఎలా చదువుకున్నావు? పరీక్షలకు చదువుకోవడం కష్టం కదా!" అంది మాధవి.

"కష్టమే. దానికి ఒక మార్గం కనిపెట్టాను. నేను చదవాల్సినదంతా పేపర్లో రాసుకుని ఒక తాడుకు క్లిప్‌లతో ఆ పేపర్లు పెట్టి పనిచేస్తూ మధ్య మధ్యలో ఆ వాక్యాలు చదువుతూ కంఠతా పెట్టేదాన్ని. మనసుంటే మార్గాలు దానంతటవే వస్తాయి." అంది.

"మరి ఆ తరువాత?" అంది మాధవి.

"ఆ తరువాత కూడా చాలా కష్టాలు ఎదుర్కొన్నాను. కొన్నాళ్లు కూలి పనిలో డబ్బులెక్కువంటే అక్కడ పనిచేసి డబ్బు కూడబెట్టి ప్రైవేట్‌గా ఇంటర్ చదివాను. మహానుభావులు వీధి దీపాల వెలుగుల్లో చదువుకున్నారని చదివాను. నేను కూడా రాత్రుళ్లు వీధి దీపాల కింద చదువుకున్నాను. దానికి కారణం రూమ్‌కి అద్దె నా ఒక్కదాని సంపాదనతో అవదు అందుకని ఇంకో పని చేస్తున్న అవ్వ ఇల్లు కావాలంటే నా రూమ్ షేర్ చేసుకోడానికి ఆహ్వానించాను. రాత్రుళ్లు లైట్ వేస్తే ఆమెకు ఇబ్బంది. మా ఇంటి ఓనరు పది దాటితే లైట్ ఆర్పేయాలంటాడు. పగలు పనితో చదువుకుందుకు సమయం సరిపోదు. రెండవది నేనున్న ఏరియాలో రణగొణ ధ్వనులు ఎక్కువ. ఆడపిల్లకు అన్నీ కష్టాలే. ఆమెను పీక్కుతినేందుకు రాబం

## ఆయనకే నేనంటే ఇష్టం

కాజల్ నోటి వెంట ఈ మాట వచ్చిన వెంటనే చాలా మంది ఏ హీరో గురించో చెబుతోందని అనుకున్నారు కానీ, వెంటనే క్లారిటీ ఇచ్చేసింది. ఈ మాట భగవంతుడిని ఉద్దేశించి అన్నదట! అదేంటి? దేవుడంటే మాకు ఎంతో ఇష్టం అని చెబుతారుకానీ, దేవుడికే నేనంటే ఇష్టం అనడం ఏమిటి? అన్న అనుమానం వస్తోంది కదూ! కాజల్ ఈ విధంగా రివర్స్‌లో చెప్పడానికి ఓ కారణముంది. అదేంటో ఆమె మాటల్లో వింటే ఆశ్చర్యపోవలసిందే! 'సాధారణంగా దేవుడా! నాకు ఇది ఇవ్వు...అది ఇవ్వు అని కోరుకుంటే తప్ప ఆయన కరుణించడు. కానీ నా విషయంలో మాత్రం నేనేమీ అడగకుండానే నాకు అన్నీ ఇచ్చాడు. అంటే అర్థం ఆయనకు నేనంటే ఇష్టమే కదా' అంటూ రివర్స్‌లో చెప్పుకొచ్చింది.

## మైగ్రేన్ (పార్శ్వపు తలనొప్పి)

తరుచుగా తలనొప్పి వస్తే అశ్రద్ధ చేయకూడదు. ఎందుకంటే తలనొప్పికి చాలా కారణాలున్నాయి. రక్తపోటు, మెదడులో కణతులు, రక్తనాళాలలో రక్త ప్రసరణలో మార్పులు, మానసిక ఒత్తిడి, నిద్రలేమి వల్ల, మగవారిలో రక్తపోటు, మానసిక ఒత్తిడి, మెదడులో కణతుల వల్ల తలనొప్పి వచ్చే అవకాశం ఉంటుంది. మైగ్రేన్ తలనొప్పి స్త్రీలలో అధికంగా చూస్తుంటాం. ఈ నొప్పి చాలావరకు తలకు ఒకపక్కవస్తుంది. వాంతులూ ఉండవచ్చు. తలలోని రక్తనాళాలు ఒత్తిడికి లోనయి వాచడం వల్ల ఈ నొప్పి వస్తుంది.

**పార్శ్వపు తలనొప్పికి కారణాలు:** పార్శ్వపు తలనొప్పి కి మానసిక ఆందోళన, ఒత్తిడి ముఖ్య కారణాలు. అనవసరపు ఆలోచనలు, జరిగిపోయిన విషయాల ను తరుచుగా ఆలోచించడం వల్ల వస్తుంది. డిప్రేషన్, నిద్రలేమి, కొందరిలో బయటకు వెళ్ళి నప్పుడు, సూర్యరశ్మి వల్ల, అధికంగా ప్రయాణాలు చేయడంవల్ల వస్తుంది. స్త్రీలలో హార్మోన్ల సమస్యలు ఏర్పడినప్పుడు, ఋతుచక్రం ముందుగా గాని, తర్వాత గాని వచ్చేఅవకాశం ఉంటుంది. గర్భాధారణ సమయంలో స్త్రీలలో ఋతుచక్రం ఆగిపోయినప్పుడు ఈ సమస్య తీవ్రమయ్యే అవకాశం ఉంటుంది. ఓరల్ కాంట్రసెప్టివ్ పిల్స్ లాంటి కొన్నిరకాల మందులువాడటంవల్ల రావచ్చు.

**మైగ్రేన్ దశలు-లక్షణాలు:** సాధారణంగా 24-72 గంటల్లో దానంతట అదే తగ్గవచ్చు. ఒకవేళ నొప్పి 72 గంటలు ఉంటే స్టేటస్ మైగ్రేన్ అంటారు. మైగ్రేన్ 4 దశలలో సాగుతుంది.**ప్రోడ్రోమ్ ఫేజ్:** ఇది నొప్పికి ముందు 2 గంటల నుంచి 2 రోజుల ముందు వరకు జరిగే ప్రక్రియల సమూహం. ఈ దశలో చిరాకు, మానసికఆందోళన, డిప్రెషన్, ఆలోచనలో మార్పులు రావడం, వాసన, వెలుతురు పడకపోవడం, మెడనొప్పి ఉంటాయి.

**ఆరాఫేజ్:** ఈ దశ నొప్పి ప్రారంభానికి కొద్ది నిమిషాల ముందు ఉంటుంది. చూపు మందగించడం, జిగ్ జాగ్ లైన్స్ కనిపించడం, తలలోసూదులు గుచ్చిన ఫీలింగ్, మాటలు తడబాటు, కాళ్ళలో నీరసం ఉంటాయి. **నొప్పిదశ:** ఈ నొప్పి దశ 2 గంటల నుంచి 3 రోజుల వరకు ఉండే అవకాశం ఉంటుంది. ఈ దశలో వాంతులు ఉంటాయి. చాలా వరకు ఒక వైపునే ఉంటుంది. కాంతికి, ధ్వనికి చాలా సెన్సిటివ్‌గా అంటే చికాగ్గా అనిపిస్తుంది.

**పోస్ట్‌డ్రోమ్ ఫేజ్:** నొప్పి తగ్గిన తర్వాత కొద్ది రోజుల వరకు తలభారంగా అనిపిస్తుంది. ఒళ్ళంతా నీరసంగా, నిరాసక్తంగా అనిపిస్తుంది.



**వ్యాధి నిర్ధారణ:** 1 రక్త పరీక్షలు-సీబీపీ, ఈఎస్ఆర్ 2. రక్తపోటును గమనించడం. 3.ఈఈజీ పరీక్ష సిటీస్కాన్(మెదడు). 4.ఎం.ఆర్.ఐ పరీక్షలు ఉపకరిస్తాయి. **మైగ్రన్ రాకుండా తీసుకోవాల్సిన జాగ్రత్తలు:** 1. మానసిక ఆందోళన తగ్గించాలి.



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**

2. అతిగా ఆలోచనలు చేయకూడదు. మానసిక ఒత్తిడి తగ్గించుకోవాలి. దీనికోసం యోగా, ప్రాణాయామం చేయాలి. ధ్యానం ద్వారా మానసిక ప్రశాంతత లభిస్తుంది. 3. తలకు నూనెతో మసాజ్ చేసుకుంటే తలలోని నరాలు రిలాక్సవుతాయి.

4.తలనొప్పి వచ్చినప్పుడు ప్రశాంతవాతావరణంలో, లైటు తీసేసి నిశ్శబ్దంగా ఉన్నచోటపడుకోబెట్టాలి.

**హోమియోవైద్యం:** మైగ్రేన్ తలనొప్పికి హోమియోలో మంచి మందులున్నాయి. ఘాటైన వాసనలు పీల్చిన పుడు వస్తే, బెల్లడోనా, లైకోపోడియం, ఇగ్నీషియా ఇవ్వాలి. తరుచు ఎక్కువగా వస్తుంటే, నాట్రంమూర్, సాంగ్వునేరియా, చైనా, సెపియా ఇవ్వాలి. గర్భవతు ల్లో వస్తే బెల్లడోనా, సక్సీవామికా, సెపియా ఇవ్వాలి. ఎక్కువగా చదవడం వల్ల వస్తే కాల్కేరియా కార్బ్, నాట్రామూర్, ట్యూబర్కులినమ్. ప్రయాణాల వల్ల వస్తే -ఇగ్నీషియా సెపియా, కాక్యులస్, కాలికార్బ్ ఇవ్వాలి. స్కూల్‌కి వెళ్ళే ఆడపిల్లలో వస్తే - కాల్కేరియాఫాస్ నాట్రంమూర్, పల్సటిల్లా ఇవ్వాలి. పైన తెలిపిన మందులు కేవలం అవగాహనకు మాత్రమే. వాటిని నిష్ణాతులైన హోమియో డాక్టర్‌ని సంప్రదించి మాత్రమే తీసుకోవాలి.



## ఫ్యాటీలివర్

కాలేయంలో కొవ్వుశాతం ఉండవలసిన స్థాయి కంటె ఎక్కువ ఉండటాన్ని ఫ్యాటీలివర్ అంటారు. కాలేయం... అహారాన్ని ప్రొటీన్‌గా, కొవ్వుగా, పిండి పదార్థాలుగామారుస్తుంది. సహజంగానే కాలేయం లో కొంతకొవ్వు ఉంటుంది. శరీరంలోని ఇతర భాగాల నుండి కూడా కొవ్వు సరఫరా చేయబడు తుంది. ఫ్యాటీలివర్ వ్యాధిలో... కాలేయకణాలలోని కొవ్వుతో ట్రైగ్లిజరాయిడ్స్ కూడా వచ్చి చేరుతాయి. ఈ విధంగా కొవ్వు కాలేయ కణాలలో నిక్షిప్తమవు తుంది. ఈ సంక్లిష్ట కొవ్వును కాలేయ కణాలు సరళమైన పదార్థాలుగా మార్చలేకపోవటం వలన ఫ్యాటీలివర్ వ్యాధి ఏర్పడుతుంది. ఫ్యాటీలివర్ వ్యాధి ప్రమాదకరమైనది కాదు. కాని కాలేయం బరువు కన్నా 10 శాతం కొవ్వు శాతం అధికంగా ఉండటం వలన కాలేయంలోవాపుమొదలవుతుంది. కాలేయం పని తీరు మందగిస్తుంది. ఇది రెండు రకాలుగా చెప్పవచ్చు. 1.ఆల్కహాలిక్ ఫ్యాటీలివర్. ఈ వ్యాధి ఆల్కహాల్ఎక్కువగా తీసుకునేవారిలోకనబడుతుంది. 2.నాన్ ఆల్కహాలిక్ ఫ్యాటీలివర్.

కొంతమంది ఆల్కహాల్ తీసుకోకపోయినా బరువు అధికంగా ఉండటం వలన కనిపిస్తుంది. చక్కెర వ్యాధితో బాధపడేవారిలో కూడా ఫ్యాటీ లివర్ వస్తుంది. సన్నగా ఉండేవారిలోనూ ఈ వ్యాధి వస్తుంది. వంశపారంపర్యంగానూ, వివిధ రకాల వ్యాధులకుమందులు వాడటంతోవాటిదుష్ప్రభావాల వల్ల కూడా ఫ్యాటీలివర్ రావచ్చును. లక్షణాలు. వ్యాధితీవ్రత ఎక్కువగా లేకపోతేలక్షణాలను తేలికగా గుర్తించలేం. లక్షణాలు తీవ్రమైతే కాలేయంవాపు లేదా హైపటైటిస్, సిర్రోసిస్‌అనే కండిషన్ వస్తాయి. కొన్నిసార్లు కామేర్లు, ఉదరంలో కుడివైపునొప్పి, వాపు, జ్వరం లాంటి లక్షణాలు కనిపిస్తాయి. గర్భవతుల్లో ఈవ్యాధి తీవ్రత వలన వాంతి వచ్చినట్లు అనిపంచటం, ఆకలి లేకపోవటం, నొప్పి మొదలైన లక్షణాలు ఉంటాయి.

ఈ వ్యాధి రావటానికి కారణాలు: 1. ఆల్కహాల్ తీసుకోవటం 2. బరువు పెరగటం 3. ఆకలి తక్కువగా ఉండటం 4. చక్కెరవ్యాధి 5. స్టిరాయిడ్స్ వాడకం 6. కొలెస్ట్రాల్ అధికస్థాయిలో ఉండటం 7. మందుల ప్రభావం. ఈ వ్యాధిని రక్తపరీక్ష ద్వారా గుర్తించవచ్చు. ఈ పరీక్షద్వారా లివర్ ఎంజైములలో మార్పు కనిపిస్తుంది. లివరుబయాప్సీ వలన దాని తీవ్రత ఎంతవరకు ఉందో గుర్తించవచ్చు. ఆయుర్వేదశాస్త్రం ప్రకారం కాలేయం పిత్త ప్రకృతి కలిగి ఉంటుంది. ఇది జీర్ణక్రియను సమతుల్యం చేసి విషాలను బయటకు పంపుతుంది. కాలేయం లో ఆల్కహాల్ శాతం, కొవ్వు శాతం అధికమవ్వటం వలన అధికంగాశ్రమిస్తుంది. ఈకారణంగా లివరులో వాపు మొదలవుతుంది. ఆయుర్వేదవైద్యం ప్రకారం ఆహారవిహారాలను క్రమబద్ధీకరించడం వలన, ఔషధసేవన వలన ఈ వ్యాధిని పూర్తిగా అదుపులోఉంచవచ్చు. అధిక బరువు కలవారు పంచకర్మల ద్వారా బరువును అదుపులో ఉంచు కోవడం ద్వారా ఫ్యాటీలివర్ వ్యాధిని నివారించ వచ్చును. నిపుణులైన డాక్టర్ల పర్యవేక్షణలో మాత్రమే వ్యాధిని నిర్ధారించుకుని చికిత్స తీసుకోవటం వలన ఫ్యాటీలివర్‌ను పూర్తిగా నివారించవచ్చును. నివారణ. ఆల్కహాల్ తీసుకోరాదు. మసాలా పదార్థాలు తినకూడదు. చల్లని వస్తువులు,వేపుళ్ళు తినరాదు. పులుపుపదార్థాలు తగ్గించి కూర గాయలు తీసుకోవాలి. బరువు(తగ్గించుకోవాలి) నియంత్రణలో ఉండేలా చూసుకోవాలి.

**డా. మనోహర్.** M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**

దుల్లా జనాలు కనిపెట్టుకుని కూర్చుంటారు. వయసొచ్చిన ఆడపిల్లను ప్రతివాడూ చొంగ కార్చుకుంటూ చూసేవాడే. వీధి లైట్‌లో చదువు కుందామన్న నా ప్రయత్నం ఎక్కువ కాలం సాగ లేదు.

పుస్తకం చదువుకుంటున్న నన్ను ప్రతీవాడూ "రాత్రికి రేటెంత" అని అడగడం మొదలుపెట్టాడు. అవరోధాలు ఎక్కువయిన కొలదీ నాలో పట్టుదల పెరిగింది. ఏమైనా అనుకున్నది సాధించాలి. నా చదువు పూర్తి కావాలి.

చాలా కష్టాల మధ్య నా ఇంటర్ పూర్తి అయ్యింది. ఆ తరువాత కొన్నాళ్లు స్కూల్లో ప్యూన్‌గా, మంచినీళ్లు అందించే పనిలో కొన్నాళ్లు పనిచేస్తూ గడిపాను. ఆ తరువాత ఒక తెలుగు వారపత్రికలో చదువుకునే పిల్లలకు వాళ్ల మార్కులు చూసి స్కాలర్‌షిప్ ఇస్తామన్న ప్రకటన చూసి నా మార్కులు పంపాను. పంపానే కానీ నాకు వస్తుందన్న నమ్మకం లేదు. నేను కలలో కూడా ఊహించనట్లుగా ఆ పత్రిక అధిపతి నాకు ఒక ఉత్తరం రాశారు, నన్ను ఇంటర్వ్యూకి రమ్మని.




భయపడుతూ నా మార్కులూ, సర్టిఫికెట్లూ పట్టు కుని, వాళ్ల ఆఫీసుకి బయలుదేరాను. అక్కడ నాలాంటి వాళ్లు చాలామంది ఉన్నారు. ఇంటర్వ్యూ రూమ్‌లోకి అడుగుపెట్టాను. ఒక్కసారి నా కాళ్లు వణికాయి. కళ్లు మూసుకుని గట్టిగా ఊపిరి పీల్చుకుని కళ్లు తెరిచాను. అక్కడ ఉన్నవాళ్లు నా గురించి అడిగితే అన్నీ చెప్పాను ఒక్కటి తప్ప. నా తల్లి ఎయిడ్స్‌తో చనిపోయిందన్న విషయం తప్ప. దానికి కారణం ఆ సమయంలో మా అమ్మ ఎదుర్కొన్న పరిస్థితుల్ని నేను చూశాను. అది అంటువ్యాధి కాదన్నా కూడా అంటువ్యాధి సోకిన మనిషిలా ఆమెను చూశారు. దాని ప్రభావం కొన్నాళ్లు నన్ను కూడా సోకింది. నన్ను కూడా కొన్నాళ్లు అంటరానిదానిగానే చూశారు. ఏ విషయ మైనా కొన్నాళ్లే దాని ప్రభావం. నేనున్న ఏరి యాలో నిత్యం బతుకు సమరానికి సన్నద్ధమయ్యే వాళ్లు ఎక్కువ ఉండడంతో కాలక్రమేణా నా గురించి పట్టించుకోవడం మానేశారనే చెప్పాలి.

నా చరిత్ర విన్న ఆ పత్రికాధిపతికి నచ్చి నట్లుంది. నాకు స్కాలర్‌షిప్ వచ్చింది. ఆ తరు వాత వారి సహాయంతో పోస్ట్ గ్రాడ్యుయేషన్ పూర్తి చేశాను. ఆ తరువాత ఈ చిన్న ఉద్యోగం వెతుక్కున్నాను. న్యాయంగా ఆలోచిస్తే ఇక్కడితో నా చదువు ఆపవచ్చు. కానీ ఒకరోజు పేపర్‌లో చదివాను, ఒక ఆటోడ్రైవరు కూతురు సీఏ చది విందని. నా చదువు ఇక్కడితో ఆగకూడదు. ఏదో చెయ్యాలన్న తపన. ఎందుకో కలెక్టర్ అవ్వాలన్న కోరిక నాలో మొదలయింది. ఇది కష్టం అవ్వచ్చు. అయినా పట్టుదలగా ఇక్కడి దాకా వచ్చిన నేను ముందుకు అడుగు వెయ్యలేనా అనిపించింది. దాని పర్యవసానమే ఇప్పుడు నేను చేస్తున్న యజ్ఞం. ఈ నా ప్రయాణంలో నేను ఒంటరినే. విజయం సాధించినా ఒంటరిగానే సాధించానని చెప్పవచ్చు. దేనికైనా పట్టుదల ముఖ్యం మాధవీ. మానవుడు తలచుకుంటే సాధించలేనిది లేదని నా అభిప్రాయం. పరిస్థితులు అనుకూలించ లేదంటారు. దాన్ని మనకు అనుకూలంగా మార్చు కోవడమే. మనం ప్రయత్నించకుండా ఏదీ సాధ్యం కాదు. మన ప్రయత్నం మనం చేస్తేనే దేవుడు మనకు సహకరిస్తాడని నేను నమ్ముతాను" అంది ఊర్వశి.

"నీ కథ వింటే చాలా బాధ కలిగింది. నీ పట్టుదల చూస్తే ముచ్చట వేస్తోంది. అమ్మ నిన్ను చూసి పొగిడినప్పుడల్లా చాలాసార్లు నాకు కోపం వచ్చేది. నాకు ఎన్నో సౌకర్యాలు ఉన్నాయి. అయినా చదువుకోవడం ఏదో కష్టతరమైన పని అన్నట్టుగా అనుకునేదాన్ని. నువ్వు చెప్పినట్లుగా మనిషికి ఒక ధ్యేయం ఉండాలి. సాధించాలన్న పట్టుదలా ఉండాలి. పిరికివాడిని లోకం తరిమి కొడుతుంది. నిన్ను చూసి అందరూ అనుకున్నది సాధించడం ఎలాగో నేర్చుకోవాలి. ఇంతకీ మీ అమ్మగారు ఈ వృత్తిలోకి ఎలా వచ్చారు. మీ కులమే అదే దేవదాసి అంటారే అలాంటి కులమా! లేక...." అంటూ ఆగిపోయింది.

"అమ్మ గురించి నాకు అమ్మకి రోగం వచ్చే దాకా తెలియదు. అమ్మ ఆ వృత్తిలో ఉన్నా నాకు తెలియకుండా జాగ్రత్తపడింది. నన్నెప్పుడూ చదు వుకో, చదువే నీ జీవితం అని నూరిపోసింది. అప్పుడెందుకు ఆమె అలా అనేదో నాకు తెలియదు. అమ్మకు ఎయిడ్స్ వచ్చినప్పుడు చుట్టుపక్కల వాళ్లు 'అందరితో తిరిగింది అందుకే ఈ రోగం వచ్చిందన్నప్పుడు, మీ అమ్మ చెడిపోయిన మనిషి' అన్నప్పుడు కూడా నాకు అర్థం కాలేదు.

ఆవిడ రాసుకున్న ఆ చిన్ని పుస్తకంలో ఆమె రాసుకున్న వాక్యాలు ముందు చదివితే అర్థం కాలేదు. బహుశా ఇంటర్‌లో ఉన్నప్పుడనుకుంటాను మళ్లీ చదివాను. మంచి కుటుంబంలో పుట్టిన అమ్మ వయసు వ్యామోహంలో ప్రేమ అంటూ ఇంట్లోంచి పారిపోయి, ఆ ప్రేమించిన వాడు మోసం చేస్తే, గతి లేక నన్ను కన్నాక ఈ వృత్తిలోకి దిగింది. నన్ను పోషించడమే తన ధ్యేయంగా పెట్టుకుంది. నా ఆకలికి ఆమె కడుపులో పేగులు కదిలేవని రాసుకుంది. అమ్మలందరూ అంతేనేమో! కొన్నిసార్లు ఆమె రాత్రుళ్లు అనుభవించిన నరకం గురించి కూడా రాసుకుంది. తమ భార్యలను అపు రూపంగా చూసుకునే వాళ్లు డబ్బు ఇస్తున్నంత మాత్రాన వేశ్యల పట్ల అనుచితంగా ప్రవర్తిం చాలా? అమ్మ ఆ బాధను మాటల రూపంలో రాసింది. చదివాక నేనే లేకపోతే అమ్మ ఈ వృత్తి లోకి దిగేది కాదేమో? అన్న అనుమానం నాలో సుడులు తిరిగేది. ఆమె అనుభవాలు చదివాక మగజాతి అంటేనే ఏహ్యభావం కలిగింది.

ఆవిడ అనుభవాలే నాకు హెచ్చరికగా తన జీవితంలో జరిగినదంతా రాసి ఆమెలా నా జీవితం అవకుండా కాపాడుకోమని, చదువుకుని పైకి రమ్మని ఆ పుస్తకంలో రాసింది. అది చదివిన నేను అమ్మలా మోసపోకూడదని చదువే నా ధ్యేయంగా పెట్టుకుని, నా జీవితంతో ఆటలాడు కుందామనుకున్న వాళ్లను పక్కకు పెట్టాను. ఇప్పటిదాకా ఈ పోరాటం సాగించాను. నేను తలపెట్టిన యజ్ఞం పూర్తవ్వాలి. దానికి భగ వంతుడి సహాయం ఎప్పుడూ దొరకాలని ప్రార్థి స్తున్నాను. నీలాంటి మంచి వాళ్ల సాంగత్యం లభించేటట్టుగా చేసిన దేవుడికి ఎప్పుడూ కృత జ్ఞురాల్ని అంటూ ముగించింది ఊర్వశి.

ఇది జరిగిన కొద్ది కాలానికి... ఆ రోజు సివిల్స్ ఎగ్జామ్స్ రిజల్ట్స్ వచ్చాయి. ఊర్వశి ఆరో ర్యాంకులో పాస్ అయింది. మాధవి పాస్ అవలేదు. అయినా మాధవి నవ్వుతూ ఆమెను కౌగలించుకుంది.

"నీకు బాధగా లేదా?" అన్న ఊర్వశి మాట లకు, "నువ్వు సాధించావు. ఈ ఇన్స్పిరేషన్‌తో నేను మళ్లీ ప్రయత్నిస్తాను. కాబోయే కలెక్టర్ గారు నాతో మాట్లాడతారా?" అంది నవ్వుతూ.

"ఏయ్" అంటూ ఆమె మీద చెయ్యెత్తి ఆగిపోయి తను కూడా నవ్వుతూ ఉండిపోయింది ఊర్వశి.

పత్రికల వాళ్లు, టీవీ వాళ్లు ఇంటి ముందు గుమిగూడారు, "మీ విజయానికి కారణమెవరు? మీలో ఈ పట్టుదల ఎలా వచ్చింది?" అన్న ప్రశ్న లకు చిరునవ్వే సమాధానం ఇచ్చింది ఊర్వశి.

"ఆమె విజయానికి ఆమే కారణం. కృషితో నాస్తి" అనే నానుడిని నిజం చేసింది మా ఊర్వశి. నేను ఆమె స్నేహితురాలినని గర్వంగా చెప్పుకుం టున్నాను" అంది మాధవి ఆనందబాష్పాలు జాలువారగా.....

*సెల్: 77023 19351*

# సురభి



## మృగరాజు వైభోగం

పెట్ హోదాలో శునక, మార్జాల రాజులు ఎన్నో భోగాలు అనుభవిస్తూ ఉండటం మనం చూస్తూనే ఉన్నాం. కానీ ఓ మృగరాజు కూడా ఇలాంటి వైభోగాన్నే అనుభవించడం మీరె ప్పుడూ చూసి ఉండరు. అమెరికా వాసి విక్కీ ఆ మృగరాజుకి సమస్త భోగాల్నీ సమకూరుస్తున్నాడు!

ఇన్‌సింక్ ఎక్జాటిక్స్ అనే జంతు సంరక్షణశాలకు సంచాలకుడుగా పని చేస్తున్న విక్కీ ఈ సింహాన్ని పెంచుకుంటున్నాడు. దాన్ని ముద్దుగా ల్యాంబర్ట్ అని పిలుచుకుంటున్నాడు. అయితే ల్యాంబర్ట్‌కి ఓ వింత అలవాటుంది. అది చిన్నప్పుడు పరుపు మీద పడుకునేదట! దాంతో దానికో దుప్పటి తెచ్చి బోన్‌లో వేశాడు విక్కీ. అంతే దాన్ని చుట్టేసుకుని చక్కగా కునుకు తీసేసిందట ఆ బుల్లి సింహం. అప్పటి నుండి ఆ దుప్పటిని అస్సలు వదిలిపెట్టదు ల్యాంబర్ట్. పెంపుడు జంతువుగా పెరిగింది కాబట్టి అడవుల్లో ఉండలేదని దానిని తన వైల్డ్ లైఫ్ హౌస్‌లోనే పెట్టుకున్నాడు. దానికోసం ప్రత్యేకంగా ఏడు వేల చదరపు అడుగుల స్థలం కేటాయించాడు. అది ఎంచక్కా ఆడుకునేందుకు గడ్డితో మైదానం, ఈతకొట్టడానికి స్విమ్మింగ్‌పూల్ కట్టించాడు. దాన్నే పెంపుడు జంతువులాగా పెంచుతున్నాడు విక్కీ. ఇదేం ఆనందమో ఏమో కదా!

## పుస్తకాలు లేని లైబ్రరీ

చరిత్ర తెలుసుకోవాలన్నా, తెలియని విషయాన్ని సవివరంగా తెలుసుకోవాలన్నా, గ్రంథాలయాలకు వెళ్ళాల్సిందే! అక్కడ మనకు కావలసిన పుస్తకం వెతికి తీసుకుని చదువుకుంటాం. కానీ డెన్మార్క్‌లో ఓ లైబ్రరీకి వెళ్తే అక్కడ పుస్తకాలు ఉండవు. ఇదేం వింత లైబ్రరీ అనుకుంటున్నారా? దానిగురించి తెలుసుకోవాలంటే డెన్మార్క్ వెళ్ళాల్సిందే!

కోపెన్‌హేగెన్ నగరంలోని హ్యూమన్ లైబ్రరీకి వెళితే అక్కడ ఒక్క పుస్తకం కూడా కనిపించదు. సైలెన్స్ బోర్డులు కనిపించవు. అక్కడ మెనూ ఉంటుంది. ఆ మెనూ ప్రకారం మనం తెలుసుకోవాలనుకుంటున్న అంశాన్ని ఎంచుకోవాలి. వెంటనే ఆ అంశానికి సంబంధించిన వివరాలు, సమాచారం అందించడానికి ఒక వ్యక్తి మీకు అందుబాటులోకి వస్తారు. మీ సందేహాలకు అక్కడికక్కడే సమాధానాలు చెబుతారు. డెన్మార్క్‌కు చెందిన అబర్‌గెల్, అతని సోదరుడు డాని, కొందరు సహోద్యోగులు కలిసి ఈ హ్యూమన్ లైబ్రరీ ఏర్పాటు చేశారు. ఇక్కడ పనిచేసేవారు కూడా స్వచ్ఛందంగా సేవలు అందించేవారే! ముఖ్యంగా సమాజంలో ఎదురవుతున్న సమస్యలపై ప్రజలకు అవగాహన కల్పించేందుకు వారికున్న సందేహాలను నివృత్తి చేసేందుకు ఈ లైబ్రరీని ఏర్పాటు చేశారు.

## కండల వీరుల గ్రామం

అక్కడి యువకులు ఎంచుకున్న ఉపాధి మార్గం వల్ల ఆ గ్రామ రూపురేఖలే మారిపోయాయి. ఒకప్పుడు పేదరికంలో మగ్గిన గ్రామం ఇప్పుడు ఆర్థికంగా ఎంతో అభివృద్ధి చెందింది. కారణం వారి కండలే! ఆ కండలే వారిని బౌన్సర్లుగా మార్చాయి. ఇప్పుడు ఆ ఊరంతా బౌన్సర్లే!

ఢిల్లీలోని అసోలా గ్రామంలో చిన్న పిల్లాడు కూడా జిమ్‌కి వెళతాడు. శరీరాన్ని దృఢంగా మలుచుకుంటాడు. బాడీ బిల్డర్‌లా తయారవుతాడు. ఒకప్పుడు పనీపాటా లేక కుస్తీపోటీలు నిర్వహించుకునేవారు. ఇప్పుడు బౌన్సర్లుగా ఉద్యోగాలు సంపాదిస్తున్నారు. నైట్ పబ్బుల్లో సెలబ్రిటీలకు భద్రత ఇచ్చే బౌన్సర్లుగా మారుతున్నారు. అది వారికి వృత్తిగా మారిపోయింది. వీరిలో ఒక్కొక్కరు నెలకు సుమారు 50 వేలపైనే సంపాదిస్తున్నారు.

మొదటిసారి విజయ్ పహిల్వాన్ అనేవ్యక్తి బౌన్సర్‌గా ఉద్యోగం సంపాదించాడు. దీంతో ఆ ఊరి యువకులంతా అతడి బాటే పట్టారు. ఆ ఊరి యువకులు మద్యం, ధూమపానం అలవాట్లకు దూరంగా ఉంటారు. ప్రతిరోజు ఒక్కొక్కరు డజను అరటిపండ్లు, ఉడకబెట్టిన 10 గుడ్లు, 10 లీటర్ల పాలు తీసుకుంటారట. బౌన్సర్ వృత్తి వారికి ఇష్టంగా, సంప్రదాయంగా మారింది.



## మనుషులకంటే నయం!



ఆ మూడూ క్రూర జంతువులు. ఆజన్మ విరోధులు. అయినాగానీ వాటికి మా మంచి జత కుదిరింది. తిండీ, నిద్రా, ఆటా అన్నీ కలిసే చేస్తాయి. ఎందుకో స్నేహితులుగా మారాయి. అట్లాంటాలోని ఒక బేస్‌మెంట్ ఏరియాలో డ్రగ్స్ రాకెట్ గుట్టు రట్టు చేసేందుకు వెళ్ళిన పోలీసుల కంటబడి ఆశ్చర్యపరిచాయి. 2001లో చిన్న వయసులోనే పులి, సింహం, ఎలుగుబంటి ఆ మూడింటినీ జార్జియాలోని నోవా ఆర్క్ వైల్డ్ లైఫ్ శాంక్చ్యురీకి తరలించారు. వాస్తవంగా ఈ మూడింటికీ అస్సలు పడదు. పేరుకు క్రూర జంతువులు గానీ మనుషులు సైతం ఆశ్చర్యపడేలా ఆ మూడూ స్నేహంగా ఉంటున్నాయి. ఒకటి కాదు రెండు కాదు ఏకంగా పదిహేనేళ్ళుగా అన్‌బ్రేకబుల్‌గా వాటి మధ్య స్నేహం కొనసాగుతూనే ఉంది. ఈ రోజుల్లో మనుషుల కంటే ఆవే నయం కదా! నిజంగా అద్భుతమే!

-నర్మద వాసిరెడ్డి



# ఈగో పక్కనపెడితే దూసుకెళ్తావ్

**"ఏ వ్యక్తి అయినా పరిపూర్ణ నాయకుడిగా ఎదగాలంటే ముఖ్యంగా మూడు లక్షణాలుండాలి. దూరదృష్టి, ప్రణాళిక, కార్యశీలత. మరో రకంగా దీనినే కలలు కనడం; ఆలోచించడం, ఆచరించడం" అంటారు.**

శిరీష్ చాలా కోపంగా ఉన్నాడు. ఎందుకంటే అతను ఎంతో ఇష్టంగా కష్టపడి సంవత్సరకాలం పనిచేసిన ప్రాజెక్టులో అతని పర్‌ఫార్మెన్స్‌కి పూర్ రేటింగ్ ఇవ్వటమే కాకుండా, ఆ ప్రాజెక్ట్ సూపర్‌వైజ్ చెయ్యడానికి శిరీష్‌పై చీఫ్ టెక్నికల్ ఆఫీసర్ని నియమించటం.

వెంటనే బాస్ ఛాంబర్లోకి వెళ్ళి "సంవత్సరకాలంగా నేను నా శక్తియుక్తులన్నీ ధారపోసి ఈ ప్రాజెక్ట్ కోసం ప్రణాళికలు తయారుచేసినందుకు మీరిచ్చే ప్రతి ఫలం ఇదా?! పైగా ఈ ప్రాజెక్ట్ సూపర్‌వైజ్ చెయ్యడానికి సి.టి.ఓ.ని అప్పాయింట్ చెయ్యడం నాకు చాలా అవమానంగా ఉంది. నిజానికి సి.టి.ఓ ప్రమోషన్‌కి నాకు అర్హత లేదనా మీ ఉద్దేశం? ఇంత సర్వీస్‌చేశాక కూడా నేను నెక్ట్స్ లెవల్‌కి ప్రమోట్ అవటానికి అనర్హుణ్ణనా మీ భావన" అన్నాడు కోపంగా.

శిరీష్ కోపాన్ని అర్థం చేసుకున్న బాస్ గోపాలకృష్ణ కూల్‌గా "చూడు శిరీష్ గత సంవత్సరం నువ్వు సరిగా పనిచెయ్యలేదని అనటంలేదు. నిజానికి ప్రాజెక్ట్ ప్రణాళికల రూపకల్పనలో నీది అద్భుత ప్రతిభ. కానీ ఇదే ప్రాజెక్టుని ఒక బృహత్ ప్రణాళికలా తీర్చిదిద్దాలని కంపెనీ భావిస్తోంది. ఇంత పెద్దప్రాజెక్టు డీల్ చెయ్యటానికి, కార్యాచరణలో నీకు అంత అనుభవం, ప్రవేశం ఉందో లేదో కంపెనీకి తెలియదు."

"నాకు కేటాయించిన పనిని నేను సమర్థంగా చెయ్యగలిగినప్పుడు కార్యాచరణలో పెట్టలేనని ఎందుకనుకుంటున్నారు?" అడిగాడు అసహనంగా.

## తొందరపాటు

"ఇక్కడ అనుభవమా? అనుమానమా? అన్నది కాదు ముఖ్యం. నీకు అపార అనుభవముంది. కానీ దానిని కార్యాచరణలో పెట్టి, బృహత్ ప్రణాళికగా మార్చి, దీన్నో బెంచ్‌మార్క్ ప్రాజెక్టుగా తీర్చిదిద్దేందుకు నీకుతోడుగా అనుభవమున్న సి.టి.ఓ.ని ఎంపిక చేశాం. ప్రణాళికల కార్యాచరణ, సత్ఫలితాల సాధనలో అతడు నీకు తోడ్పడతాడు' నిజానికి ఇది నీకో మంచి అవకాశం. నీకు అనుభవంలేని రంగాల్ని నువ్వు ఒక్కడివే నడిపించడానికీ, అనుభవమున్న వ్యక్తితో కలిసి పని చెయ్యడానికీ తేడా ఉంది. మీరిద్దరూ కలిసి పని చేస్తే నీకే అనుభవం వస్తుంది. ఈ ప్రాజెక్టు ఫలితాలు కంపెనీ మార్కెట్ వాల్యూ పెరుగుదలకు దోహదపడతాయి" అన్నాడు బాస్.

శిరీష్‌కి ఆ మాటలు రుచించలేదు. 'త్వరలో జాబ్‌కి రిజైన్ చేస్తానని ఆవేశంతో చెప్పేశాడు.

## మనస్సాక్షి

అతను చేసింది కరెక్టేనని అతని ఈగో సమర్థించింది. రోజులు గడుస్తున్న కొద్దీ ఈగో సాంద్రత తగ్గి "తొందర పడ్డానేమో అనే స్థాయికి వచ్చాడు. ఈ సందిగ్ధంలో అతనికి గైడెన్స్ కావాలనిపించింది. సన్నిహితుడైన తన పాత కంపెనీ బాస్ శ్రీరాంను కలిశాడు. జరిగిందంతా చెప్పి "నా నిర్ణయం సరైనదా? కాదా?" అనడిగాడు శిరీష్.

## సరైన గైడెన్స్

శిరీష్ తొందరపాటు తెల్సిన శ్రీరాం మెల్లగా చెప్పాడు. "నువ్వు సరిగా చెయ్యడం లేదని నీబాస్ అనలేదు. నీకు కార్యాచరణానుభవం ఉందో లేదో యాజమాన్యానికి తెలియదుకాబట్టి, ఆ రంగంలో అనుభవమున్న వ్యక్తి పర్యవేక్షణలో నిన్ను పని చెయ్యమని చెప్పారు. అందువల్ల నీ బాస్‌లో తప్పు కన్పించడం లేదు" అన్నాడు.

"ప్రణాళికల రూపకల్పనతప్ప కార్యాచరణ గురించి వాళ్ళు నాకు చెప్పలేదు. నేను తయారు చేసిన ప్రణాళికల్ని కార్యాచరణలో పెట్టడం నాకు కష్టమేం కాదు. నాకు దక్షత ఉన్న రంగంలో మరొకరి ప్రవేశం ఎందుకు?" అన్నాడు శిరీష్.

"కథా రచయితలందరూ మంచి దర్శకులు కాలేరు. దర్శకత్వం అనుభవానికి సంబంధించింది. ఖర్చుచేసిన డబ్బు తిరిగి రాబట్టుకోవటం బాగా తెల్సిఉండాలి. తప్పు దొర్లితే సక్సెస్ రాదు. నీకూ అదే వర్తిస్తుంది

ప్రపంచం నీ బలం గుర్తించినప్పుడు నువ్వు విజేతవి. నీలో బలహీనతల్ని నువ్వే గుర్తించినప్పుడు నువ్వు మరింత శక్తిమంతుడిగా ఎదగగలవు" అన్నాడు శ్రీరాం.

బలహీనతల్ని గుర్తించి, దిద్దుబాటుతో కార్యాచరణలోకి దిగితే, నీలో సృజనాత్మకత కొత్త ఆవిష్కరణలు చేస్తుంది. ప్రణాళికా విభాగంలో నీకున్న అద్భుత ప్రతిభను యాజమాన్యం గుర్తించినప్పుడు తొందరపడి రాజీనామా చేస్తావా?" అన్నాడు. కానీ ఎందుకో శ్రీరాంతో ఏకీభవించలేకపోయాడు శిరీష్.

## ఈగో ప్రధాన ఆటంకం

"ఏకీభవించడానికి నీకు ఈగో అడ్డొస్తోంది. అది భవితకు స్పీడ్ బ్రేకర్ కాకూడదు. ఏ వ్యక్తి



## హేట్సాఫ్

మనదేశ సంపన్నుల జాబితాలో ఈయన పేరు 45వ స్థానంలో కన్పిస్తుంది. కానీ విలువలతో వ్యాపారం చేసే వ్యక్తుల్లో ఆయనదే ప్రథమ స్థానం. ఆయన వ్యాపార మార్కెట్ విలువ 30 వేల కోట్లు. ఈ సంపద సృష్టికి పాతికేళ్ళు పట్టింది. ఆ క్రమంలో ఒడిదుడుకులు ఎదుర్కొని 'విజయాన్ని' చిరునామాగా మలచుకుని, సంపూర్ణ నాయకుడిగా ఎదిగారు 'దివీస్ లేబొరేటరీస్ అధినేత దివి మురళీకృష్ణ ప్రసాద్.

మచిలీపట్నం సమీపం మంతెన గ్రామంలో జన్మించారు. చిన్నవయసు నుండే క్రమశిక్షణ, కష్టపడే తత్వం అలవడ్డాయి. ఇంటర్లో ఫెయిలై మణిపాల్‌లో ఇంజనీరింగ్ చదువుతున్న అన్నయ్య దగ్గరకెళ్ళారు. అదే ఆయన జీవితానికి టర్నింగ్ పాయింట్. అక్కడే బి.ఫార్మసీ చదివి, మణిపాల్ యూనివర్సిటీ ఫస్టొచ్చి, గోల్డ్‌మెడల్ సాధించారు. హైదరాబాద్‌లో 250 రూపాయలకి, పిమ్మట యూనిలాబ్స్‌లో 1000 రూపాయలకి ఉద్యోగాలు చేశారు.

అమెరికా వెళ్ళి కెమిస్ట్‌గా, కాస్మోటిక్ రసాయనాల కంపెనీ సూపరింటెండెంట్‌గా ఒక్కో మెట్టు ఎక్కుతూ ఓ సంస్థకు వైస్ ప్రెసిడెంట్, డైరెక్టర్ స్థాయికి ఎదిగారు.

ఇండియా వచ్చి, రెడ్డిల్యాబ్స్ అంజిరెడ్డితో కలిసి మూతబడ్డ కెమినార్ సంస్థని 12 లక్షల పెట్టుబడితో, ఆరుగురు ఉద్యోగులతో ప్రారంభించారు. ఎవరెన్ని మాట్లాడినా పట్టించుకోలేదు. అనతి కాలంలో రాష్ట్రంలో, దేశంలో రసాయనాల తయారీలో లీడర్‌గా ఎదిగారు. 1990 నాటికి కోట్ల రూపాయల కంపెనీగా మారింది. 1990లోనే కెమినార్ నుండి బయటికొచ్చి సొంతంగా దివీస్ రీసెర్చ్ సెంటర్, దివీస్ ల్యాబ్స్ స్థాపించి, మందుల తయారీలో ప్రపంచంలో అగ్రస్థానం చేరుకున్నారు. 100 మందితో మొదలైన ఉద్యోగుల సంఖ్య 10,000లకు చేరింది. కంపెనీలో వారికీ వాటాలిచ్చారు.

నా కాళ్ళూ, ఆలోచనలూ... ఎప్పుడు భూమ్మీదే. అదే నా విజయానికి కారణం అంటున్న మురళీకృష్ణ ప్రసాద్ సంపూర్ణ నాయకుడు.

హేట్సాఫ్

అయినా పరిపూర్ణ నాయకుడిగా ఎదగాలంటే మూడు రకాల వ్యక్తిత్వాల్ని అలవర్చుకోవాలి. దూరదృష్టి, ప్రణాళిక, కార్యశీలత మూడు రకాల వ్యక్తిత్వాలు. వీటినే ఇంకో విధంగా కలలు కను, ఆలోచించు. అమలుచెయ్యి అంటారు.

కలలుగనే శక్తి నీ దృష్టిని సరైన మార్గంలోకి తీసుకెళుతుంది. నీ ఆలోచనాశక్తి నీ దృష్టికి ప్రణాళికనిస్తుంది. నీలోని ప్రణాళికాశక్తి కార్యశీలతకి మార్గం సుగమం చేస్తుంది. విజేతలెప్పుడూ మొదలుపెట్టిన పని సగంలో వదిలి పెట్టరు. సగంలో వదిలి వెళ్ళేవారెవరూ విజేతలు కాలేరు" అని వివరంగా చెప్పాడు శ్రీరాం.

శిరీష్ మౌనంగా వింటుంటే, "చూడు శిరీష్.. ఈ మూడు అంశాలు వ్యక్తికి వ్యక్తికి, స్థాయికి స్థాయికి, సంస్థకి సంస్థకీ మారుతుంటాయి.

ప్రాథమిక, మాధ్యమిక స్థాయిల్లో ప్రణాళికలే ఎక్కువ అవసరపడతాయి.

పైస్థాయిలో దీర్ఘకాలిక ప్రయోజనాల కోసం, ప్రణాళికల్ని సరైన మార్గంలో అమలుపరిచి, ఫలితలు రాబట్టే వారి సహకారం అవసరపడుతుంది.

నీలో ఉన్న ప్రణాళికా ప్రతిభతో బాటు, కార్యాచరణలో మెళకువలు తెలుసుకోవడానికి ఇదో అద్భుతమైన అవకాశం. నువ్వాశించినట్టు, నువ్వు పని చేసే కంపెనీలో సంపూర్ణ నాయకుడిగా.. నీ ప్రతిభ వెలుగు చూడబోయే రోజు సమీపంలోనే ఉంది" అని వివరించి చెప్పాడు.

### బలహీనతల్ని జయించిన వాళ్ళే....

ఇప్పుడు శిరీష్‌కి క్లారిటీ వచ్చింది. ఈగో పక్కకి నెట్టి, భవిష్యత్తు గురించి ఆలోచించటం మొదలు పెట్టాడు. ఊగిసలాటకి ఉద్వాసన పలికాడు.

"Inhale the Fut-ure without any expectation, hold the present and exhale the past without Regret".

అవరోధాల్ని దాటకుండా ఎవరూ జీవితంలో ముందుకు సాగలేరు. విజయంలో అదోభాగం. ఎటువంటి సందర్భాన్నైనా ఎదుర్కోగల్గిన వాడే ధైర్యవంతుడు. అలాంటి ధైర్యవంతులే... సంపూర్ణ నాయకులుగా పరిణతి చెంది అద్భుత ఫలితాలు సాధిస్తారు.

### ఆత్మవిశ్వాసం

తనని బలహీన పరచిన ఆలోచనల్నే తన బలంగా మార్చుకున్నాడు శిరీష్. దృఢమైన ఆత్మవిశ్వాసం ప్రదర్శించాడు. కార్యాచరణలో మెళకువలు నేర్చుకోవడానికి, కొత్త సి.టి.ఓతో కలిసి నిబద్ధతతో పనిచెయ్యాలని నిశ్చయించుకున్నాడు.

ఆ మరు యేడాదికే శిరీష్ కార్యదక్షత గల సంపూర్ణ నాయకుడిగా పదోన్నతి పొందాడు.

బలహీనతలు జయించి, తనలో నిద్రాణమైన బలాల్ని గుర్తించి, పటిష్ఠ ప్రణాళిక, సమతుల్యంతో కార్యాచరణలో దూసుకెళ్ళడమే వెనక్కి తిరిగి చూడని విజయం. అలాంటి విజయాన్ని అందుకోగల్గినవారే పరిపూర్ణ నాయకులు. వారే విజయానికి చిలాసంగా మారతారు.

## నీలో శత్రువుని జయించు

- విచార సమయంలో ఉదారత; కృషితో మానవీయత, విజయంలో సంయమనం కల్గినవారే సంపూర్ణ నాయకులవుతారు.
- బాహ్య శత్రువులపై యుద్ధం కన్నా, నీలోని శత్రువుల్ని జయించడమే విజయానికి పునాది.
- 'చెయ్యండి' అంటాడు యజమాని. 'చేద్దాం' అంటాడు నాయకుడు. యజమాని, నాయకుడు మధ్య తేడా అదే.
- పొరబాట్ల గురించి ఆలోచించకు. నీలోని బలమైన అంశాల్ని ఎదగనిస్తే పొరబాట్లు ఎండుటాకుల్లా రాలిపోతాయి.
- సమస్య ఉన్నప్పుడే మనిషి సమర్థత వెలుగు చూస్తుంది.
- మనిషికి అవసరమైనవి స్పందించే హృదయం, ఆలోచించే మెదడు, పనిచేసే చేతులు.
- గొప్ప విషయాల్ని చిన్నపదాల్లో చెప్పొచ్చు. స్వేచ్ఛ, బాధ్యత, గౌరవం, న్యాయం, నాయకత్వం.
- వివేకబలంతో ముందుకు సాగలేని వాడు, బలవంతంగా వెనక్కి నెట్టివేయబడతాడు.
- సంపూర్ణ నాయకుడిగా ఎదగాలంటే నిరంతర విద్యార్థిలా మారాలి. కలలు కను, ఆలోచించు, అన్వేషించు, అమలుచెయ్యి. నీకు తెలీకుండానే నాయకుడిగా ఎదుగుతావు.



•••

'కల సాకారానికి శ్రీకారం చుట్టేముందు అనుభవం సంపాదించు. తర్వాత రెంటినీ సాహసం-సమతుల్యంతో కార్యాచరణలో పెట్టు. నీలో ప్రతిభ ప్రజ్ఞ తెలుస్తాయి. కార్యసాధనలో ప్రతిభ గల వాళ్ళే పరిపూర్ణ నాయకులవుతారు"

-గోథే

(ఇంకావుంది)



# అమ్మకానికి ఫ్రెష్ ఎయిర్!

**ఎన్నో వింతలకు, ఉద్యమాలకు ఆలవాలం చైనా దేశం. అభివృద్ధిలో పరుగులు తీస్తున్న దేశం. జనాభాలో, కాలుష్యంలో కూడా అందరికంటే ముందుంది.**

**ఎన్నో రకాల వస్తువులను ప్రపంచ మార్కెట్‌లో చౌక ధరలకు అమ్మి వ్యాపారాలు చేసే ఆ దేశంలో జనాభా వల్ల, కాలుష్యం వల్ల కొత్త సమస్యలు వస్తున్నాయి. ఆ సమస్యల్ని సొమ్ము చేసుకునేందుకు సరికొత్త ఆలోచనలే కాదు, అక్కడ వింత వ్యాపారాలు కూడా పుట్టుకొచ్చాయి. అవేమిటో మీరూ చదివేసేయండి!**

అసలే ఎండాకాలం. మండే ఎండలు. అధిక ఉష్ణోగ్రతలు. నీళ్ల కొరత ఎలానూ ఉంది. ఒకప్పుడు ఎక్కడ పడితే అక్కడ నీళ్లు పుష్కలంగా దొరికేవి. ఇప్పుడా పరిస్థితి లేదు. అన్నీ కొనుక్కోవాల్సిందే. అన్నీ వ్యాపారానికి పెట్టేశారు. ఇక గాలి ఒక్కటే మిగిలింది సుమా! అనుకుంటున్నారా? ముందు ముందు గాలి తప్ప మరేదీ ఫ్రీగా దొరకదేమో అని ఆలోచిస్తున్నారా? మీ ఆలోచనల్ని అక్కడే ఆపేయండి. ఆ లిస్టులో గాలి కూడా ఇప్పుడే జేర్చేసుకోండి మరి! అదేంటీ బయట పుష్కలంగా గాలి దొరుకుతుంటే గాలి కొనుక్కోడమేంటని ఆశ్చర్యపోతున్నారా?

### అమ్మకానికి స్వచ్ఛమైన గాలి

అవునండీ! చైనాలో గాలి దొరకడం బహు కష్టమైపోతోందట. గాలి దొరక్కపోవడం ఏంటీ? తిక్క తిక్కగా ఉందా? అని అనుకుంటున్నారా? నిజమేనండీ బాబూ! స్వచ్ఛమైన తాగునీరు కావాలంటే కొనుక్కోవల్సిందే కదా? అదేవిధంగా స్వచ్ఛమైన పీల్చేగాలి కావాలన్నా అక్కడ మార్కెట్‌లో కొనుక్కోవాల్సిందే! మానవ తప్పిదాల వల్ల గాలి నీరు రెండూ కలుషితమై అనారోగ్యాల పాలవుతున్నాం. ఇక స్వచ్ఛమైన గాలి ఎక్కడ దొరుకుతుంది చెప్పండి.

రండి బాబూ రండి..మంచి తరుణం మించిన దొరకదు. త్వరపడండి ఇక్కడ స్వచ్ఛమైన గాలి దొరుకుతుంది అంటూ అక్కడ కొన్ని గొంతుకలు అరుస్తుంటాయి. నచ్చిన వారు ఆ షాపుకి వెళ్లి గాలిని కొనుక్కొని రావచ్చు. కొంచెం అర్థమైంది కదా! నీరులానే గాలి కూడా కలుషితమైపోవడంవల్ల స్వచ్ఛమైన గాలిని కూడా డబ్బాల్లో పెట్టి అమ్మే పరిస్థితి వచ్చేసింది చైనాలో.

వాతావరణ కాలుష్యం కారణంగానే చైనాలోని కొన్ని ప్రాంతాల్లో ఇలా స్వచ్ఛమైన గాలిని కూడా అమ్ముతున్నారట.

ఈ విషయాన్ని ప్రపంచానికి తెలియకుండా దాచాలని చైనా ప్రభుత్వం ఎంతగానో ప్రయత్నించింది. అయితే టెక్నాలజీ ముందు ఏ విషయమూ దాగదు కదా! సోషల్ మీడియాలో ఈ వార్త గుప్పుమంటోంది. గాలి కాలుష్యం తగ్గించడానికి ఎన్ని పథకాలు రూపొందించినప్పటికీ చైనాలో గాలి వ్యాపారం మూడుపువ్వులు ఆరుకాయల్లా సాగుతోందట. అక్కడ ప్రజలు ఇప్పుడు తిండితో పాటు డబ్బాల్లో నింపిన గాలికోసం కూడా డబ్బులు ఖర్చు పెడుతున్నారు.

### వైటాలిటీ ఎయిర్ కంపెనీ

చైనాలో రోజు రోజుకూ పెరుగుతున్న ఫ్రెష్ ఎయిర్ బిజినెస్‌ను క్యాష్ చేసుకోవాలనుకుందేమో, కెనడాకు చెందిన ఓ కంపెనీ తమ దేశంలో పర్వత ప్రాంతమైన బాన్ఫ్ నుంచి తాజా గాలి సేకరించి దాన్ని క్యాన్లలో బంధించి చైనాకు ఎగుమతి చేస్తోంది. ఇంతకీ ఆ కంపెనీ పేరేంటంటే వైటాలిటీ ఎయిర్. తమ వ్యాపారాన్ని ప్రారంభించే ముందు 500 క్యాన్ల శాంపిల్స్ చైనాకు ఎగుమతి చేశారట. ఆ క్యాన్లన్నీ వారంలోగానే హాట్ కేకుల్లా అమ్ముడు పోవడమే కాకుండా, ఇంకా కావాలంటూ బయ్యర్ల దగ్గర నుంచి ఆర్డర్లు కూడా వస్తున్నాయట. ఇదేదో బాగుందనుకుందో ఏమో ఎక్కువ గాలి క్యాన్లను ఉత్పత్తి చేస్తోంది ఆ కంపెనీ. సైజును బట్టి ఆ గాలి క్యాన్ల ధర నిర్ణయించారు. అవి 935 రూపాయల నుంచి మొదలు పెడితే 1337 రూపాయల వరకూ వివిధ సైజుల్లో దొరుకుతున్నాయి. మరి ఇలాంటి పరిస్థితుల్లో గాలికి కూడా రేటుకట్టాల్సిందే కదా!

### హోటల్‌లో గాలి దోపిడీ!

హోటల్‌కి వెళితే తిన్నదానికి బిల్లు కట్టేసి, ఎక్స్ట్రా టాక్స్‌లేమైనా ఉంటే వాటిని కూడా చెల్లించి వచ్చేస్తాం. అయితే చైనాలో మాత్రం ఓ హోటల్ గాలిని కూడా క్యాష్ చేసుకుంటోంది. గంటకింత రేటని చెప్పి రేటు కట్టి అమ్మేస్తోంది. ఆ హోటల్‌లో తినడానికి వచ్చేవారికి తినే తిండి బిల్లు మాత్రమే కాదు అక్కడ పీల్చుకున్న గాలికి సైతం పదిరూపాయలు ఎక్స్ట్రా చెల్లించాల్సిందే! అదేంటీ గాలికి డబ్బులు చెల్లించడం ఏంటను కుంటున్నారా? అక్కడ దొరికేది కాలుష్యం లేని స్వచ్ఛమైన గాలి మరి! కలుషితమైన గాలిని శుభ్రపరిచే ప్యూరిఫయర్లు ఆ హోటల్లో ఉన్నాయి. అవి మంచిగాలి అందిస్తాయని, వాటికోసం డబ్బు చెల్లించాల్సిందేనని షరతును విధించింది ఆ హోటల్. మొత్తానికి ఈ గాలి దోపిడీ చాలా విడ్డూరంగా ఉంది కదండీ! మన దేశంలో కూడా వీలైనంతవరకు పర్యావరణ, వాతావరణ కాలుష్య నియంత్రణ చర్యలు ఇప్పటినుండీ తీసుకోకపోతే మనకీ ఈ పరిస్థితి తలెత్తే అవకాశాలు లేకపోలేదు! తస్మాత్ జాగ్రత్త!

### రోజుల తరబడి ట్రాఫిక్‌జామ్!

అత్యధిక జనాభా దేశం చైనా. అందుకే ట్రాఫిక్ జామ్‌లు కూడా అక్కడ సర్వ సాధారణం. ట్రాఫిక్‌లో మనం పదిహేను నిమిషాలు వెయిట్ చేస్తేనే చిరాకు పడిపోతాం కదా! కానీ చైనాలో ట్రాఫిక్ జామ్ క్లియర్ అవడానికి కొన్ని గంటలు లేదా రోజులు లేదా కొన్ని వారాలు కూడా పట్టవచ్చునట! అలాంటి ట్రాఫిక్ జామ్లో ఇరుక్కుపోయిన వారి సంగతి చాలా కష్టం కదా!









అందుకే దీన్ని కూడా క్యాష్ చేసుకోవాలనుకున్నారేమో అక్కడి ప్రజలు. అలాంటి ట్రాఫిక్ జాములలో ఇరుక్కుపోయిన వారిని తప్పించడానికి ఒక కంపెనీవారు ఒక సర్వీసు పెట్టారు. వారికి ఓ ఫోన్ నంబరు ఉంటుంది. ట్రాఫిక్‌లో ఇరుకున్న వారు ఈ సర్వీస్ కంపెనీకి ఫోను చేయాలి. వెంటనే ఆ కంపెనీవారు ఒక మోటార్ సైకిల్ మీద ఇద్దరిని పంపిస్తారు. ఒకరు వాహనంలో ఉన్న వారిని ఎక్కించుకుని , షార్ట్ కట్స్‌లో సందులలో నుంచి తీసుకుని వెళతారు. మరి ఇంకొకరెం దుకనా మీ డౌటు. ట్రాఫిక్ క్లియర్ అయిన తర్వాత ఆ వాహనాన్ని సదరు వ్యక్తికి అప్పగించడానికి ఆయనకు బదులుగా సర్వీసు సెంటరు నుంచి వ్యక్తి ఉంటాడు. మరి ఈ సర్వీసంతా ఫ్రీగా చేస్తారనుకునేరు. అందుకు గానూ కొంత డబ్బు కట్టాలి. ఇలాంటివి ముందు ముందు మన దేశంలోనూ రావొచ్చేమో కదా!

### అద్దెకు తెల్లజాతీయులు!

అమెరికాలాంటి దేశాలలో తెల్లవారు ఎక్కువగా ఉంటారన్న సంగతి మనకందరికీ తెలిసిందే. పాశ్చాత్య దేశాలలో వ్యాపార అభివృద్ధికి కారణం తెల్లవారేనని చైనాలోని పెద్ద పెద్ద కంపెనీలు నమ్ముతున్నాయట. తెల్లవారు ఇంగ్లీషు అనర్గళంగా మాట్లాడుతారు కాబట్టి వ్యాపార సమావేశాలప్పుడు తెల్లవారితో మాట్లాడించడానికే ఎక్కువ ఆసక్తి చూపిస్తున్నారట. అందువల్ల చైనాలో పెద్ద పెద్ద మీటింగులూ సెమినార్లలో తెల్లవారిని అద్దెకు తీసుకుని వారిని పక్కన ఉంచుకుని సాధ్యమైనంత వరకూ చైనా భాష మాట్లాడకుండా ఆంగ్లభాషే మాట్లాడటానికి ప్రయత్నిస్తారు. ఇది వారి వ్యాపార అభివృద్ధికి ఎంతగానో మేలు చేసేసరికి, కేవలం పెద్ద కంపెనీలే కాదు ఇప్పుడు ప్రతి చిన్న కంపెనీ కూడా తెల్లవారిని అద్దెకు తెచ్చుకుంటున్నారట.

### రుచికరమైన రోబో కుక్ హోటల్స్

హోటల్స్‌లో కుక్‌లు భోజనం తయారు చేసి సర్వ్ చేస్తారు. కానీ చైనాలో రోబో హోటల్స్‌కి డిమాండ్ పెరిగిపోతుందట. ఈ హోటల్స్‌లో నూడుల్సు నుండి చిల్లీ చికెన్ వరకు రోబోలే తయారు చేస్తాయి. ఇవి తయారు చేసే ఆహారం చాలా రుచిగా ఉంటుందట. రోబో చేతులకున్న మెటాలిక్ వేలు ఆహారానికి కొత్త రుచిని కలిగిస్తుంది. 2011లో క్యారన్యాన్ అనే అతను, క్యూ అనే రోబో వంటమనిషిని తయారు చేశాడు. రుచికరంగా వంటలు చేసే రోబోలను తయారు చేసి, ఒక్కొక్క రోబోను ఒక లక్షా 50 వేల రూపాయలకు హోటల్స్‌కు అమ్ముతున్నాడు. ఇప్పుడు చైనాలో రోబో వంట వారిగా ఉండే హోటళ్ళు, రెస్టారెంట్లకు జనం ఎక్కువగా వెళ్లి అవి వండిన పదార్థాలను తినడానికే ఎక్కువ ఉత్సాహం చూపిస్తున్నారట.

### అమ్మాయిలకు మాత్రమే

చైనాలో ఓ తేయాకు కంపెనీలో పనిచేసే వారిలో పెళ్లికాని అమ్మాయిలు మాత్రమే తేయాకు కోయాలి. ఇదేదో ఆచారం అనుకునేరు. కానే కాదు వ్యాపారాభివృద్ధికి ఆ టీ కంపెనీ వారు అవలంబిస్తున్న పెద్ద టెక్నిక్. వారు కేవలం అమ్మాయిలను మాత్రమే పనిలోకి తీసుకుంటారు. తేయాకు కోయాలనగానే చేతులతో అనుకునేరు. ఆ అమ్మాయిలు టీ ఆకులను చేతితో కోయరు. తమ నోటితో కోసి తీస్తారు. ఆకులు వేసుకునే బుట్టను కూడా మెడలో వేసుకుంటారు. ఇలా అమ్మాయిల ద్వారా టీ వ్యాపారం చాలా అభివృద్ధి చెందుతోందని అంటోంది ఆ తేయాకు కంపెనీ.

### తాబేలు కీ చైన్లు

చివరికి చైనావారు తాబేలును కూడా వదలట్లేదు. బతికి ఉన్న తాబేలుతో కీ చైన్లు తయారు చేసి అమ్ముతున్నారు. ఒక ప్లాస్టిక్ కవరులో కావల్సిన ఆక్సిజన్‌తో పాటు కావల్సిన్ని విటమిన్లతో ఉన్న నీటిని నింపి దానిలో తాబేలు, ఆల్చిప్ప లాంటి చిన్న చిన్న జంతువులను ఉంచి వీటిని కీ చైన్లుగా అమ్ముతున్నారు. కొందరు వీటిని అదృష్టంగా భావించి కొంటుంటే కొందరు ఆ అమాయక జంతువులను వదిలిపెట్టడానికి కొంటున్నారట.

### పీతల వెండింగ్ మిషన్

పీతలు అంటే చైనా వారికి చాలా ఇష్టమైన ఆహారం. అక్కడి ప్రజలు ఎక్కువగా పీతలే తింటారట. మరి ఎక్కడపడితే అక్కడ అవి దొరకవు కదా! దీన్ని దృష్టిలో పెట్టుకొని క్రాబ్ కో అనే పీతలను సప్లయి చేసే ఒక కంపెనీ 2010లో ప్రజల వసతి కొరకు ఈ పీతల వెండింగ్ మిషన్లను పబ్లిక్ ప్రదేశాలలో ఉంచింది. అంటే రైల్వే స్టేషన్లలోనూ, బస్టాపుల్లో, పెద్ద పెద్ద మార్కెట్లూ లాంటి చోట్ల ఈ మిషన్లు అమర్చింది. ఈ మిషన్ ద్వారా చనిపోయిన పీతలతో పాటు బతికున్న పీతలను కూడా కొనుక్కునే అవకాశం ఉందట. కొన్ని ప్రత్యేక పరిస్థితుల్లో వాటిని మిషన్‌లోనే పెంచే ఏర్పాటు చేశారు దీన్ని తయారు చేసిన కంపెనీ వారు.

- విజేత

### పసందైన వ్యాపారం పాండా టీ



పాండా టీ అనే పేరు వినడంతో ఇదో కొత్తరకం టీ ఆకులతో తయారు చేసింది అనుకునేరు. కాదు ఈ టీ పాండా మలము నుంచి తయారు చేస్తారు. ప్రపంచంలో అత్యంత ఖరీదైన టీ ఇదే. ఈ టీ పొడి ఒక కిలో 40 లక్షల రూపాయలు. అంతరేటు పెట్టి ఈ టీ తాగాల్సిన అవసరం ఏంటంటారా? పాండాలు వెదురుబొంగులను తింటాయి. అవి తినే వెదురు బొంగులలో 30 శాతం మాత్రమే అరిగి జీర్ణించుకుంటాయి. మిగిలిన 70 శాతం మలంలో వచ్చేస్తుంది. అరగకుండా పాండా మలములో వచ్చే వెదురు బొంగులలో యాంటీ ఆక్సిడెంట్లు ఎక్కువగా ఉంటాయి. అవి కేన్సర్ రాకుండా నివారిస్తాయి. దానితో తయారు చేసిన టీని యాంటీ కేన్సర్ టానిక్‌గా, బరువు తగ్గే పానీయంగా మార్కెట్ చేస్తున్నారు.



# అందమైన జీవితం

-బాలాజీ.ఎం

**పాల గ్లాసుతో గదిలోకి వచ్చి, పాలరాతి శిల్పంలా నిలబడ్డ శైలజని చూడగానే, శ్రీరాం వేగంగా వెళ్ళి ఆమెని హగ్ చేసుకున్నాడు. ఆ వేగానికి ఆమె చేతిలోని పాలు ఒలికి ఇద్దరి ఎదలకి పాలాభిషేకం చేశాయి.**

శైలజ కంగారుగా "అయ్యయ్యో!" అంది.

అప్పుడు విచ్చుకున్న ఆమె ఎర్రని పెదవుల్ని ఎడమ చెయ్యి చూపుడువేలు, బొటనవేళ్ళతో దగ్గరచేసి, కుడిచేతి చూపుడు వేలితో వయోలిన్ మీటినట్టు మీటుతూ, "ఐ లవ్యూ శైలూ! యు ఆర్ మై ఏంజెల్" అన్నాడామె కళ్ళలోకి చూస్తూ. తనలో నిద్రిస్తున్న రసికతనంతా క్షణంలో శాంపిల్‌లా చూపించేశాడు.

అసలే అందగాడు. తెల్లని ఛాయ. ఆరడుగుల ఎత్తు. ఒత్తైన జుట్టు. తెల్లని కుర్తా, లాల్చీ వేసుకుని, మన్మథుడు సినిమా చివరి సీన్లో నాగార్జునలా మిలమిలా మెరిసిపోతున్నాడు.

గట్టిగా హత్తుకుంటూ, చెవి దగ్గర 'మాట్లాడు' అన్నాడు మెల్లగా.

'ఏం మాట్లాడను.. నువ్వే మాట్లాడించాలి' అంది.

కుడి చేత్తో ఆమె చెంపని నిమిరాడు. లక్ష ఓల్టుల విద్యుత్ ఒంట్లో ప్రవహించిన పులకింత కలిగిందామెలో.

"శైలూ... ప్లీజ్... మా...ట్లా...డు" అతని స్వరంలో చిత్రమైన లాలన.

"ఊc..." ఆమె గొంతులో మత్తు. ఆమె కన్నులు అర మోడ్పులయ్యాయి. శ్రీరాం ఆమె చుబుకం కింద వేళ్ళుంచి తల పైకెత్తాడు. అయినా శైలజ తలెత్త లేదు. చుబుకం నుండి నుదుటివరకు నోటితో 'ఉఫ్'మని ఊదుతుంటే మోముపైన పిల్లనగ్రోవి ఊదుతున్నట్టన్పించిందామెకి. తల పక్కకి తిప్పుకుంది.

అంతే! గట్టిగా కౌగిలిలో బిగించి, గులాబీ రంగులో మెత్తని బర్గర్‌లా ఉన్న ఆమె బూరె బుగ్గ మీద గాఢంగా ముద్దు పెట్టేసరికి, తనువంతా ఝల్లుమందామెకి. ఆమె చేతుల్తో పట్టుకున్న పాల గ్లాసు వదిలేసింది. అందులో మిగిలున్న పాలు మౌనంగా ఆమె ఎదలోయ గుండా ఒలికి నాభి వరకు జారాయి.

"అయ్యయ్యో!" అందామె చేత్తో తుడుచుకుంటూ.

ముద్దు మత్తులో ఉన్న శ్రీరాం "మళ్ళీ ఏమైంది?" అన్నాడు.

"పాలు.. పాలు"

"తర్వాత తాగుదాం గ్లాసు పక్కన పెట్టు"

"ఒలికి పోయాయి"

"పర్లేదు.." అని పాల చిందులు పడ్డ శైలు శరీర భాగాల్ని ముద్దులతో ముంచెత్తుతున్నాడు. ఆ చర్యకి ఇద్దరి తనువూ, మనసూ ఒకే చోట కేంద్రీకృతమవుతూ.. 'కొత్తదనం' కోసం ఆయత్తమవుతున్నాయి.

అమాంతం ఆమెని తన రెండు చేతుల మీద ఎత్తుకున్నాడు. పడిపోతానన్న భయంతో 'ఆc...' అంటూనే, ఆమె చేతులు అతని మెడని గట్టిగా వాటేసుకున్నాయి.

అతని శరీర దారుఢ్యం, ఆమె అందం నువ్వా? నేనా? అన్నట్టున్నాయి. ఇద్దరి తనువుల్లో ఎన్నడూ అనుభవంలోకి రాని ఉష్ణోగ్రత వింత ప్రకంపనాలు సృష్టిస్తోంది. సిగ్గుతో అతని ఎదలో మొహం దాచుకునేందుకు తలతిప్పిన శైలజ శరీరాన్ని కొంచెం పైకి లేపి, తనవైపు తిరిగిన ఆమె మొహాన్ని తన మొహానికి దగ్గరగా చేర్చుకుని, అదురుతున్న ఆమె అధరాల్ని, తన అధరాల్తో బంధించేశాడు. అప్పటి వరకూ మధువు ఒలకబోసిన ఆమె చిలిపి కళ్ళు మత్తుగా మూసుకుపోయాయి. అలా ముద్దాడుతూనే ఆమెని మంచం మీదికి చేర్చాడు. సరిగ్గా రెండు గంటల తర్వాత మత్తుగా కళ్ళు తెరిచింది శైలజ. తన పెదవుల మీద దాడి చేస్తున్న శ్రీరాంని పక్కకి నెట్టింది. శ్రీరాం సూటిగా ఆమె కళ్ళలోకి చూస్తూ "థాంక్యూ! బంగారం!" అన్నాడు.

"థాంక్యూ! శ్రీ!" అందతన్ని హత్తుకుంటూ. అంతే! ఆపై మాటలు మూగవైపోయాయి. తనువు, మనసుల సమాగమంలో ఓటమి ఎరుగని విజేతల్లా ప్రణయాయాసం తీర్చుకోవడానికి దూరంగా జరిగారిద్దరూ.

•••

శోభనం గదిలో కూచుని శైలజ రాకకోసం ఎదురు చూస్తూ ఊహల్లో విహరిస్తున్న శ్రీరాం, తలుపు దగ్గర శబ్దం విని "ఛ! ఇదంతా కలా!?" అనుకున్నాడు నీరసంగా. తినబోతూ రుచి చూడటానికి తొందరపడ్డ మనసుని కంట్రోల్ చేసుకుని, శైలజ కోసం ఎదురు చూస్తుంటే.. శైలజని తల్లి, అత్తగారూ... ముత్తయిదువులు గదిలోకి తీసుకొచ్చి మంచం మీద శ్రీరాంకి ఎదురుగా కూచోబెట్టారు. హారతి పట్టి, పాట పాడారు. ఐదుగురు దంపతులు ఒక్కొక్కరుగా వచ్చి అక్షింతలు వేసి ఆశీర్వదించి వెళ్ళారు.

శైలజ లేచెళ్ళి తలుపేసి వచ్చి, మౌనంగా మంచం మీద కూచుంది. శ్రీరాం ఆమె పక్కకి జరిగి, గట్టిగా హత్తుకున్నాడు. తొలిస్పర్శ తాలుకు సిగ్గు, బిడియం, చలనం లేనట్టు బిగుసుకుంటున్న శైలజ మొహాన్ని పైకెత్తాడు. వెంటనే కళ్ళు దించుకుంది.

"శైలూ! కమాన్!" అంటూ ఆమె ఎర్రటి పెదవులపై ముద్దుల ముద్ర వెయ్యాలని ఆమె మొహాన్ని చేతుల్లోకి తీసుకుని దగ్గరగా దగ్గరగా.. నాలుగు పెదవుల్ని రెండు చేసే తరుణంలో... పెదవుల్ని లోపలికి మడిచి, గట్టిగా కళ్ళు మూసుకుంది శైలజ. అంతే! ఆమెని వదిలేసి దూరంగా జరిగాడు. ఆమె మొహం నిండా స్వేదం. భయంగా అతనికి దూరంగా నిలబడింది.

ఆమెకి దగ్గరగా వచ్చి, భుజాల మీద చేతులేసి "ఆర్యూ! నార్మల్" అన్నాడు.

"నథింగ్... నథింగ్" అంది గొణుగుతున్నట్టు.

"రా! కూచుని మాట్లాడుకుందాం. నో. హర్రీ... టేక్ యువర్ ఓన్ టైం" అని మంచం వరకూ తీసుకెళ్ళగల్గాడు గానీ... అర్ధరాత్రి వరకూ ప్రయత్నించినా ఆమె మౌనాన్ని మాట్లాడించలేకపోయాడు.

అర్ధరాత్రి నిద్రొచ్చే సమయంలో ఎదురుగా కూచుని రెచ్చగొడ్తున్న ఆమె




అప్సరస అందాల్ని చూస్తూ కూచోలేక, ఆమె అనుమతించకపోయినా బలవంతంగా ఆమెని వశం చేసుకోవాలని విఫల ప్రయత్నం చేశాడు. స్పందన లేని మరబొమ్మలా ప్రతిఘటిస్తుంటే... అయిష్టంగా ఆమెకి దూరంగా జరిగి పక్కకు తిరిగి పడుకున్నాడు.

•••

మరుసటి రోజు హనీమూన్ ప్రయాణం. ఎప్పుడూ ఫ్లైట్లలో తిరిగే శ్రీరాంకి శైలజతో కలిసి రైలు ప్రయాణం చెయ్యాలన్పించింది. ఊటీలో లేక్‌వ్యూ హోటల్లో రూమ్ బుక్ చేసుకుని, ఫస్ట్‌క్లాస్ ఎ.సి.లో బయల్దేరారు. ఎదురు బెర్తులో కూచుని నవల చదువుకుంటున్న శైలజని చూసి, "అసలీమె ఇంజనీరింగ్ చదువుకుని, సాఫ్ట్‌వేర్ ఉద్యోగం చేస్తున్న అమ్మాయేనా?" అన్పించింది. ల్యాప్‌టాప్ చూస్తున్నాడే గానీ.. ఆలోచనలు వెనక్కిమళ్ళాయి.

•••

శ్రీరాం వాళ్ళది బెజవాడ. తండ్రి కృష్ణారావు హైదరాబాదులో రియల్ ఎస్టేట్ వ్యాపారం చేస్తూ సెటిలయిన సెటిలర్. శ్రీరాం హైదరాబాద్‌లోనే ఇంజనీరింగ్ చదివి, సాఫ్ట్‌వేర్ ఇంజనీర్‌గా ఉద్యోగం చేస్తూ, ప్రస్తుతం అమెరికాలో ఉంటున్నాడు.

రెణ్ణెల్ల క్రితం తండ్రి తన స్నేహితుడు వెంకటేశ్వరరావు కూతురు శైలజ గురించి చెప్పి, ఆన్‌లైన్‌లో ఆమె ఫొటోలు, వివరాలు పంపాడు. అందం, చదువు, ఉద్యోగం ఉన్న శైలజని చూడగానే ఓకే చెప్పేశాడు శ్రీరాం.

అమెరికా నుండి నెల రోజుల లీవులో రావటం, పెళ్ళి చూపులు, నిశ్చయతాంబూలాలు, ముహూర్తం, షాపింగ్ అన్నీ ప్లాను ప్రకారం చకచకా అయిపోయాయి. ఎంగేజ్‌మెంట్ అయినరోజు శైలజ కోసం యు.ఎస్. నుండి తెచ్చిన లేటెస్ట్ మోడల్ 4జి ఫోన్‌లో తన నంబరు ఫీడ్‌చేసి... తన గురించి ఇష్టాలు,

అభిరుచులు, అన్నీ తన వాయిస్‌తో రికార్డు చేసి ఇచ్చాడు. రెండ్రోజులయినా ఆమె నుండి ఫోన్ లేదు. తనే ఫోన్ చేశాడు. "ఆ... ఊఁ...' తప్ప శైలజ మాట్లాడలేదు. 'ఇష్టం లేకపోతే చెప్పండి. క్యాన్సిల్ చేద్దాం' అన్నాడు. అలాంటిదేమీ లేదని చెప్పింది. పెళ్ళిలోనూ ముభావంగానే శ్రీరాం పక్కన కూచుంది. ఎన్నో రకాలుగా ప్రయత్నించినా ఆమెని మాట్లాడించలేకపోయాడు.

రైల్లో కూచుని తలొంచుకుని నవల చదువుతున్న శైలజతో, "నన్ను ఇష్టపడే పెళ్ళి చేసుకున్నావా?" అన్నాడు.

తలెత్తి చూసింది.

"ఎందుకు శైలూ ఈ మౌనం. మాట్లాడు ప్లీజ్"

"ఏం మాట్లాడాలో తెలీడం లేదు"

"మనకి పెళ్ళయింది. ఏదైనా మాట్లాడొచ్చు. ఏమైనా చెయ్యొచ్చు" అని లేచి ఆమె పక్కకెళ్ళి కూచున్నాడు. దూరంగా జరగబోయింది. ఆమె చేతిలో ఉన్న పుస్తకం తీసి పక్కన బెట్టాడు. మెహందీతో ఎర్రగా పండిన ఆమె అరచేతిని తన చేతిలోకి తీసుకుని "ఎంత ముద్దొస్తోందో చూడు.. ముద్దు పెట్టుకోమంటోంది.. పెట్టుకోనా?" అన్నాడు మెల్లగా.

చేతిని వెనక్కి లాక్కోబోయింది. శ్రీరాం వదల్లేదు. బెదిరిపోయిన లేడిలా అతని కళ్ళల్లోకి చూసింది.

"మాట్లాడితే గాని వదలను. ఎవర్నైనా ప్రేమించావా?"

"లేదు"

కుడిచేతిని ఆమె నడుము వెనక నుండి ముందుకు జరిపి, నగ్నపు నడుము భాగాన్ని మృదువుగా స్పృశిస్తుంటే ఇబ్బందిగా కదిలింది.

"చెప్పు... మాట్లాడు" అన్నాడు లాలనగా.

"దేని గురించి?" అంది భయంగా.

"చెప్పాగా! నీ లవ్ గురించి. ఎవరతను?" అన్నాడు.

"అలాంటిదేమీ లేదు. నథింగ్.." అంది కంగారుగా.

"నాకంతా తెలుసు. నథింగ్ అంటేనే సంథింగ్ ఉన్నట్టు. నాకు సైకాలజీ అంటే ఇష్టం. పేరుకి సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ అయినా సైకాలజీ మీద పాషన్‌తో సైకాలజీ బుక్సే చదువుతాను. అందులో అమ్మాయిల సైకాలజీ చదవటం నాకు మహాఇష్టం" అన్నాడు.

శైలజ చివాల్న తలెత్తి శ్రీరాం కళ్ళలోకి భయంగా చూసింది.

శ్రీరాం చేతిని మెల్లగా ఆమె నడుము మీద నుండి పైకి జరుపుతుంటే... "వాష్‌రూం కెళ్ళాలి ప్లీజ్" అంది బేలగా.

చటుక్కున చెయ్యి తీసేశాడు శ్రీరాం.

వాష్‌రూంకెళ్ళి పది నిమిషాల తర్వాత వచ్చింది. ఆమెకళ్ళు ఏడ్చినట్టు ఎర్రబడ్డాయి. శ్రీరాం మౌనంగా తన బెర్తు మీదికెళ్ళి పడుకున్నాడు.

శైలజ తన బెర్తు మీద కూచుంది. వదిలించుకుందామన్నా వదలని ఆలోచనలు వెంటాడుతుంటే, బలవంతంగా నిద్రని ఆహ్వానించి కళ్ళు మూసుకుని పడుకుంది.

•••

కోయంబత్తూర్ రైల్వేస్టేషన్ రద్దీగా ఉంది. సమయం ఉదయం తొమ్మిదిగంటలు. ఒకటో నంబరు ప్లాట్‌ఫారంలోకి శ్రీధర్, వైదేహి వచ్చారు.

"ఆఁ... సూడా కాఫీ, కాఫీ, నెస్ కాఫీ".

"ఇడ్లీ వడ దోశయ్... సూడు సూడూ దోశయ్" వెండర్ల అరుపులు విచిత్రంగా విన్పిస్తున్నాయి.

"పయనిగుళ్ గవనిక్కవ్రమ్. హైదరాబాద్ విరిందు కోయంబత్తూర్ వళియా త్రివేండ్రం సెల్లుం శబరి ఎక్స్‌ప్రెస్ సత్రునేరత్తిల్ ఒన్రావదు ప్లాట్‌ఫారత్తిక్కువంది సేరం".

మొదట తమిళ్‌లో తర్వాత హిందీ, ఇంగ్లీషులో రైలు రాబోయే సమాచారాన్ని విన్పించారు.

పోర్టర్లు, వెండర్లు, ప్రయాణికుల్ని రిసీవ్ చేసుకోవడానికి వచ్చిన వాళ్ళ హడావిడి పెరిగింది.

వైదేహి భర్త ఎడమ చేతికింద తన కుడిచేతిని దూర్చి గట్టిగా పట్టుకుంది.

"ఏమిటోయ్ చేతికి ఏదో మెత్తగా గుచ్చుకుంటోంది" అన్నాడు శ్రీధర్.

"ఉంటుంది. ఉంటుంది. రాన్రానూ మీరు పదహారేళ్ళ బాలాకుమారుడవుతున్నారు. ఇది పబ్లిక్ ప్లేసని తెలీటం లేదా?" అని చిరుకోపంతో విసుక్కుని చేతిని వెనక్కి లాక్కోబోయింది. ఆమె చేతిని వదలకుండా, 'ఉండనివ్వవోయ్ వెచ్చగా ఉంది' అన్నాడు.

రైలు ప్లాట్ ఫారంలోకి ఎంటరయింది. శ్రీధర్ చేతిలో ఉన్న ఎ-4 సైజు పేపరు మడత తీశాడు. దానిమీద తెలుగులో 'వెల్కం టు శ్రీరాం-శైలజ' అని రాసిన అక్షరాలు వాళ్ళకి కన్పించేట్టు పట్టుకున్నాడు. రైలొచ్చి ఆగింది. బోగీ ఎంట్రన్సులో నిలబడ్డ శ్రీరాం తెలుగులో కన్పిస్తున్న స్వాగతాన్ని చూసి "అంకుల్" అని పిల్చాడు. శ్రీరాం, శైలజ లగేజీతో కిందికి దిగారు. శ్రీధర్, వైదేహి వాళ్ళ దగ్గరికి వచ్చారు.

"హలో! శ్రీరాం.. మీ పెళ్ళికి రాలేకపోయాం. వీలుపడలేదు. మీ నాన్న ఇవ్వాళ పొద్దున కూడా ఫోన్ చేసి నిష్ఠూరాలాడాడు.

"ఇట్సాల్‌రైట్ అంకుల్.. నాకంటే ముందు పుట్టింది మీ స్నేహం. నో కామెంట్స్".

"నీ పేరు శైలజ కదమ్మా! వెంకటేశ్వర్రావు గారమ్మాయివట గదా! నిన్నెప్పుడూ చూళ్ళేదు. నా పేరు వైదేహి" అంది.

"హలో! ఆంటీ" అంది శైలజ.

"హలో! అంకుల్"

"అమ్మా! శైలజా... మీ నాన్న, శ్రీరాం వాళ్ళ నాన్న, నేనూ ఫ్రెండ్స్. మీ నాన్న ఉద్యోగరీత్యా స్టేట్స్ పట్టుకుని తిరగటం వల్ల నీతో పెద్ద పరిచయం లేదు. నేను కోయంబత్తూర్‌లో బ్యాంకు మేనేజర్ని" చెప్పాడు శ్రీధర్.

శ్రీధర్, కారు డ్రైవ్ చేస్తున్నాడు.

"శ్రీ! పిళ్ళయార్ కోయిల్ దగ్గర కారాపు. మల్లెపూలు తీసుకుంటాను" అంది వైదేహి. కారాగింది. వైదేహి మల్లెపూలు తీసుకుని కార్లో ఎక్కగానే,

"అవునాంటీ! ఇక్కడ అన్ని సీజన్లలోనూ మల్లెపూలు దొరుకుతాయట గదా!"

"అవును శ్రీరాం! పగలు భక్తికి... రాత్రి రక్తికి.. అనుసంధానం ఈ మల్లెలే" చెప్పాడు శ్రీధర్.

"శ్రీ! శ్రీరాం అడిగింది నన్ను" అంది వైదేహి.

'నువ్వు నిజం చెప్పవని, నేనే చెప్పాను"



## బేరాలాడుతున్న ఇలియానా

ఒకప్పుడు ఈ గోవా ముద్దు గుమ్మ కోటికి ఒక్క రూపాయి తక్కువిచ్చినా చేసేది లేదు అని భీష్మించుకుని కూర్చునేది. అప్పట్లో టాలీవుడ్‌లో ఆమె రేంజ్ ఆ లెవెల్లో ఉండేది. ఇప్పుడు సీను రివర్సయింది. టాలీవుడ్‌ని కాదని బాలీవుడ్‌కి వెళ్ళి అక్కడ చతికిలపడింది. చేసిన రెండు మూడు సినిమాలు మంచి పేరు తెచ్చిపెట్టలేకపోయాయి. దాంతో సహజంగానే బాలీవుడ్ ప్రేక్షకులు ఇలియానాని పక్కన పెట్టేశారు. సీన్ కట్ చేస్తే చేతిలో ఒక్కటంటే ఒక్క సినిమా కూడా లేని పరిస్థితి. ఈ స్థితిలో ఇలియానాకి టాలీవుడ్ గుర్తుకు వచ్చింది. ఇంకేముంది....రాయబారాలు, బేరసారాలు ప్రారంభించింది. సినిమాకి 50 లక్షలు ఇచ్చినా సరే చేస్తానంటూ కబుర్లు పెడుతోంది. ఈమె కబుర్లు సరే....మరీ బక్కచిక్కి కరువు దేశానికి బ్రాండ్ అంబాసిడర్‌గా మారిన ఇలియానాను చూడడానికి టాలీవుడ్ ప్రేక్షకులు సిద్ధంగా లేరన్న విషయాన్ని గుర్తించిన దర్శకనిర్మాతలు ఆమెతో దాగుడు మూతలు ఆడుతున్నారట! ఇలియానా ఇంకా తగ్గి వస్తే అప్పుడు ఆలోచించవచ్చన్న ఆలోచనలో కూడా కొందరు నిర్మాతలు ఉన్నారని అంటున్నారు.

అన్నాడు శ్రీధర్.

"హి... హి... గొప్ప జోక్" అంది వైదేహి వెటకారంగా.

"ఆంటీ... అంతేలే శైలజా... నాతో సరసం, విరసం లేకుండా ఒక్క క్షణం కూడా ఉండలేదు" అన్నాడు.

"శ్రీరాం! నీకు మేం గుర్తున్నామా?" అంది వైదేహి టాపిక్ డైవర్ట్ చేస్తూ.

"ఎప్పుడో చిన్నప్పుడు చూసిన గుర్తు. మా నాన్న మీ ఇద్దరి గురించి ఎప్పుడూ చెబుతుంటారు".

"ఏమని?" అడిగాడు శ్రీధర్.

"మంచి రొమాంటిక్ జంట" అని, ఇటీవల సిల్వర్ జూబ్లీ సెలబ్రేషన్స్ కోసం మీరిద్దరూ సిమ్లా వెళ్ళిన పిక్స్ డాడీ చూపించారు. అవి చూశాక నిజమే అన్పించింది" చెప్పాడు శ్రీరాం.

శైలజ సైలెంట్‌గా వింటోంది.

కారు పదినిమిషాల తర్వాత ఇంటి ముందాగింది.

"ఇల్లొచ్చేసింది దిగండర్రా!" అన్నాడు శ్రీధర్.

"శ్రీ! వీక్లీ తెచ్చావా?" అడిగింది వైదేహి.

"తీసుకురాకపోతే ఊర్కుంటావా? ఇదుగో!" అనిచ్చాడు.

"వెల్కం యంగ్ అండ్ న్యూలీ మ్యారీడ్ కపుల్. స్వాగతం... సుస్వాగతం" అన్నారిద్దరూ.

"థాంక్యూ" అంటూ లోపలికొచ్చారిద్దరూ.

"కూచోండి! కాఫీ ఇస్తాను" అని లోపలికెళ్ళింది వైదేహి.

పెద్దహాలు. వాల్ పెయింటింగ్స్, బుక్‌షెల్ఫ్, కార్నర్‌లో రాధాకృష్ణుల విగ్రహం, కింద కాశ్మీర్ కార్పెట్, పెద్ద ఎల్.ఇ.డి. టి.వి. పెద్ద సోఫాసెట్.

"చాలా బావుంది మీ ఇల్లు".

"అంతా ఆంటీ టేస్టు".

నలుగురూ కాఫీ తాగుతుంటే, ఊ.. ఏంటి మీ ప్రోగ్రాం" అన్నాడు శ్రీధర్ వీక్లీలో శృంగార కథ చూస్తూ.

"ఈ వారం ఎవరి కథ శ్రీ!" క్యూరియస్‌గా అడిగింది వైదేహి.

"బాలాజీ.ఎం. కథ... ఐ లవ్యూ! ఓ హారికా!" అన్నాడు చూపుతూ.

"అంకుల్! రేపు మధ్యాహ్నం నుండి లేక్‌వ్యూ హోటల్‌లో రెండు నైట్స్‌కి రూమ్ బుక్కయింది. తర్వాత రోజు ఇక్కడి కొచ్చి ఫ్లైట్‌లో హైదరాబాద్ వెళ్తాం" చెప్పాడు శ్రీరాం.

"రండి! ఇల్లు చూద్దురు గాని" అని పిలిచింది వైదేహి. శ్రీధర్ శృంగార కథ చదవటం మొదలెట్టాడు.

"ఇది మాస్టర్ బెడ్రూం" చూపించింది.

విశాలమైన బెడ్రూం.. లైట్ కలర్ కర్టెన్లు.. మధ్యలో పెద్ద డబుల్ కాట్ మంచం, మ్యాచింగ్ బెడ్‌షీట్స్.. మంచానికి ఎదురుగా నిలువెత్తు అద్దం. రెండు కార్నర్స్‌లో రెండు ఇటాలియన్ శిల్పాలు. కిటికీ పక్కన ఇండోర్ ప్లాంట్స్. చిన్న బుక్ ర్యాక్. దానికెదురుగా సోఫాసెట్.... టీపాయ్... గోడలకి శృంగార భంగిమల బాపు పెయింటింగ్స్ ఓ వాల్ హ్యాంగింగ్ మీద... "పడక గది ప్రణయ వైద్యశాల. అతడు ఆమెకి వ్యక్తిగత వైద్యుడు. ఆమె అతనికి ఆత్మీయ వైద్యురాలు" అని రాసుంది.

## ప్రేమలో పడిన మహేష్ హీరోయిన్

మహేష్‌బాబుతో 'నేనొక్కడినే' సినిమాలో నటించిన కృతి సనన్ బాలీవుడ్‌లో ఓ యంగ్ హీరోతో పీకల్లోతు ప్రేమలో పడిందట! సుశాంత్ రాజ్‌పుత్ అనే హీరోతో కలిసి కృతి ఓ సినిమాలో నటిస్తోంది. వీరి రిలేషన్ షిప్ సినిమా వరకూ పరిమితం కాకుండా బయట కూడా నడుస్తోందట! ఇద్దరూ కలిసి పార్టీలకు, పబ్‌లకు తెగ తిరుగుతున్నారట! ఈ వార్తలను విని కూడా కృతి ఏమాత్రం స్పందించక పోవడంతో ఆమె ప్రేమ వ్యవహారం నిజమే నంటున్నారు బాలీవుడ్ జనాలు.



ఆశ్చర్యంగా, నిశితంగా చూస్తున్న శ్రీరాంకి ఎప్పుడో చదివిన వాత్సాయనం పుస్తకంలో వాత్సాయనుడు పడక గది అలంకరణకి పెట్టిన 'శయన రచనం' పేరు గుర్తొచ్చింది. ఇల్లంతాచూసి హాల్లోకి వచ్చేసరికి, శ్రీధర్ ఫోన్లో మాట్లాడు తున్నాడు.

"ఎలా ఉంది మా ఇల్లు" అంది వైదేహి.

"స్టార్ హోటల్లా ఉందాంటీ.. టూ గుడ్" అన్నాడు శ్రీరాం ఎగ్జయిటింగ్‌గా. శైలజ నవ్వింది.

"మీరెళ్ళి స్నానం చేసి రండి. టిఫిన్ తిందాం" అంది వైదేహి.

ఇద్దరూ గదిలోకి లగేజీ తీసుకుని వెళ్ళారు.

●●●

నలుగురూ డైనింగ్ టేబుల్ ముందు కూచున్నారు. వేడి వేడి పొంగల్, వడ, చట్నీ, సాంబారు, కేరట్ హల్వా...

"ఆంటీ! ఇవన్నీ ఎప్పుడు చేశారు?"

"ఇద్దరం కలిసి చేశాం!"

"అంకుల్ వంట చేస్తారా?"

"ఆంటీకి అన్నీ అందిస్తుంటాను" అన్నాడు శ్రీధర్.

"వావ్! పొంగల్ వడ సూపర్బ్ ఆంటీ!" నాకు చాలా ఇష్టం" చెప్పాడు శ్రీరాం.

"శైలజా! వచ్చిన దగ్గర్నుంచీ చూస్తున్నాను. నువ్వు ఒక్క మాట కూడా మాట్లాడటం లేదు. షై టైపా! లేక కొత్తా! ఆఫీసులో కూడా ఇంతేనా? శ్రీరాంని అప్పుడప్పుడు చూశాం గానీ... మీ నాన్న నిన్ను చూసే అవకాశం కల్పించలేదు. ఫీల్ ఫ్రీ... దిసీజ్ యువర్ హౌస్..." అన్నాడు శ్రీధర్.

"అలా ఏం లేదంకుల్" అంది నవ్వుతూ శైలజ.

"కోకిల స్వరం విప్పింది. క్లాప్స్ ప్లీజ్" అన్నాడు శ్రీధర్. అతనికి తోడు శ్రీరాం, వైదేహి జత కలిశారు.

"ఆ రోజుల్లో ఆంటీ మెడలో మూడు ముళ్ళేసిన మరుక్షణం మొదలెట్టిన ముద్దుముచ్చట్లు... ఈ రోజు వరకు నాన్‌స్టాప్‌గా... ఇన్నేళ్ళయినా బోరు కొట్టకుండా కొనసాగుతూనే ఉన్నాయి.." అని కరెక్టేనా అన్నట్టు భార్యవైపు చూశాడు శ్రీధర్.

"అవును. మా ఇద్దర్నీ చూసి... బంధువులంతా వీళ్ళిద్దర్నీ తిండీ తిప్పలు లేని అండమాన్ దీవిలో వదిలేసినా మాటలతోనే పూటలు గడిపేస్తారు. మేడ్‌ఫర్ ఈచ్ అదర్.. ఎవర్ గ్రీన్ రొమాంటిక్ కపుల్" అని కుళ్ళుకునే వాళ్ళు. బట్ ఉయ్ ఆర్ మేడ్ ఫర్ ఈచ్చదర్" అంది వైదేహి అదోలా.

"కరెక్ట్.. మేం ఒకట్రొండు రోజులు దూరంగా ఉండాల్సొచ్చినా... మా మనసులు ఒకరితో ఒకరు మాట్లాడుతూనే ఉంటాయి. ఆయా సమయాల్లో ఎవరేం చేస్తామో తెల్సు కాబట్టి... మనసంతా ఆ మధురోహల్ని అనుభవిస్తుంటుంది" అన్నాడు ఆమె మాటల్ని సపోర్టు చేస్తూ.

శ్రీరాం... "ఎక్సలెంట్" అన్నాడు ఎగ్జయిటవుతూ.

శైలజ మౌనంగానే ఆస్వాదించింది.

"ఏవోయ్... నేను, శైలజ మా ఆఫీసు వరకూ వెళ్ళొస్తాం. చిన్న పనుంది. నువ్వు శ్రీరాంతో కబుర్లు చెబుతూ లంచ్ ప్రిపేర్ చెయ్యి" అన్నాడు.

"వెళ్తావా? శైలజా!" అంది వైదేహి.

"వెళ్తానాంటీ!" అని లేచింది రిలీఫ్ కావాలన్నట్టు.

●●●

శైలజని తీసుకుని కార్లో బయల్దేరాడు శ్రీధర్.

"ఊc చెప్పు శైలజా! హౌ ఈజ్ మ్యారీడ్ లైఫ్? కొత్తకొత్తగా ఉంటోంది కదా! శ్రీరాంతో ముందే పరిచయం ఉందా?"

"లేదంకుల్"

"ఎందుకు మౌనంగా ఉంటున్నావు. నువ్వు చాలా టాకేటివ్ అని మీ నాన్న చెబ్తుంటాడు".

"........ ............. ............"

"శ్రీరాంతో పెళ్ళి ఇష్టం లేదా?"

"అదేం లేదంకుల్"

"మరి నువ్వు పెళ్ళి చేసుకోగానే, నువ్వు

ప్రేమించిన చైతన్య సూసైడ్ చేసుకుంటాడని భయమా?"

అంతే! షాక్ కొట్టినట్టు చూసింది.

"నాకు మీనాన్న అంతా చెప్పాడు.." అని సెల్‌ఫోన్ తీసి "ఇదిగో! చైతన్య నీకు పంపిన బెదిరింపు మెసేజ్" అని ఫోనిచ్చాడు.

శైలజ చూస్తోంది... కాదు చదువుతోంది.

"శైలజా! నీ జ్ఞాపకాల దీపికల్లో నేనింకా బ్రతికే ఉన్నానా? ప్రేమ అనే రెండక్షరాల అణుబాంబు తయారీ కోసం నా హృదయాన్ని ప్రయోగశాలలా మార్చుకున్నావు. శోధించి, పరిశోధించి వెళ్తూవెళ్తూ... నా హృదయాన్ని హిరోషిమాలా మార్చేళ్ళావు. నా ప్రేమని భగ్నం చేసి, నీ ప్రేమ నగ్నం కాకూడదన్న స్వార్థంతో మనప్రేమని చంపేసి, ఆ సమాధిపై పుష్పగుచ్ఛాన్నుంచి వెళ్ళావు. థాంక్స్.. నువ్వు నన్నూ, నా ప్రేమనీ కాదనుకుని మరొకరితో తాళి కట్టించుకుని వెళ్ళిపోతుంటే, నేను.. నిన్నే తల్చుకుంటూ, కాలాన్ని వృథా చేసుకోలేను గదా! అందుకే... నీ మెళ్ళో మరో వ్యక్తి తాళికట్టే సమయంలో, నా మెడకి ఉరితాడు బిగించుకోవాలని నిర్ణయించుకున్నాను. నీకది శుభసమయం. నాకు అశుభ సమయం. ఇది బెదిరింపు కాదు. నిన్ను ప్రేమించిన నా బలహీనతకి తగిన శిక్ష. నువ్వు కలకాలం హాయిగా ఉండాలని కోరుకోనీ.. నీవాణ్ణి కాలేని.. చైతన్య".

చదివి, కన్నీళ్ళు తుడుచుకుంటూ ఫోన్ తిరిగిచ్చింది శైలజ.

"సారీ! శైలజా! ఆత్మహత్య చేసుకుంటానని నిన్ను బెదిరించిన చైతన్యని ఇప్పుడు చూడు. కొత్త గాళ్‌ఫ్రెండ్‌తో ఎలా కులుకుతున్నాడో..." అని పిక్స్ చూపించాడు.

అది చూసి షాకై "ఈ అమ్మాయి మా కొలీగ్ జెస్సిక. కేరళ అమ్మాయి. ఈ మధ్యనే జాయినైంది" అంది.

"అయినా ఇంతలో ఇవి... మీ దగ్గరకి...!" అందాశ్చర్యంగా.

"ఎలా! అంటావు. ఇది ఇంటర్నెట్ యుగం. ప్రపంచంలో ఏ మూల ఏం జరిగినా సెకన్లలో సెల్‌ఫోన్లలో హల్‌చల్ చేస్తున్నాయి".

"ఇడియట్" అంది ఆవేశంగా.




"కాబట్టే... నీలాంటి ఇన్నోసెంట్ అమ్మాయిల్ని ప్రేమ ట్రాప్‌లో పడేసి తిరిగినన్నాళ్ళు తిప్పుకుని, పెళ్ళి కాకముందే ముద్దు ముచ్చట్లు తీర్చుకుని వదిలించుకుంటున్నారు. ఒకవేళ పెళ్ళి చేసుకోవాల్సి వస్తే తల్లిదండ్రులు అంగీకరిస్తే సరే సరి. లేదంటే... నగానట్రలతో నీ లాంటి అమ్మాయిలు ఇల్లొదిలొచ్చి, రిస్కీ రిజిస్టర్ మ్యారేజెస్ చేసుకుంటున్నారు. రెండు, మూడు నెలలు మోజు తీరగానే, కట్నం, డబ్బు పేరుతో హింసించి వదిలించుకోజూస్తున్నారు. లేదంటే చంపేస్తున్నారు. తల్లిదండ్రుల కళ్ళు గప్పి, తెరచాటు ప్రేమలు సాగించే నీలాంటి అమ్మాయిలు... గెలుస్తామో, ఓడతామో తెలీని ప్రేమాట.. ఆడి, ఓడి... చివరిగా కన్నీళ్ళతో చరిత్రహీనుల్లా మిగిలిపోతున్నారు".

శైలజకి కన్నీళ్ళు ఆగటం లేదు.

"కానీ నీ జీవితం అలా కాకూడదని... మీ నాన్న నువ్వు ప్రేమలో పడ్డప్పట్నుంచీ, నీ ప్రవర్తనలో వచ్చిన మార్పు గమనించి, నీకు తెలియకుండా, నిన్ను ఫాలో అయ్యాడు. చైతన్య వివరాలన్నీ సేకరించాడు. నువ్వేమో అతని మోజులో పడి, ఆఖరికి తల్లిదండ్రుల్ని ఎదిరించి ఇంటి నుండి వెళ్ళిపోదామనుకుంటున్న సమయంలో కల్పించుకుని నిన్ను కట్టడి చేసి, నీ దృష్టిలో విలనయ్యాడు. మీ నాన్నకి ఆ తర్వాత ఏం చెయ్యాలో తెలీక మీ నాన్న బాల్య స్నేహితులమైన నాకు, కృష్ణారావుకి చెప్పాడు. అంతే నీ గురించి విన్న వెంటనే... 'ఒరేయ్, వెంకట్! నువ్వేం భయపడకురా! ఇదంతా ఇన్‌ఫాక్చుయేషన్. శైలజకి వేరెవర్నో ఎందుకురా చూడటం.. నా కొడుక్కి చేసుకుంటానన్నాడు కృష్ణారావు.. పెద్దమనసుతో..."

శైలజ ఏడుస్తూనే ఆశ్చర్యంగా శ్రీధర్ని చూసింది.

"ఇంతకీ నీకోసం చచ్చిపోతానన్న చైతన్యతో నీకు పెళ్ళి కుదిరిందని, నేను ఫోన్ చేసి చెప్పగానే.. ఏమన్నాడో నువ్వే విను" అని ఫోన్లో రికార్డు చేసిన చైతన్య మాటల్ని ఆన్ చేశాడు.

"అవునా! హ్హా... హ్హా... శైలజ పెళ్ళి చేసుకుంటోందా? సంతోషం. ఆ ముద్దపప్పుని ప్రేమలో పడెయ్యటానికి ఆర్నెల్లు పట్టింది. ఫిగర్ బాగుంది, నాల్రోజులు జల్సా చేద్దామనుకుంటే, ముట్టుకుంటే ముడుచుకుపోయే అత్తిపత్తిలా... "అన్నీ పెళ్ళయ్యాకే" అంటూ బుల్లెట్‌ప్రూఫ్ బట్టలేసుకొచ్చేది. అయినా ఆ అందాన్ని అనుభవించకుండా వదల్లేక 'లేచిపోయి పెళ్ళి చేసుకుందామని" చెప్పాను. ఒప్పుకుంది. కానీ లాస్ట్ మినిట్లో ఏమైందో, వస్తానన్న సమయానికి రాకుండా హ్యాండిచ్చింది. ఆఫీసుకు రావటం మానేసింది. ఆఖరి అస్త్రంగా 'సూసైడ్ చేసుకుంటానని' బెదిరిస్తూ మెసేజ్ పెట్టాను. దానికీ బదుల్లేదు. ఇట్సాల్ రైట్. ఆ పప్పుసుద్ద కోసం ప్రాణత్యాగం చేసేంత పిచ్చోణ్ణి కాదు. నా కోసం జెస్సిక పడి చస్తోంది. దాన్ని లైన్లో పెట్టాను. వాళ్ళ నాన్నకి కేరళలో రబ్బరు తోటలు, టీ ఎస్టేట్స్ ఉన్నాయి. అందుకే జెస్సికకి ఐ లవ్యూ చెప్పేశా!" అన్నాడు.

ఆ మాటలు విన్న శైలజ కళ్ళు ఇప్పుడు కన్నీళ్ళు కార్చడం లేదు.

"సారీ! అంకుల్.. క్యారెక్టర్ విషయంలో ఎంతో స్ట్రిక్టుగా ఉండే నేను.. అసలు ఈ చైతన్య ట్రాప్‌లో ఎలా పడ్డానో ఇప్పటికీ అర్థం కావటం లేదు. ఒకసారి ఆఫీసులో చైతన్య ఇచ్చిన ప్రెజెంటేషన్ బాగుండే సరికి బాగుందని అప్రీషియేట్ చేశాను. అంతే అప్పట్నుంచీ వెంటబడి" అంది తలొంచుకుని.

"చూశావుగా! అతని టాలెంటు.. యూజ్ అండ్ త్రో.. చూడమ్మా! పెళ్ళికి ముందు ప్రేమ తప్పనటం లేదు. కానీ ఎంతమంది సక్సెస్ అవుతున్నారు? పెళ్ళికి ముందు ప్రేమలో పడ్డ ఇద్దరికీ... మంచీ చెడు విలువలూ పద్ధతులూ కుటుంబం, సంప్రదాయం.. పెద్దవాళ్ళు కుదిర్చే పెళ్ళిలో ఉంటే, తల్లిదండ్రులు ఒప్పుకోకపోతే.. లేచిపోయి, మోసపోయి తిరిగొచ్చే యటం, లేక వాడితోనే బారంగా జీవించటం.. ఇవన్నీ పెళ్ళికి ముందు ఉండే ఆప్షన్లు. చైతన్యతో నువ్వెళ్ళి పోదామనుకున్న నీ ఛాయిస్‌కి మా మిత్రత్రయం కలిసి అడ్డుపడి.. శ్రీరాంతో నీ పెళ్ళికి శ్రీకారం చుట్టి, చైతన్య ప్రేమకి శుభం కార్డేశాం. శ్రీరాంకి ఈ విషయాలన్నీ తెల్సినా... నిన్ను అడగకపోవటం అతని సంస్కారం. నువ్వు తప్పు చెయ్యలేదన్న విషయం మా అందరికీ తెలుసు కాబట్టే ఈ పెళ్ళి జరిగింది. ఆ చైతన్య నిన్నేదో చేస్తాడన్న భయం లేదు, ఎందుకంటే నువ్వు నీ భర్తతో అమెరికా వెళ్ళబోతున్నావు. ఏవేవో ఊహించుకుంటూ అందమైన జీవితాన్ని ఆరంభంతోనే... వృథా చేసుకోవడానికి అలవాటు పడకు. దాంపత్య జీవితంలో ఒక్క క్షణాన్ని కోల్పోయినా తిరిగి రాదు. ఆల్ ద బెస్ట్" అని ఇంటికి తీసుకొచ్చాడు.

•••

ఆ రోజు రాత్రి మ్యారేజ్ ఫంక్షనుందని శ్రీధర్, వైదేహి వెళ్తూ, శ్రీరాం, శైలజలకి నచ్చిన మాస్టర్ బెడ్రూంలో శోభనం ఏర్పాటుచేసి.. ఇద్దర్నీ ఒంటరిగా వదిలెళ్ళారు. శ్రీరామ్ ఆ శయనమందిరంలోని శయన రచనని ఆస్వాదిస్తూ ఈ కథ మొదటి సీనులోని తన ప్రేమ సీక్వెన్స్ గురించి ఆలోచిస్తుంటే, గదిలోకొచ్చిన శైలజ... సమయం వృథా చెయ్యకుండా.. లైటార్పేసి... శ్రీరాం కల నిజం చేసేస్తోంది. వాళ్ళ మధ్య మనమెందుకండీ? కథై పోయింది. పేజీ తిప్పండి.

సెల్: 90307 07037




# అరమరికలు లేని ముఖాముఖీ

**ఒక్కోసారి భయం వేస్తుంది. ఆర్కే వేసే ప్రశ్నలకు అవతలి వ్యక్తి తిరగబడతాడేమోననే టెన్షన్ కలుగుతుంది. ఒక్కోసారి ఆ ఇంటర్వ్యూ క్రమంగా వాదనగా, ఘర్షణగా మారుతోందనే అనుమానం కలుగుతుంది. మరోసారి అది ముఖాముఖిలా కాక (పోలీసుల) విచారణలా కనిపిస్తుంది. అది చంద్రబాబు నాయుడు, కేసీఆర్‌లైనా సరే, ఎస్పీ బాల సుబ్రహ్మణ్యం, యండమూరి వీరేంద్రనాథ్ అయినా సరే! ఆయన ప్రశ్నలు సంధించడంలో అర్థం ఉంటుంది. సమాధానం సస్పెన్స్‌ను రేకెత్తిస్తుంది.**




**ఓపెన్ హార్ట్ విత్ ఆర్కే**
**వేమూరి రాధాకృష్ణ**

ప్రతులకు: సాహితీ ప్రచురణలు
29-13-53, కాళేశ్వరరావు రోడ్డు
సూర్యారావు పేట
విజయవాడ - 520 002
ఫోన్: 2436643
వెల: **150/-**
పేజీలు: **304**

ఉదాహరణకు..."మీరు ఎన్టీఆర్‌పై తిరుగుబాటు చేయడంపై ఇప్పటికీ ప్రజలకు కొన్ని అనుమానాలున్నాయి" అనేది ప్రశ్న... దానికి సమాధానం (సంజాయిషీ?) ఇచ్చేందుకు చంద్రబాబు కొద్దిగా తడబడి ఉంటారు. "మద్యం మానేసి ఎన్నాళ్లయింది? మానేయాలని ఎందుకు అనిపించింది?" అని ఆయన కేసీఆర్‌ను సూటిగా, మొహమాటం లేకుండా ప్రశ్నించడం ఎవరికైనా ఆశ్చర్యం కలిగిస్తుంది. ప్రముఖుల లోపాలను, బలహీనతలను, వారి జీవితాల్లోని వివాదాస్పద సంఘటనలను కూడా అన్యాపదేశంగా ప్రస్తావించడం ఆయన ముఖాముఖీలలో అంతర్లీనంగా కనిపించే అంశం. ముఖాముఖీ అనేది అవతలి వ్యక్తి మెప్పుకోలు కోసం కాదనేది ఆయన ఉద్దేశం. మోహన్‌బాబుతో ముఖాముఖీలో ఆయనే చెప్పారు.. ఓపెన్ హార్ట్ అంటే మనసు విప్పి మాట్లాడడం అని. ఆయన ఆ అర్థానికే ప్రతి ఇంటర్వ్యూలోనూ కట్టుబడి ఉన్నారు. అరమరికలు లేని ఇంటర్వ్యూలవి.

**సుమారు ఆరేళ్ల నుంచి ఏబీఎన్ ఛానల్‌లో వారం వారం ప్రసారమవుతున్న 'ఓపెన్ హార్ట్ విత్ ఆర్కే'కు అనూహ్యమైన వీక్షకాదరణ ఏర్పడిందంటే ఆషామాషీ కాదు. ఇంటర్వ్యూ చేస్తున్న వేమూరి రాధాకృష్ణ (ఆర్కే)కు ఒక బాణీ ఉంది.**

సుమారు ఆరేళ్ల నుంచి ఏబీఎన్ ఛానల్‌లో వారం వారం ప్రసారమవుతున్న 'ఓపెన్ హార్ట్ విత్ ఆర్కే'కు అనూహ్యమైన వీక్షకాదరణ ఏర్పడిందంటే ఆషామాషీ కాదు. ఇంటర్వ్యూ చేస్తున్న వేమూరి రాధాకృష్ణ (ఆర్కే)కు ఒక బాణీ ఉంది. ఒక పద్ధతి ఉంది. వ్యక్తి పరిచయం, బాల్యం, యౌవనం, జీవనయానం, కార్యరంగ ప్రవేశం, ప్రస్థానం, లక్ష్యం, మనోగతం,... ఇలా అన్ని దశలనూ ఆయన తన ప్రశ్నల ద్వారా స్పృశిస్తారు. అందుకు తగ్గ సమాధానాలు సూటి అయిన భాషలో, వ్యవహార శైలిలో నిర్భయంగా రాబడతారు. కాదేదీ ఆయన ఇంటర్వ్యూలకు అనర్హం. ఇంటర్వ్యూకు ఎంపిక ప్రముఖులలో అన్ని రంగాలవారూ ఉన్నారు. అన్ని వయసులవారూ ఉన్నారు. ఒకరు ఎక్కువ ఒకరు తక్కువ అనేమీ లేదు. ఇంటర్వ్యూల్లో కూడా ఇది బాగుంది, ఇది బాగా లేదని చెప్పలేం. ఆయన అన్ని రకాల వారితోనూ మాట్లాడిస్తారు. నవ్వుతూ నవ్వుతూనే జవాబులు చెప్పిస్తారు. అందుకు నటుడు మోహన్ బాబుతో ఇంటర్వ్యూ మంచి ఉదాహరణ. కమలహాసన్‌తో ఇంటర్వ్యూ చదివిన వారికి ఇంటర్వ్యూల్లో సహజత్వం కూడా కళ్లకు కడుతుంది. అలాగే, ఎస్పీ బాల సుబ్రహ్మణ్యంతో ఆయన చేసిన ముఖా ముఖీని చూసిన వారికి ఆయనలోని నిర్భీకత ఆశ్చర్యం కలిగిస్తుంది. "ఉన్నత దశకు వచ్చిన తరువాత కొందరిని మీరు ఎదగనివ్వలేదని ఆరోపణ" అంటూ సూటిగా ఎస్పీబీని అడగడం ఆర్కేకే చెల్లింది.

రాజకీయం, కళలు, సంగీతం, సినిమా, వ్యాపారం, సాంస్కృతికం, చరిత్ర, వైద్యం, ఆరోగ్యం, పాలనా రంగం, సాహిత్యం, క్రీడలు వగైరా రంగాలలో ఆయన స్పృశించని రంగం లేదు. సెన్సిటివ్ ప్రశ్నలు, అరమరికలు లేని ప్రశ్నలు అడగడం ఆయనకే చెల్లు. అవి ఇంటర్వ్యూలే అయినప్పటికీ కథల్లా చదివిస్తాయి. హిందీ, ఇంగ్లీషుల్లో ప్రభు చావ్లా, కరణ్ థాపర్, రాజ్‌దీప్ సర్దేశాయ్ వంటి అంతర్జాతీయ స్థాయి పాత్రికేయులు తప్ప దక్షిణాది భాషల్లో అందులోనూ తెలుగులో ఇంత ముక్కు సూటిగా, నిర్భయంగా టీవీ ఛానల్స్‌లో ఇంటర్వ్యూలు చేసే పాత్రికేయులు మరెవరూ లేరని చెప్పవచ్చు. జర్నలిజం విద్యార్థులకు ఉపయుక్తంగా ఉంటుందీ పుస్తకం. ఇందులో చరిత్ర ఉంది. సమాధానాలకు సమానంగా ప్రశ్నలకూ ప్రాధాన్యం ఉంది.

**-జి. రాజశుక**



# నిండు నూరేళ్ళు

-సింహప్రసాద్ సెల్: 98490 61668

(కొత్త సీరియల్ ప్రారంభం)

**టింగ్.**

**నా సెల్‌కి కొత్త మెస్సేజ్ వచ్చినట్టుంది.**

**లోపలా బయటా గాఢాంధకారం. లోకమంతా గాఢ సుషుప్తిలో జోగుతోంది. నన్ను మాత్రం నిద్రాదేవి కరుణించటం లేదు.**

**ఏదో అశాంతి. మరేదో అలజడి. మెదడు పొరల్లో కదుల్తోన్న అనీజీనెస్. శరీరంలోని అణువణువులోనూ ఏదో తెలీని ఆందోళన. మనస్సు రూపహీన భయంతో కలవరపడుతోంది!**

**జరగరానిదేదో జరగబోతున్నట్టుగా అన్పిస్తోంది! అదేమిటో ఎందుకో అంతుబట్టడం లేదు. కాని దాని తాలూకు ప్రకంపనలు నన్ను చుట్టుముట్టేసి ఉద్వేగ పరుస్తున్నాయి!**

నిద్రకు వెలియై అశాంతికి నిలయమై నే ఒంటరినై....

ఛా.. ఒంటరినేమిటి?

పక్కకి చూశాను. నా పక్కనే పక్కమీద హాయిగా నిద్ర పోతున్నాడు రాజేశ్వర్.

అతడు నా భర్త. ఏడు నెలల క్రితం నాతో కలిసి ఏడడుగులు నడిచిన వాడు. నా మెడలో తాళికట్టి తన దానిని చేసుకున్నవాడు, నావాడు!

అతడి పెదాల మీద సుతారంగా సితార మీటినట్లుగా కదిలింది చిరుదరహాసం. అదెంత స్వచ్ఛంగా పాల నురగలా ఉందీ!

బహుశా కమ్మని కలగంటూ ఉంటాడు. ఆ కలనిండా నేనే పరచుకుని ఉంటాను. అతడికి నేనంటే ఎంత ప్రేమో చెప్పలేను. ఎంత అపురూపంగా చూసుకుంటాడో కూడా చెప్పలేను. అనుక్షణం నన్నింకా ఇంకా ఆనందపర్చాలని ప్రయత్నిస్తుంటాడు.

నన్నే ప్రేమిస్తూ నా గురించే ఆలోచిస్తూ నన్నిష్టపడుతూ ప్రాణప్రదంగా చూసుకునే వ్యక్తి ఒకరున్నారన్న ఊహే ఎంత తృప్తిగా గర్వంగా ఉందీ!

భార్యాభర్తలు గంగాయమునల్లా కలిసిపోయి ఏకరూపులై సాగిపోవాలంటారు. ఇద్దరి ఆశలూ ఆకాంక్షలు చివరికి వ్యక్తిత్వాలు సైతం కలబోసుకుని

కొత్తరూపు సంతరించుకోవాలంటారు.

అలాగే ఉంటున్నాం. ఉన్నాం. కానీ ఇవాళ... ఈ నిశీథి సమయంలో అతడు వేరు, నేను వేరు అన్నట్టు... ఎవరి ఆలోచనలు వారివి, ఎవరి స్పందనలు వారివి, ఎవరి వ్యథ వారిది అన్నట్టుగా అతడు గురక పెడుతోంటే నేను కొడికళ్ళతో...!

ఉలిక్కిపడ్డాను. ఇవాళ నాకేమైంది. ఈ పిచ్చి పిచ్చి ఆలోచనలేంటి?

ఎన్నడూ లేని ఈ విచిత్ర స్థితి ఏంటి? ఎందు కొచ్చింది? నన్నెక్కడికి లాక్కుని పోబోతోంది?

ఊహించనిది ఊహకందనిది ఊహించరానిది జరగ బోతోందని నా సిక్త్స్ సెన్స్‌కి ఉప్పందిందా? అయితే.. అయితే అదేమిటి? ఎవరికి ఏం జరగబోతోంది?

చటుక్కున విహాన్ కళ్ళముందు కదిలాడు. గుండెల్లో మెదిలాడు.

పిల్ల తెమ్మెర వీచినట్టు, తొలకరి జల్లు కురిసి నట్టు, కోయిల కుహూనాదం వినిపించినట్టు, పిల్లన గ్రోవిలోంచి పాట జారినట్టు, ఇంద్రధనుస్సు రంగుల్తో హోలీ ఆడినట్టు, వెన్నెలవానలో సయ్యాటలాడి నట్టు, గోదావరి అలలపై తేలి ఆడినట్టు....!

ఓహ్! పరవశం! పరమానందం! పరమాద్భుత ఆనందానుభూతి!

తుళ్ళిపడ్డాను. ఒక చిన్నఊహకే నా మనశ్శరీ రాల్లో ఇంత ప్రతిస్పందనా? ఆనందకలవరమా?!

నా గుండెల మీద మంగళ సూత్రాల బరువున్నా సరే గుండెల్లో సన్నాయిరాగాల కచేరీయా! తొలిప్రేమలో ఆరాధన అధికంగా ఉండొచ్చు. అంకితభావం దాని స్వభావం కావొచ్చు. కానీ అదంతా మంగళస్నానంతో కడిగేసి పవిత్రురాలినై మెడలో మూడు ముళ్ళు వేయించుకున్నాక అలాంటి ఆలోచనలకు చోటివ్వడం అపవిత్రం! అపరాధం! పాపం!

తల విదిలించాను. ఎక్కడినుంచి ఎక్కడికి జారి పోతున్నానూ!

ఒక అశుభ భావన కలచి వేస్తోంటే, ఒక ఆందో ళనా శకలం భయపెడుతోంటే, ఒక భయం పగబట్టి తరుముతోంటే విహాన్‌ని గుర్తు చేసుకోవడం సబబా? సమంజసమా? క్షంతవ్యమా?



అవునూ - నా ఈ అవ్యక్త అభద్ర స్థితికీ, సెల్ కొచ్చిన కొత్త సందేశానికీ ఏదైనా సంబంధం ఉందా? లేకపోతే ఇంత రాత్రివేళ మెస్సేజ్ లెవరు పంపిస్తారు?

గబుక్కున లేచి అదురుతున్న గుండెల్తో మెస్సేజెస్ బాక్సులో కెళ్ళి ఆత్రంగా చూశాను.

'విజితా! అన్నివిధాలా పరాజితుడ్న య్యాను. లైఫ్‌లో ఘోరంగా ఓడిపోయాను. ఆత్మహత్య చేసుకుంటున్నాను. స్టిల్ ఐ లవ్యూ డియర్. నా బొందిలోంచి ప్రాణం ఎగిరిపోయే ఆఖరి క్షణం వరకూ నిన్ను ప్రేమిస్తూనే ఉంటాను. గుడ్ బై ఫరెవర్ - విహాన్".

వేయి పిడుగులు కురిశాయి! లక్ష సునామీలు ముంచెత్తాయి! కుప్పకూలిపోయాను!

నా నయనాల్లోంచి నయగారాల్లా దూకుతూ కన్నీళ్ళు!

నా లేత గుండెలోని సగం ముక్కని కోసి వేరు చేసినట్టు, నా కలల్ని చీల్చి యాసిడ్ కుమ్మ రించినట్టు, నా మధుర స్మృతుల్ని ఉక్కు బూట్లతో కసబిసా తొక్కేస్తున్నట్టు బాధ! వేదన! ఆక్రందన!

నా గుండెల్ని ఆక్రమించుకున్న ఆకాశ మంత దుఃఖాన్నీ నన్ను కకావికలం చేస్తోన్న దుఃఖోధృతినీ తట్టుకోలేక నోరు నొక్కుకుని బావురుమని ఏడుస్తూ పక్క గదిలోకి పరుగెత్తాను.

విహాన్! విహాన్! ఏమిటీ దారుణం! ఎందుకీ వైపరీత్యం? అసలు నీకు ఆ పాడు ఆలోచనెందుకొచ్చింది? అయ్యో! ఇక నాకెప్ప టికీ ఎప్పటికీ కనిపించవా? అర్ధాంతరంగా ఎవరికీ అందని, పిలిచినా వినిపించని సుదూర తీరాలకు వెళ్ళిపోతున్నావా?!

నో! నో! నేను వెళ్ళనివ్వను. నువ్వెళ్ళడానికి వీల్లేదు!

గదిలోకి పరుగెత్తి సెల్ తెచ్చి చకచకా నెంబర్లు డయల్ చేశాను.

రింగ్ వెళ్తోంది. సముద్రపు అలల్లా నా గుండెలు ఎగిసెగిసి పడుతున్నాయి. ముచ్చెమ టలు ధారలుగా కారిపోతున్నాయి. కళ్ళు అవిశ్రాంతంగా వర్షిస్తున్నాయి.

బాధ, దుఃఖం గుండె లోతుల్లోంచి తన్ను కుని బయటికి రావాలని విశ్వప్రయత్నం చేస్తున్నాయి.

కమాన్, కమాన్ విహాన్! ఫోన్ లిఫ్ట్ చెయ్! నేను విహాన్. నీ విజితని. ప్లీజ్ లిఫ్ట్ ద ఫోన్. ప్లీ..జ్!

కళ్ళల్లోంచి నీళ్ళు తప్ప నోట్లోంచి మాట రావట్లేదు. మళ్ళీ మళ్ళీ ప్రయత్నించింది నో

రెస్పాన్స్!

ఎందుకు ఎందుకు రిసీవ్ చేసుకోవట్లేదు! కొంపతీసి ఈసరికే అతడు ఆత్మహ...!

నో. అలా జరగడానికి వీల్లేదు. అతడు ఎట్టి పరిస్థితుల్లోనూ చనిపోకూడదు. బతకాలి. నా కోసం బతకాలి!

ఇప్పుడేవిటి? ఏం చేయడం? నేను పూణేలో. నువ్వు హైదరాబాదులో. నిన్ను రక్షించుకోవడం ఎలా విహాన్?

కన్నీరు వరదవుతోంది. మెదడు శూన్య మవుతోంది.

విహాన్! విహాన్! ఏవిటీ పరీక్ష? ఎందుకా ఘోర నిర్ణయం! నీకేం కాకూడదు. నీకేం కాదు. తిరుపతి వేంకటేశ్వరా! విజయవాడ కనకదుర్గా! యాదాద్రి లక్ష్మీ నరసింహా! భద్రాచల రామన్నా! విహాన్‌కేం కాకుండా చూడండి. దయ తలచండి. అతడు పది కాలాల పాటు చల్లగా ఉండేట్లు దీవించండి!

మెరుపులా మెరిసిందో ఆలోచన. ఉత్తర క్షణాన ప్రాంజలికి ఫోన్ చేశాను.

“అర్ధరాత్రి అంకాలమ్మ శివాలేంటే” ఆవులిస్తూ అడిగింది.

“నువ్వర్జంటుగా విహాన్ రూమ్‌కెళ్ళాలి...”

“ఇప్పుడా! నీకేమైనా మతిపోయిందా?”

“మతిపోయినా బాగుణ్ణు. అంతకంటే ఘోరం జరిగిపోతోంది. ప్లీజ్ ప్రాంజలీ. ఇంకేం చెప్పొద్దు. తక్షణం టాక్సీలో వెళ్ళు. హీఈజ్ ఇన్‌డేంజర్!” అరిచినట్టుగా చెప్పాను.

“డేంజర్?”

“యస్. సూసైడ్ చేసుకుంటున్నాడే!” బావురు మన్నాను.

“మై గాడ్! అది పాపమని చెప్పి నాలుగు చివాట్లెయ్యక పోయావా?”

“అయ్యో, నీకెలా చెప్పాలే. ఫోన్ లిఫ్ట్ చెయ్యట్లేదే..”

“మరి నీకెలా చెప్పాడు?”

“మెస్సేజ్ పెట్టాడు. కబుర్లతో కాలయాపన చేయొద్దు. ప్లీజ్ ప్రాంజలీ. నువ్వే విహాన్‌ని రక్షించగలవు. ప్రతీ క్షణం ఎంతో విలువైందే. ఆలస్యం చేసే కొద్దీ అతడు మృత్యువుకు దగ్గరై పోతాడే. ఇంకేమీ ఏమీ ఆలోచించవద్దు. వెంటనే బయల్దేరు...”

“నాకంతా కన్ఫ్యూజన్‌గా భయంగా ఉందే. ఈ మిడ్‌నైట్‌లో కూకట్‌పల్లి వెళ్ళి అతడి రూం పట్టుకుని బలవంతాన తలుపులు తెరిచి.. సాధ్యం కాదు విజితా. బీ ప్రాక్టికల్. ఇంకేదైనా దారి దొరుకుద్దేమో చూద్దాం..’

“నాకేం తోచటం లేదు. కాళ్ళూ చేతులూ ఆడటం లేదు. ఎలాగైనా సరే అతన్ని అడ్డుకోవాలి. ఆ దగ్గర్లో ఎవరైనా ఫ్రెండ్స్ ఉంటే వాళ్ళకి చెప్పు. హెల్ప్ చెయ్యమని అర్థించు. మనం అర్జెంటుగా యాక్ట్ చేయాలి. మీనమేషాలు లెక్కపెడుతూ కూర్చుంటే బంగారం లాంటి బతుకు మట్టిపాలైపోతుందే...!” బావురుమన్నాను.

“నేను ట్రై చేస్తాను. నామీదే భరోసా పెట్టుకోకు. ఇంకేదైనా మార్గం ఉందేమో వెతుకు...”

ఆఖరి ఆధారమూ కోల్పోయినట్టు కూలబడ్డాను. ప్రాణ స్నేహితురాలే చేతులెత్తేస్తే ఇంకెవరు చేదోడొస్తారు? చేయి అందించి విహాన్‌ని ఆదుకుంటారు?

నా తల ముక్కలూ చెక్కలూ అయిపోతోంది. ఆలోచనలకు అడ్డం పడుతూ కన్నీటి వాన ఒకటి.

ఇలాంటి ఆపత్సమయాల్లో ఆదుకోగల ఆపద్బాంధువు లెవరు? పోలీసులు గుర్తొచ్చారు.

ప్రాణం లేచొచ్చింది. హైదరాబాద్ పోలీస్ కంట్రోల్ రూంకి ఫోన్ చేశాను.

“హలో.. మీ పేరు?”

“ఆ వివరాలన్నీ తీరిగ్గా చెబుతాను. ఒక ప్రాణం డేంజర్ జోన్లో ఉంది. మీరు తక్షణం వెళ్ళి అతణ్ణి కాపాడాలి”

“తప్పకుండా కాపాడతాం. కాని ముందు మీ పేరు, ఫోన్ నెంబరు చెప్పండి’

గబగబా ఇచ్చి అన్నాను. “అతడి పేరు నోట్ చేసుకోండి. పేరు విహాన్. కూకట్‌పల్లి హౌసింగ్ బోర్డు, బృందావన్ ఎపార్టుమెంట్సులో ఉంటాడు. నెంబర్ 302. అతడి ఫోన్ నెంబర్... లిఫ్ట్ చెయ్యట్లేదు...

“అతడికేవయింది?”

“ఆత్మహత్య చేసుకోబోతున్నాడు”

“మీకు చెప్పాడా?”

“అవునూ అవునూ అవును. మీరు తొందరగా వెళ్ళి విహాన్‌ని రక్షించండి మహాప్రభో..”

“ఎప్పుడు ఎక్కడ చేసుకోబోతున్నాడు?”

“అదేం తెలీదు. ముందు ఆ ఏరియా పోలీసుల్ని అలర్ట్ చెయ్యండి ప్లీజ్..




**ఈ మధ్యే పెళ్ళయిందామెకు. పూణెలో కాపురం. అర్ధరాత్రి సెల్ ఫోన్ మెస్సేజ్ ఆమెలో ఆందోళన రేకెత్తించింది. అతన్ని ఆత్మహత్యనుంచి ఎలాగైనా కాపాడాలి. ఎలా? హైదరాబాద్‌లో వున్న అతన్ని కాపాడేందుకు చేసిన ప్రయత్నాలన్నీ విఫలమయ్యాయి. సేవ్ హిమ్ అని డైరెక్ట్‌గా భర్తని రిక్వెస్ట్ చేసింది. అతడు భృకుటి ముడిచాడు. ఆమె పట్టించుకోలేదు. ఆ చీకట్లో ఎయిర్‌పోర్ట్‌కు బయలుదేరింది. ఇంతకూ ఆమె అతన్ని కాపాడిందా? లేదా?**

“మీకేం అవుతాడు?”

‘క్షణకాలం తటపటాయించి చెప్పాను “స్నేహితుడు.. బెస్ట్ ఫ్రెండ్..”

ప్రతి అరగంటకీ అటు ప్రాంజలికీ ఇటు పోలీసులకీ ఫోన్ మీద ఫోన్ చేస్తూనే ఉన్నాను.

కంట్రోల్ రూంలో ప్రతిసారీ కొత్తవారు ఫోనెత్తడం, మళ్ళీ వివరాల్ని ఏకరువుపెట్టడం.. అట్నించి మాత్రం సమాధానం లేదు! రాలేదు!

ప్రాంజలి జెఎన్‌టీయూ దగ్గర ఉంటున్న ఇద్దరు ఫ్రెండ్స్‌కి ఫోన్ చేశాననీ ఒకరు ఊరెళ్ళారనీ మరొకరు ఫోన్ స్విచ్ఛాప్ చేశారనీ చెప్పి చేతులు దులిపేసుకుంది.

ఎలా? ఇంకెలా విహాన్‌ని రక్షించడం?

కళ్ళు కృష్ణా గోదావరులవుతున్నాయి. గుండెలు ఘూర్ణిల్లుతున్నాయి. మెదడు మొద్దుబారిపోతోంది. తనువు చిగురుటాకులా కంపిస్తోంది.

పిచ్చిగా నుదురు కొట్టుకుంటూ గదిలో కలియ తిరుగుతూ ఆందోళనతో ఊగిపోతోంటే “వాట్ హేపెన్డ్?’ అని వినిపించింది.

తటాలున తల తిప్పి చూశాను.

ఎదురుగా నా హబ్బీ రాజేశ్వర్!

●●●

లాగి విడిచిన బాణంలా ఒక్క ఉదుటున వెళ్ళి అతడ్ని వాటేసుకున్నాను. బావురుమన్నాను.

నా మీద అనునయంగా చేయివేసి కుదుపుతూ అడిగాడు “ఏయ్ విజ్జీ. ఏం జరిగింది? మీ మమ్మీ డాడీ అంతా ఓకేనా?”

అవునంటూ తలాడించి గబగబా కళ్ళు తుడుచుకున్నాను.

“రిలాక్స్ యార్. కొంప కొల్లేరైనట్టు ఇంతగా అప్‌సెట్ అవ్వాల్సిన పనేముంది!”

“విహాన్ ఈజ్ ఈన్ టెర్రిబుల్ డేంజర్. ప్లీజ్ డూ సమ్‌థింగ్ టు సేవ్‌హిమ్. నీ మేలు ఎప్పటికీ మరచిపోను. ఏదోటి అర్జంటుగా చెయ్యి రాజేశ్వర్” అతడి చేతులు పట్టుకుని ఊపేశాను.

“విహాన్?”

అతడి స్వరం మారింది. కళ్ళు సూదుల్లా పొడుస్తున్నాయి. ముఖం ఓ పెద్ద ప్రశ్నార్థకంగా మారిపోయింది.

తడబడ్డాను. నా ఆదుర్దాకి కళ్ళేలు బిగించాను. “ఆ... అహ... అదే... నా ఫ్రెండ్... తను సూసైడ్ చేసుకుంటున్నాడు” నా గొంతు పూడుకుపోయింది.

కన్నీళ్ళు ఉరికాయ్.

"నీకు ఫోన్ చేశాడా?" కరుకుగా వచ్చాయి మాటలు. ఇతడు నా రాజేశ్వరేనా?

"ఎస్సెమ్మెస్ ఇచ్చాడు.." సెల్‌ఫోన్లో మెస్సేజ్ చూపించబోయి, మధ్యలో విరమించాను.

అతడు మగాడు. ఆపైన నా మొగుడు!

"నీకే ఎందుకు పంపాడు?"

"ఆ సంగతి నాకెలా తెలుస్తుంది? అవన్నీ తర్వాత లాక్కోవచ్చు పీక్కోవచ్చుగాని ముందతణ్ని ఎలాగైనా సేవ్ చెయ్యి. అతడి ఎడ్రస్సు నాకు తెలుసు. నీ ఫ్రెండ్స్‌కి చెప్పి.."

అతడి చూపులు నన్ను నిలువునా కాలుస్తున్నాయి. అయినా లెక్కచేసే స్థితిలో లేను. అవతల ఓ ప్రాణం చావు బతుకుల మధ్య గల సన్నని గీత మీద తారట్లాడుతోంది!

అతడిలో నేనాశిస్తోన్న స్పందనలేదు. సీరియస్‌గా ఆలోచిస్తున్నాడు.

"మనం తీరిగ్గా ప్రోజ్ అండ్ కాన్ డిస్కస్ చేసుకుందాం. ముందతణ్ని రక్షించే మార్గం చూడు".

"మీ డాడీకి చెబుదాం. ఆయనకి పలుకుబడి ఉంది. కనెక్షన్లున్నాయి. ఏమైనా చెయ్యగల శక్తి సామర్థ్యాలున్నాయి. మందీ మార్బలం ఉంది.

"వద్దొద్దు. ఇంకెవరికైనా... బాగా నమ్మకస్థులకి.."

నుదురు ముడి వేసి నా వంక 'అదోలా' చూస్తూ అన్నాడు. "వాళ్ళు విహాన్ ఎవరని ప్రశ్నిస్తే ఏం చెప్పను?"

"ఏదోటి చెప్పి మ్యానేజ్ చెయ్... డోంట్‌వేస్ట్ వాల్యుబుల్ టైమ్... ప్రతీ క్షణం అమూల్యమైందే.."

అయిష్టంగానే అన్యమనస్కంగానే ఇద్దరు ముగ్గురికి చేశాడు. పెదవి విరిచాడు.

ఇక ఇలా లాభం లేదన్పించింది. ఇంకా తాత్సారం చెయ్యడంలో అర్థం లేదన్పించింది.

ఒక నిశ్చయానికొచ్చాను. "ఇక ఈ టెన్షన్ భరించడం నా వల్ల కాదు. ఇప్పుడే బయల్దేరి హైదరాబాద్ వెళ్తాను. సాధ్యమైనంత త్వరగా వెళ్ళాలి. ఏ ఫ్లయిట్‌కి దొరికితే దానికి టికెట్ బుక్ చెయ్".

నా వంక ఆశ్చర్యంగా చూశాడు. ఏదో చెప్పాలనుకున్నాడు. మరెంచేతో నోరు తెరవలేదు. మౌనంగా వెళ్లి ల్యాప్‌టాప్ తెరిచాడు.

విహాన్‌కేమీ కాకూడదని దేవదేవుణ్ణి పదేపదే ప్రార్థిస్తూనే మొక్కుతూనే నాలుగు డ్రెస్సులు సర్దుకుని రెడీ అయ్యాను.

"ఫ్లయిట్ ఏడు గంటలకి.."

చేష్టలు దక్కి చతికిలబడిపోయాను. "ఇంకా నాలుగ్గంటలు వెయిట్ చెయ్యాలి. అక్కడి పరిస్థితెలా ఉందో... దానికంటే ముందేమీ లేవా?"

"ఉంటే బుక్ చేసేవాణ్ణిగా!"

మరి బదులివ్వలేక పెదవి కొరుక్కుంటూ ఉండిపోయాను. విహాన్‌ని తలచుకుంటే చాలు కళ్ళు కన్నీటి కుండలవుతున్నాయి.

"ఆంటీకి అంకుల్‌కి ఫోన్ చేసి చెప్పు విజ్జీ".

"ఎందుకు?"

"ఇలా అర్జంటుగా బయలుదేరి హైదరాబాద్ వస్తున్నానని... ఎయిర్‌పోర్టుకి కారు పంపిస్తారు.."

నిస్త్రాణగా సోఫామీద వెనక్కి వాలి కళ్ళు మూసుకున్నాను.

## మరో ఖాన్ అవకాశం ఇచ్చేశాడు...



**సన్నీలియోన్** అదృష్టమే అదృష్టం అంటున్నారు బాలీవుడ్ జనాలు. ఆ మధ్య ఓ ఇంటర్వ్యూలో ఖాన్‌ల సినిమాల్లో చేయడం తనకోరిక అని చెప్పిందో లేదో షారూఖ్ ఖాన్ వెంటనే అవకాశం ఇచ్చాడు. ఇప్పుడు అమీర్ ఖాన్ తన తాజా సినిమాలో సన్నీతో ఓ పాట చేయించబోతున్నాడట! ఇక మిగిలింది కండలవీరుడు సల్మాన్‌ఖాన్ మాత్రమే! ఈ హీరో కూడా తన సినిమాలో చాన్స్ ఇస్తాడంటూ సన్నీ ధీమా వ్యక్తం చేస్తోంది. పోర్న్ స్టార్ అంటూ సన్నీని కొందరు హీరోయిన్లు విమర్శిస్తున్నా పట్టించుకోకుండా అవకాశాల మీద అవకాశాలు దక్కించుకోవడం ఆమె గుండె ధైర్యానికి నిదర్శనం అంటున్నారు బాలీవుడ్ జనాలు.

నా రాక గురించి వాళ్ళేమనుకుంటారో! ఏమంటారో! హౌ టు ఫేస్ దెమ్? నేను తప్పు చేస్తున్నానా? లేదు లేదు. ఇది నా ధర్మం. నేను నిర్వర్తించాల్సిందే.

అక్కడ నాన్న ఓ సీన్ క్రియేట్ చేస్తే?

చేస్తే చెయ్యనీ. ఐ డోంట్ కేర్. లెట్ దెమ్ గోటు హెల్!

"విజ్జీ! నువ్విప్పుడు ఫ్రీబర్డ్ కాదు. వివాహితవి. నాతో తప్ప విడిగా పక్కకి రెండడుగులు వెయ్యాలనుకున్నప్పుడు ఒకటికి రెండుసార్లు ఆలోచించాలి.."

చివ్వున తలెత్తి చూశాను. రాజేశ్వర్ గంభీరంగా ఉన్నాడు. నేను వెళ్ళటం అతడికి బొత్తిగా ఇష్టం లేదని తెలుస్తూనే ఉంది.

కాని.... విహాన్ గురించి తప్ప వేరే ఏమీ ఆలోచించలేని స్థితిలో ఉన్నాను. తర్వాతొచ్చే పరిణామాల గురించి పట్టించుకునే పరిస్థితిలో లేను!

ఏం జరిగితే అది జరగనీ. ముందు అర్జంటుగా వెళ్ళాలి.

నే వెళ్ళేదాకా... తెల్లారేదాకా - అతడుంటాడా లేక...!

మళ్ళీ అతడి నగుమోమును చూస్తానా లేక నిర్జీవ...!

ఆకృతిలేని భయాలు గుండె గదుల్లో నర్తిస్తోంటే తల అడ్డంగా ఊపుతూ ఏడ్చేశాను.

"అతడి కోసం మరీ ఇంతగా ఇదవ్వాలా? అసలు నీకేమవుతాడని?"

ఏం కాడని? మా మధ్య ఉన్నది నీటి మీది రాతలా చెరిగిపోవడానికి?

"అతడంటే నీకింకా సాఫ్ట్‌కార్నర్ ఉందన్న మాట...?" మొఖాన గంటు పెట్టుకుని తీవ్ర స్వరంతో అన్నాడు.

అమాంతం ఏదో తెలీని ఆవేశం ఆవహించింది. "యస్... హీ ఈజ్ మై డియరెస్ట్ ఫ్రెండ్. ఈ టైంలో అతడి పక్కన ఉండటం నా కర్తవ్యం...!" అరచినట్టుగా చెప్పాను.

ఖ్రమాన్పడి చూస్తుండిపోయాడు.

చకచకా క్యాబ్ బుక్‌చేసి సూట్‌కేస్ తీసుకుని ఇంట్లోంచి బయటికి నడిచాను.

రాజేశ్వర్‌కి నేనంటే కన్సర్న్ ఎక్కువ. ఎప్పుడూ ఒంటరిగా వెళ్ళనివ్వడు. అలాంటిదిప్పుడు చీకటి ఇంకా వీడకుండానే వెళ్తోంటే నా వెంట వచ్చే ప్రయత్నం చెయ్యలేదు. రాయిలా కూర్చుండిపోయాడు. ఎంతైనా అతడు మగాడే.

ఉక్రోషం తన్నుకొచ్చింది. ముక్కు ఎగరేస్తూ లిఫ్ట్ వచ్చేదాకా ఆగకుండా మెట్లమీంచి కిందికి దిగిపోయాను.

క్యాబ్‌కోసం నిరీక్షిస్తోంటే కారు తీసుకొచ్చాడు రాజేశ్వర్.

మౌనంగా ఎక్కి కూర్చున్నాను.

పోలీస్ కంట్రోల్ రూంకి ఫోన్ చేశాను. వాళ్ళేమీ కొత్త సమాచారం ఇవ్వలేకపోయారు. ప్రాంజలికి చేశాను.

"తెల్లవారుతోందే. ఇప్పుడైనా వెళ్ళవే. విహాన్ బతుకు తెల్లారకుండా వెళ్ళవే. ప్లీజ్... నాకోసం!"

"ఫ్రెషప్ అయి వెళ్తాను. అతడి రూంకి వెళ్ళగానే ఫోన్ చేస్తాను. నువ్వేం వర్రీకాకు.."

"చాలా ఒత్తిడి ఫీలవుతున్నాను. ఊహించడానికే భయమేస్తోంది. గుండెలు బద్ధలవుతాయేమో అన్పిస్తోంది".

"బాగా కావాల్సిన వాళ్ళ గురించి అధికారికంగా భయపడటం సహజం. వాటిల్లో ఎక్కువగా అనవసర భయాలే ఉంటాయి. ఏమీ జరగదు గాని ధైర్యంగా ఉండు".

"ఏం ధైర్యమో ఏం పాడో, ఆ మెస్సేజ్ చూసినప్పట్నుంచీ నేను అత్యంత బలహీనురాల్నైపోయాను. నేను నేను కాదేమో అన్నట్టు అయిపోయాను. ఇక ఉండలేక నేనూ బయల్దేరుతున్నాన్లే. నువ్వు తొందరగా వెళ్ళవే.."

"సరి సరే.."

ఎయిర్‌పోర్టులో కారాగింది.

సూట్‌కేసు తీసుకుని దిగాను. రాజేశ్వర్ నా ముందు కొచ్చి నిలబడ్డాడు.

మా మధ్య చల్లని మౌనం.

"త్రీ అవర్స్ వెయిట్ చెయ్యాలి..." మెల్లగా అన్నాడు.

తలాడించాను.

"విహాన్ ఆ అఘాయిత్యానికి పాల్పడకుండా ఉంటే బావుణ్ణు" ఓదార్పు నాశిస్తూ అన్నాను.

"సాధారణంగా ఆత్మహత్యలన్నీ క్షణికావేశంతో తీసుకునే నిర్ణయాలే. సెకండ్‌థాట్ వస్తే మాత్రం తప్పకుండా వెనక్కి లాగుతుంది. పునఃసమీక్ష మనిషి విజ్ఞతని తట్టిలేపుతుంది..."

"నీ నోటివాక్కు సత్యమై అతడు బ్రతికి ఉంటే

చాలు.."

"నీ నిస్వార్థ ప్రార్థన అతడికి రక్షా కవచమవుతుంది..."

"థాంక్యూ... బై రాజేశ్వర్..." కదలబోయాను.

"వన్‌మినిట్... ఎలా జరగాలని రాసుంటే అలా జరుగుతుంది. నువ్వు అతిగా ఆలోచించవద్దు. అతిగా రియాక్టవ్వొద్దు. సంయమనం కోల్పోవద్దు. ఆల్వేస్ కంట్రోల్ యువర్ సెల్ఫ్..." దగ్గరికొచ్చి భుజం తట్టాడు.

కళ్లల్లో కదిలిన కన్నీటి పొర కన్పించకుండా ముఖం తిప్పుకుని తలాడిస్తూ ఎయిర్‌పోర్టులోకి నడిచాను.

లోపలికెళ్తూనే ఓ పక్కకెళ్ళి విహాన్‌కి ఫోన్ చేశాను. అదే పరిస్థితి. రింగవుతోంది గాని రిసీవ్ చేసుకోవట్లేదు.

విహాన్ విహాన్! ప్లీజ్ నా కోసం ఒక్కసారి - ఒకే ఒక్కసారి కాల్ తీసుకో! నీకెంతైనా పుణ్యం ఉంటుంది ఒక్కసారి..!

ఏడుపు పొంగి వచ్చింది. కంట్రోల్ చెయ్యడం సాధ్యం కావట్లేదు.

సెక్యూరిటీ చెక్ ముగించుకుని గేటు దగ్గరి కెళ్ళాను.

కాలం కుంటుతూ నడుస్తోంది.

ఎవరి దగ్గర్నుంచీ ఎలాంటి ఫోనూ రాలేదు.




అవసరం నాది గనుక నేనే చేద్దామని సెల్ చేతుల్లోకి తీసుకున్నాను.

గాడ్! చార్జి పూర్తిగా అయిపోయింది.

చార్జర్ తేవడం మర్చిపోయాను.

ప్రపంచంతో నా సంబంధం తెగిపోయింది.

సెల్ విసిరికొట్టి కూలబడ్డాను.

నా ఉత్కంఠ భరిత నిరీక్షణకు ఎట్టకేలకు తెర పడింది.

విమానం టేకాఫ్ తీసుకుంది.

గాఢంగా నిట్టూర్చి రిలాక్సడ్‌గా కూర్చున్నాను.

మెల్లగా జ్ఞాపకాల దొంతర కదలింది.

నాకు తెలీకుండానే గతంలోకి జారుకున్నాను.

●●●

అవాళ నా ఇరవయ్యో పుట్టినరోజు.

అమ్మ గుడికి తీసుకెళ్ళి అభిషేకం చేయించింది. నాన్న కొత్త ఐటెన్ బహూకరించారు. నాకు ఆల్రెడీ కారు ఉంది. అయినా కొత్తది కొన్నారు. అది బూడిద రంగులో మెరిసిపోతూ ముద్దొస్తోంది. ఆనందపు అంచుల మీద తేలిపోయాను.

"థాంక్యూ డాడ్. అడక్కుండానే స్మార్ట్ కారు ఇచ్చారు.."

"నువ్వడిగితే కొండమీది కోతినే కాదు కొండని కూడా తీసుకొచ్చేస్తారు మీ డాడీ" అమ్మ నవ్వింది.

నాన్న గర్వంగా నవ్వారు. "నువ్వు రుద్రేశ్వర్రావు ది గ్రేట్ కూతురివి. గుర్తుంచుకో".

"నేనెందుకు మర్చిపోతాను?"

"జస్ట్ గుర్తుంచుకోమని గుర్తు చేస్తున్నా".

"మీ కూతురేమీ ఉడుకు రక్తం పనులు చెయ్యదు. మీరు పరువు ప్రతిష్ఠలకి ఎంత విలువిస్తారో విజ్జీకి బాగా తెలుసు. తెలివైన ఏ ఆడపిల్ల భోగభాగ్యాలు కాలదన్నుకోదు".

అమ్మ మాటలు చిత్రంగా తోచాయి.

"నా గురించి మీలో మీరు ఏదేదో చెప్పేసుకుంటున్నారేంటి?" అయోమయం మార్కు ముఖంతో అడిగాను.

"యూ ఆర్ గ్రోన్ అప్ నౌ" భుజం తట్టి వెళ్ళిపోయారు నాన్న.

"నిన్నటికీ ఇవాళ్టికీ నాకేమీ తేడా కన్పించటం లేదు. నీకేమైనా డిఫరెన్సు కన్పిస్తోందా వదినా" నవ్వుతూ చూస్తోన్న రాణి వదినని అడిగాను.

"నీలో వయసు రెపరెపలు కన్పిస్తున్నాయి. ప్రేమ రెక్కలు తగిలించుకుని ఎగిరి పోతావేమోనని మీ డాడీ ఇండైరెక్టుగా హెచ్చరిస్తున్నారు".

"నేను చస్తే అలాంటి పని చెయ్యను. మమ్మీ డాడీ ఓకే చేసిన అబ్బాయికే జై కొడతాను".

"ఇలా అన్నవాళ్ళు చాలా మంది దబ్బున ప్రేమలో పడ్డారు! మళ్ళీ లేవలేదు!" బిగ్గరగా నవ్వింది.

నేనూ శ్రుతి కలిపాను. "వాళ్ళు వేరు. నేను వేరు వదినా. కాలేజీలో ఎందరు నావెంట బడ్డారో, వాలెంటైన్స్ డే నాడు గులాబీలివ్వాలని ఎందరు ప్రయత్నించారో నీకు తెలీదు. అందర్నీ కంటి సైగతో అల్లంత దూరాన నిలబెట్టేశాను".

"ప్రేమదోమ ఎప్పుడు కుడుతుందో ఎవరూ చెప్పలేరు" కన్ను గీటింది నవ్వుతూనే.

నాకు రోషం పొడుచుకొచ్చింది. "ఈ విజిత డాడీ కూచి. డాడీకి నచ్చనిదేదీ చెయ్యను".

"అదీ చూద్దాం" భుజాలు ష్రగ్ చేసింది.

"ఏవిటి వదినా మరదళ్ళు వాదించుకుంటున్నారు" అంటూ వచ్చింది అమ్మ.

"ప్రేమపెళ్ళి మంచిదా పెద్దలు కుదిర్చిన పెళ్ళి మంచిదా అని డిస్కస్ చేస్తున్నాం ఆంటీ" నా వంక కొంటెగా చూస్తూ అంది వదిన.

"ఇందులో వాదించుకోవలసిందేముంది. ప్రేమ పెళ్ళిళ్ళలో ప్రేమ మాత్రమే ఉంటుంది. రెండో దాన్లో ఆస్తి, అంతస్తు, హోదా, పరువు, ప్రతిష్ఠ, వైభోగం అన్నీ ఉంటాయి".

"అదీ సంగతి. అర్థమైందిగా విజ్జీ..." గలగలా నవ్వింది వదిన.

"నీకంతా వేళాకోళమే!"

●●●

తెలిసిన, తెలియని ఆడా మగా స్నేహితులంతా ఫోన్, వాట్సప్, ఫేస్‌బుక్‌ల ద్వారా శుభాకాంక్షలు తెలిపారు.

"టూ ఈవెంట్స్... ఒకటి బర్త్‌డే. రెండు న్యూ కార్. పెద్ద లెవెల్లో ట్రీట్ ఇవ్వాల్సిందే" అంది ప్రాంజలి.

"రెస్టారెంట్‌కి బఫేలంచ్ కెళ్దామా? ఎప్పుడు ఎక్కడ అన్నది మీ చాయిస్‌కే వదిలేస్తున్నా".

రమ, సుధారాణి వంక చూసి కన్నుగీటి ఏదో సైగచేసి అంది. "పబ్‌ల గురించి వినటమే గాని ఎప్పుడూ చూళ్ళేదు. ఎంచక్కా పబ్‌లో ఇవ్వవే.

"అక్కడికెళ్తే తాగాలేమోనే" కంగారు పడింది సుధారాణి.

"అది మనిష్టం. అదిరే డాన్సులూ కదిలించే మ్యూజిక్కు కలర్‌ఫుల్ కాంతులూ - అబ్బో ఆ ప్రపంచమే వేరు. భలే మజా వస్తుందే" రమ అంది.

"మనల్ని మనం కాసేపు మరిచిపోవచ్చు. అన్ని ఇన్హిబిషన్స్‌నీ వదిలేసి మరో లోకంలో విహరించొచ్చు. హాయిగా ఫ్రీగా ఎలా కావాలనుకుంటే అలా ఎంజాయ్ చేయొచ్చు. మనలోపలి మనిషిని అద్దంలో కచ్చితంగా చూసుకోవచ్చు" నవ్వుతూ వివరించాను.

"అంతే కాదే. బిజినెస్ ఇండస్ట్రియలిస్ట్స్ ఫిల్మ్ ఇండస్ట్రియలిస్ట్‌లకు చెందిన వాళ్ళ వారసులు అక్కడికొస్తుంటారే. ఏమో ఏం చెబుతాం. ఒక్కవాలు చూపుతో మన పంట పండవచ్చు" ఆశ పెట్టింది ప్రాంజలి.

"నేనేం గేలం పట్టుకుని కూర్చోనక్కర్లేదు. ఎరగా మారాల్సిన ఖర్మాలేదు. మా డాడీ అన్నివిధాలా నాకు తగ్గవాణ్ణి తీసుకొస్తారు" కించిత్తు గర్వంగా అన్నాను.

"నీకేం తల్లీ, బంగారు చెంచా నోట్లో పెట్టుకుని పుట్టావ్. నీ సంగతి కాదు, మా గొడవ చెబుతున్నా".

ప్రాంజలి జవాబుకి సంతుష్టురాల్నయ్యాను. "మీకు లక్ కలిసి రావాలని కోరుకుంటున్నాను".

"పబ్ పార్టీకి ఓకే కదా?" రమ అడిగింది.

"ఓకేనే. బీ రెడీ బై ఎయిట్ పీఎమ్"

నా కొత్తకారులో బంజారాహిల్స్‌లోని పబ్‌కి తీసుకెళ్ళాను. అది ఖరీదైనదే అయినా డీసెంటుగా ఉంటుందనీ, ఎలాంటి ప్రోబ్లమ్సూ ఉండవనీ దాన్ని ఎంపిక చేశాను.

అదీగాక నాకు తెలిసిన పబ్ ఇదొక్కటే. మా నాన్న స్నేహితుడి కూతురు బర్త్‌డే బ్యాష్ ఇక్కడే ఇచ్చింది. అందుకే ఇక్కడికి వచ్చాను.

నేనేమో చుడీదార్లో ఉన్నాను గాని వాళ్ళు ముగ్గురూ ఒంపు సొంపులు ప్రస్ఫుటంగా కన్పించే టైట్సూ మిడీలు ధరించారు. సరికొత్త అనుభవం చవిచూడబోతున్నందుకు కాబోలు చాలా ఎక్సైట్ అవుతున్నాను.

పబ్‌లోకెళ్ళబోతోంటే చేయి పట్టుకుని లాగి ఒక నోటీసు చూపించింది ప్రాంజలి.

**(ఇంకావుంది)**






## కంటికి కాపలా విటమిన్-సి

విటమిన్ సి ఎముకల పటిష్టతకు అవసరం అనే విషయం తెలిసిందే! అయితే ఇది కంటి ఆరోగ్యాన్ని కాపాడడానికి దోహదం చేస్తుందని పరిశోధనల ద్వారా రుజువైంది. ప్రతిరోజూ ఆహారం ద్వారా విటమిన్ సి తీసుకునే వారిలో కంటికి సంబంధించిన సమస్యలు తగ్గుముఖం పట్టడాన్ని లండన్ యూనివర్సిటీ పరిశోధకులు గుర్తించారు. పది సంవత్సరాల పాటు సుమారు నాలుగు వందల మందిపై ఈ అధ్యయనం నిర్వహించారు. వీరిలో కొందరు ప్రతి రోజూ ఆహారంలో విటమిన్ సి తీసుకోగా, మరికొందరు తక్కువ మోతాదులో తీసుకున్నారు. కొన్నేళ్ళ తర్వాత వీరి కంటి చూపునూ, ఆరోగ్యాన్నీ పరిశీలించగా, విటమిన్ సి తీసుకున్న వారిలో కంటి చూపు, కంటి ఆరోగ్యం మెరుగుపడిన విషయాన్ని పరిశోధకులు గుర్తించారు. విటమిన్ సి తక్కువ తీసుకున్న వారిలో మాత్రం కంటికి సంబంధించి కొన్ని సమస్యలను వీరు గుర్తించారు. దీనిపై ఇంకా పరిశోధనలు నిర్వహిస్తున్నారు.



## లావైపోతారు జాగ్రత్త!

మధ్యాహ్న నిద్ర మంచిదే అని గతంలో పలు పరిశోధనల ద్వారా రుజువైంది. అయితే ఈ నిద్రకూ పరిమితి ఉందని అంతర్జాతీయ వైద్య పరిశోధకులు చెబుతున్నారు. మధ్యాహ్న సమయంలో అరగంటకు మించి నిద్రపోతే అనారోగ్యానికి ముప్పు పొంచి ఉన్నట్లే అని వీరు అంటున్నారు. అరగంటకు మించి నిద్రపోయే వారిలో ఊబకాయం, అధిక రక్తపోటు, గుండె జబ్బులు వచ్చే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయని హెచ్చరిస్తున్నారు. మధ్యాహ్న సమయంలో పది నుంచి పదిహేను నిమిషాలు నిద్రపోవడం అన్ని విధాల మంచిదని సూచిస్తున్నారు.

## హ్యాపీనెస్‌కీ ఓ లెక్కుంది!

ఆనందంగా ఉంటే ఎక్కువ కాలం జీవిస్తారన్నది అపోహ మాత్రమే అంటున్నారు బ్రిటన్ పరిశోధకులు. రకరకాల ఆరోగ్య సమస్యలు వ్యక్తుల ఆనందాన్ని హరిస్తాయని, వాటి కారణంగానే మరణం సంభవిస్తుందని వారు స్పష్టం చేస్తున్నారు. సుమారు మూడు వేల మంది మహిళలపై దీర్ఘకాలం పరిశోధనలు జరిపి, వ్యక్తులు అనారోగ్యానికి ఆర్థిక, సాంఘిక సమస్యలు కారణమవుతాయన్న విషయం వెల్లడించారు. ఆర్థిక, సాంఘిక సమస్యల వల్ల తలెత్తే ఒత్తిడి, ఆందోళన, డిప్రెషన్ వంటివి తీవ్ర అనారోగ్య సమస్యలకు దారితీస్తాయని బ్రిటన్ పరిశోధకులు చెబుతున్నారు. కొన్ని సార్లు మన జీవనశైలి కూడా అనారోగ్యానికీ తద్వారా మరణానికీ దారి తీయవచ్చని చెబుతున్నారు. అనారోగ్యానికి దారితీసే జీవనశైలిని అనుసరించేవారు ఎంత సంతోషంగా ఉన్నప్పటికీ వారి జీవితకాలం పెరగదన్న విషయాన్ని వీరు స్పష్టం చేస్తున్నారు. ధూమపానం, నిద్రలేమి తదితరాలు వ్యక్తుల మరణానికి పరోక్షంగా దోహదం చేస్తాయని చెబుతున్నారు.



## క్యాన్సర్‌ను అడ్డుకునే పుదీనా

ఆహారానికి సువాసన అందించే పుదీనా క్యాన్సర్ కణాల పెరుగుదలను అడ్డుకుంటుందని ఇటీవల నిర్వహించిన పరిశోధనల్లో వెల్లడైంది. పుదీనాలోని ఎల్ మెంథాల్ పదార్థం పెద్ద పేగుల్లో వచ్చే క్యాన్సర్ కణాలను సమర్థంగా అడ్డుకుని వాటిని నాశనం చేస్తుందని పరిశోధనలో వెల్లడైంది. పెద్ద పేగు క్యాన్సర్‌కు గురైన కొందరిని రెండు గ్రూపులుగా విభజించి ఒక గ్రూపు వారికి ప్రతిరోజు కొంత మోతాదులో పుదీనాను ఆహారపదార్థాల ద్వారా ఇచ్చారు. మరొక గ్రూపు వారికి పుదీనా ఇవ్వలేదు. కొన్ని రోజుల అనంతరం వీరి ఆరోగ్య పరిస్థితిని పరిశీలించారు. పుదీనా తీసుకున్న వారిలో క్యాన్సర్ క్రమేపీ తగ్గుముఖం పట్టగా పుదీనా తీసుకోని వారిలో ఈ మార్పు కనపడలేదు. దీనికి కారణం పుదీనాలోని ఎల్ మెంథాల్ అనే పదార్థమే అని పరిశోధకులు అంటున్నారు.



-అవినాష్

# సర్పభ్రాంతి

-కంఠంనేని స్వప్న

**"బ్లూజీన్స్... వైట్‌షర్ట్..." లానాడెల్ రే పాట మొదలయింది.**

**కొండాపూర్ గతుకుల రోడ్డు నుంచి అప్పుడే గచ్చిబౌలి మీద కొచ్చాను. ఈ కాస్త స్ట్రెచ్ మీద డ్రైవ్ రోజు మొత్తంలో నన్ను సంతోషపెట్టే వాటిలో ఒకటి.**

అప్పుడే వర్షం మొదలైంది. ఇంకా వర్షానికి కొట్టుకుపోని రోడ్లు, ప్రశాంతంగా కనబడుతున్న యూనివర్సిటీ, రోడ్డుకి రెండు వైపులా పచ్చటి చెట్లూ, వాటికి విరగబూసిన పూలు.. వాతావరణం ఆహ్లాదంగా ఉంది.

"బట్ యూ ఫిట్ మీ బెటర్... హిస్స్... దెన్‌మై ఫేవరేట్ స్వెటర్.. హిస్స్"

సీడీ పాడయిందా?

సీడీ బయటికి తీసి చున్నీతో తుడిచి మళ్ళీ పెట్టాను.

మొదటి నుంచీ మొదలైంది పాట.

కాస్త వర్షానికే రోడ్డు బ్లాక్ అయిపోవటం మొదలయింది.

ట్రాఫిక్ స్లోగా కదులుతోంది.

పక్క నుంచి బైకు వాడు సైడ్ మిర్రర్ కొట్టుకుంటూ దూసుకెళ్ళిపోయాడు. అది గిర్రున రెండు రౌండ్లు తిరిగి ఆగింది. మనుషులూ, కార్లూ అంతా తిరగబడి కన్పిస్తున్నారు. బైక్‌వాడిని శాపనార్థాలు పెట్టుకుంటూ మిర్రర్ సరి చేశాను.

ఇవాళ మీటింగ్ టైంకి చేరుకోలేను. చేయగలిగిందేమీ లేదు. హాయిగా వెనక్కు జారగిలబడి వాల్యూమ్ పెంచాను.

"లవ్ ఈజ్ మీన్... ఒఓ.."

"హిస్స్.."

"... అండ్ లవ్ హర్ట్స్... ఒఓ.."

"హిస్స్... హిస్స్"

ఏంటా శబ్దం?

సీడీ శబ్దంలా లేదే! పాము బుసలా ఉంది.

అదిరిపడ్డాను.

ఒకవేళ పాముగానీ దూరిందా కార్‌లోకి?

ఒళ్ళు జలదరించింది.

పక్కకి ఆపి చెక్ చేసుకునే అవకాశం లేదు.

బంపర్ టు బంపర్ ట్రాఫిక్.





కారు బద్దలు కొట్టుకుని బయటపడితే బాగుండుననిపించింది.

రేర్ వ్యూ మిర్రర్‌ని కొద్దిగా కిందకి వంచి వెనక సీట్‌లో చూశాను. ఖాళీగానే ఉంది. అనవసరంగా భయపడు తున్నాను.

కార్‌లోకి పామెలా వస్తుంది?

నవ్వొచ్చింది.

సీడీ ప్లేయర్ ఆఫ్ చేశాను.

చాలా నెమ్మదిగా కదులుతోంది ట్రాఫిక్.

ఆడవాళ్ళకి ఆడవాళ్ళే శత్రువులనేది ఎందుకో ఇలాంటప్పుడే అర్థమవుతుంది.

ముందు కార్ నడుపుతోందో అమ్మాయి. ఎలా చేస్తుందో కానీ చిన్నకార్‌తో రోడ్ మొత్తం బ్లాక్ చేస్తోంది. మిగతా మగవాళ్ళు చాకచక్యంగా తప్పించు కుని వెళ్ళిపోతున్నారు. నాలాగా వచ్చీరానివాళ్ళం బుక్ అవుతున్నాం.

ట్రాఫిక్ ఆగి కదిలిన ప్రతిసారీ ఆ అమ్మాయి కారు ముందు కెళ్ళకుండా వెనక్కి వస్తోంది. గజ గజ వణుకుతూ ఆ అమ్మాయి రెండు చేతులతో గేర్ వేయటానికి ట్రయ్ చేయటం కనబడుతూనే ఉంది. కాస్త బొద్దుగా ఉందేమో కార్ మొత్తం ఊగుతోంది.

ఒట్టిగానే ఇంత భయపడి ఛస్తోంది.

ఆమె కారులో పాముంటే....

మళ్ళీ ఆలోచనలు పాము వైపుకి డైవర్ట్ అయ్యాయి

సీట్ కింద నుంచి జర జర పాక్కుంటూ కాళ్ళ మీదకు వస్తుందేమో!

డ్రైవింగ్ సీట్‌కి చుట్టుకుని నా తల దగ్గర నుంచి కిందకు దిగుతుందా?

సీట్ కింద ముద్దలా ముడుచుకుని పడు కుందా?

సరిత, కేబీఆర్‌లో వాకింగ్‌కి వెళ్తే పాములు ఎగురుతూ బుసలుకొడుతూ కనబడ్డాయి అందొక సారి. అలా సడన్‌గా ఎగిరి మీద పడుతుందా?

నల్లగా ఉంటుందా? గోధుమ రంగని కథల్లో రాస్తారు. అలా ఉంటుందా? లేకపోతే ఆ మధ్య బొటానికల్ గార్డెన్స్ బయట రోడ్ మీదకి వచ్చిం దట తెల్లటి పాము. అదా? లేక ఇంకేదయినా ఎక్సా టికా రకమా?

దేవుడా! నేను చచ్చినా ఫర్వాలేదు కానీ పాముని చూడక ముందే పోయేలా చేయి.

కొద్ది కొద్దిగా ట్రాఫిక్ క్లియర్ అవుతోంది.

రేడియో ఆన్ చేశాను.

91.1 ఎఫ్.ఎమ్‌లో ఆర్.జే.శివ ప్రోగ్రామ్. ఏదో రెస్టారెంట్‌కి ఫోన్‌చేసి తులం హలీమ్ కావాలని వాళ్ళని ఆట పట్టిస్తున్నాడు.

నవ్వుకుంటూ గేర్ మార్చటానికి క్లచ్ మీద కాలు పెట్టాను.

అరికాలు మీద చల్లగా, మెత్తగా ఏదో స్పర్శ.

అప్పుడు అరిచాను గట్టిగా.

కారు రోడ్ పక్కకు దిగి ఆగి పోయింది. అదృష్టవశాత్తూ ఏ ఏక్సిడెంట్ కాలేదు. కారులో నుంచి దూకి కాళ్ళు పెట్టుకునే ప్రదేశంలో ఏద యినా ఉందేమోనని తొంగి చూస్తున్నా.

"ఓ మేడమ్, ఇక్కడ ఆగినందుకు ఫైన్‌కట్టాలి. లైసెన్స్ ఉందా?" పక్కనే నిలబడ్డాడు ట్రాఫిక్ కానిస్టేబుల్.

ఒక బక్రా దొరికినందుకు సంతోషంతో మెరు స్తున్నాయతని కళ్ళు.

"ఇక్కడెందుకు ఆపకూడదు? నో పార్కింగ్ బోర్డ్ లేదుగా?"

"బోర్డ్‌లేని ప్రతిచోట ఆపుతావా? లైసెన్స్ చూపించు" కోపంగా అన్నాడు.

**ఆమె ఒక ఐటీ ఉద్యోగి. పాటలు వింటూ కార్లో ఆఫీస్‌కి బయలుదేరింది. మధ్య మధ్యలో హిస్...హిస్...అంటూ ఏదో శబ్దం. అది సీడీ లోంచి వస్తోందా? లేక కార్లో పాము దూరిందా? ఆమెలో సన్నగా వణుకు ప్రారంభమైంది. ఆపకూడనిచోట ఆపినందుకు పోలీస్‌కు ఫైన్ కట్టింది. తోటి ఉద్యోగులు చెక్ చేసినాగానీ పాము జాడ కనిపించలేదు. పాము ఎక్కడ దాక్కుంది? ఆమెను కాటు వేసిందా? లేక అది సర్పభ్రాంతా?**

"టాఫీ స్టిక్కర్ చూడు" గర్వంగా చెప్పాను.

"లైసెన్సు చూపించమంటే కాఫీ అంటా వేంటి?" గొంతులో ఇరిటేషన్.

"కాఫీ కాదు. టాఫీ. టోటల్ అఫెన్స్ ఫ్రీ ఎంటిటీ స్టిక్కర్ ఉంది చూడు. ఇదుంటే రొటీన్ డాక్యుమెంట్స్ చెకప్‌కోసం అడక్కూడదు. మీ ట్రాఫిక్ డిపార్ట్‌మెంట్ వాళ్ళే డాక్యుమెంట్స్ అన్నీ చెక్‌చేశాక ఈ స్టిక్కర్ ఇస్తారు. సైబరాబాద్‌లో చాలా కంపెనీలకు మీ డిపార్ట్‌మెంట్‌తో టై అప్ ఉంటుంది" నాకు తెలిసిన పరిజ్ఞానం ప్రదర్శించాను.

"ఏమో నాకదంతా తెల్వదు. లైసెన్స్ చూపియ్" మళ్ళీ అదే టోన్.

చేసేదిలేక ల్యాప్‌టాప్ బ్యాగ్ జిప్ ఓపెన్‌చేసి పర్స్ బయటకు లాగాను, లైసెన్స్ కోసం.

లైసెన్స్ చూస్తూ అడిగాడు అక్కడెందుకాపానో.

"కార్‌లో పాము ఉందేమో అని డౌట్ వచ్చింది" భయంగా చెప్పాను.

"కార్‌లో పామెందుకు ఉంటది? ఉన్నా ఇందాక నువ్వరిచిన అరుపుకి గుండాగిపోయి చచ్చిఉంటది" వెటకారంగా అన్నాడు.

గుర్రుగా చూసి ఫైన్ కట్టాను.

లోపల కెక్కి డోర్ వేస్తుండగా అన్నాడు.

"సౌండ్ తగ్గించమ్మా. చుట్టుపక్కల ఏదయినా హాస్పిటల్ ఉంటే కనీసం పది మంది ఎగిరిపోయేవారు నీ అరుపుకి".

మొహం మాడ్చుకుని కార్ ముందుకు పోనిచ్చాను.

ఫోన్ మోగుతోంది.

"ఏమయింది, ఇంకా రాలేదే ఆఫీస్‌కి? మీటింగ్‌లో లేరని ఆక్షన్ ఐటమ్స్ అన్నీ మీకే అసైన్ చేశారు" అంటున్నాడు సుధీర్.

"దారిలో ఉన్నా. కార్‌లో పాములు ఉండే ఛాన్స్ ఉందా సుధీర్?"

"ఏమో సంధ్యా. తెలీదు. నాకయితే ఎప్పుడూ జరగలేదు. అయినా ఇటువంటి డౌట్సన్నీ మీకే ఎందుకొస్తాయి?" నవ్వుతున్నాడు.

"ఒక వేళ ఉంటే...?" అన్నాను.

"ఒక పని చేయండి"

చెవులు రిక్కించి వింటున్నాను.

"ముందు రేడియో ఆఫ్ చేయండి. నగీనాలో పాట గనక వాళ్ళు ప్లే చేస్తే డాన్స్ వేస్తుందేమో పాము లేచి నిలబడి" నవ్వాగట్లేదు అతనికి.

ఒళ్ళు మండింది. ఫోన్ పెట్టేశాను.

మళ్ళీ చేశాడు.

"ఫోన్ వైబ్రేట్ మోడ్‌లో ఉందేమో చూసుకోండి. లేకపోతే కాసేపయ్యాక అది రాటిల్ స్నేక్ అనుకుంటారు".

రెడ్‌సిగ్నల్...

మళ్ళీ కార్ ఆగింది.

టక టక కార్ తలుపు మీద శబ్దం.

ఉలిక్కిపడి తలెత్తి చూస్తే ఎరుపురంగు లంగా, పైన పొడుగాటి మురికిపట్టిన తెల్లటి షర్ట్. కళ్ళకు నల్ల కళ్ళజోడు. చేతిలో గుండ్రటి ట్రేతో ఏవో బొమ్మలు అమ్మే ఆమె.

వీళ్ళు చేసే బొమ్మలు చాలా సహజంగా ఉంటాయి.

ఏం అమ్ముతుందా అని కుతూహలంగా చూడబోయాను. ట్రేని ముందుకు జరిపింది. పాము బొమ్మలు అన్ని రంగుల్లో లుకలుక లాడుతూ ట్రేలో అటూ ఇటూ తిరుగు తున్నాయి.

ఏడుపొచ్చింది.

"పాము బొమ్మలెవరైనా కొంటారా? పిచ్చా? వెళ్ళిక్కడినుంచీ" అరిచినంత పనిచేశాను.

ఎదురుగా ఆఫీస్ బిల్డింగ్ కనబడుతోంది.

"హమ్మయ్య... ఇవాళ్టికి బ్రతికిపోయాను. ఇంటి కెళ్ళేప్పుడు సెక్యూరిటీ గార్డ్‌కి చెప్తే చెక్‌చేసి పెడతాడు కారు.

వెళ్ళగానే పనిలో పడి పోయాను.

లంచ్‌టైమ్‌లో కెఫెటేరియాలో మళ్ళీ అదే పొద్దున లేచేసరికి ఎవరూ మిగల్లేదు".

"అంతేకాదు. పాములు ఇళ్ళలోకి రావని కథలు చెప్తారు కానీ ఎన్ని నాగదేవత సినిమాల్లో అవి జరజర పాక్కుంటూ ఇళ్ళల్లో తిరగటం చూపించలేదు?"

"మొన్న ఫేస్‌బుక్‌లో ఐదు తలల స్నేక్ ఫోటో చూశారా?"

"అది ఫోటోషాప్ అబ్బా!"

ఆగకుండా పాముల గురించిన కథలు, వాటి పుట్టు పూర్వోత్తరాలపై డిస్కషన్ జరుగుతోంది. ఇవన్నీ వింటుంటే నాకు వీపు మీద ఏదో పాకినట్లని పిస్తోంది.

"నాకు పనుంది. తర్వాత మాట్లాడుదాం" అని తప్పుకున్నాను.

ఈవెనింగ్ ఇంటికెళ్ళేటప్పుడు పాము చర్చలో పాలు పంచుకున్న వాళ్ళందరూ వచ్చారు చెక్ చేయటానికి.

సెక్యూరిటీ అతనితో సీట్స్ మూయించి, తెరిపించి, మాట్స్ దులిపించాం. ఇంజన్ ఓపెన్ చేసి చూశాము.

ఎక్కడా ఏమీ లేదు.



## ఆ నిర్మాతకు కళ్ళు తిరిగాయట!

*ఎండలు ఎక్కువగా ఉన్నాయి కదా, ఆయనకి కళ్ళు తిరిగి ఉంటాయని అనుకుంటే పప్పులో కాలేసినట్టే! ఆయనకు కళ్ళు తిరిగింది ఎండ వలన కాదు. తమన్నా కారణంగా. 'బాహుబలి' తరువాత తమన్నా తన రెమ్యునరేషన్ బాగా పెంచేసింది. అయినా నిర్మాతలు అంత మొత్తం సమర్పించుకుంటున్నారు. తాజాగా 'ఊపిరి' సక్సెస్‌తో మరోసారి భారీగా రెమ్యునరేషన్ పెంచేసింది. ఈ విషయం తెలియక ఓ నిర్మాత ఆమెతో సినిమా చేద్దామని వెడితే తన రెమ్యునరేషన్ ఎంతో చెప్పింది. దాంతో ఆయనకి అక్కడికక్కడే కళ్ళు తిరిగినట్టయిందట! మనిషైతే పడిపోలేదుకానీ, అంత పనీ జరిగిందంటున్నారు సినీ జనాలు. ప్రస్తుతం తమన్నాతో సినిమా చేయాలంటే భారీ మొత్తం సమర్పించుకోవాలని అంటున్నారు.*

టాపిక్.

సంజీవ్ చెప్తున్నాడు. "యూకాన్ట్ టోటల్లీ రూల్ ఇట్ అవుట్. ఒకసారి నాకు దారిలో ఉండగా బాయ్‌నెట్‌లో స్నేక్ ఉందని తెలిసింది. అయినా నేను ధైర్యంగా అలాగే తీసుకెళ్ళా స్నేక్ చార్మర్ ఇంటివరకూ!"

వినే వాళ్ళుండాలే కానీ మన సాఫ్ట్‌వేర్ వాళ్ళు చెప్పినన్ని కథలు ఇంకెవరూ చెప్పలేరు. అనుమానంగా చూస్తూ అనుకున్నాను.

"మా పిన్ని చిన్నప్పుడు స్నానం చేస్తుంటే ఆవిడ మీద పొడల పాము పడిందట. అప్పటి నుంచీ ఆవిడకి ప్రతి పదిహేను రోజులకి ఒకసారి స్కిన్ మొత్తం ఊడిపోతుంది" అంది సుమ.

"జెన్నిఫర్ ఒకరోజు డ్రయివ్ చేస్తుంటే కార్ డోర్ మీదుగా స్టీరింగ్ వీల్ మీదకు పాకుతూ పాము కనబడిందట. స్పీడ్‌గా పక్కకు తిప్పబోయి పక్కన ఇంకో కార్‌ని గుద్దేసింది. రెండు నెలలు హాస్పిటలైజ్ అయింది" చెప్పింది విజయ.

"మొన్న పేపర్‌లో చదవలేదా? దిండులో ఉందట పాము. మొత్తం ఫ్యామిలీని కాటేసింది.

"సీడీ ప్రాబ్లమ్ అయ్యుంటుంది"

"లేదా డిస్కవరీలో ఏదో ప్రోగ్రామ్ చూసుంటారు. అదే మీ సబ్ కాన్షస్‌లో స్టోర్ అయి అలా అనిపించి ఉంటుంది" తేల్చేశారంతా.

"హమ్మయ్య.. పోన్లే... నా మీద ఎన్ని జోకులన్నా వేసుకోనీ. నా కార్‌లో పాము లేదు" టెన్షన్ అంతా పోయింది నాకు.

అందరికీ థాంక్స్ చెప్పి కార్ స్టార్ట్ చేశాను.

కార్ నెమ్మదిగా పోనిస్తున్నా.

పొద్దుటి నుంచీ నేను పడ్డ టెన్షన్, చేసిన హడావిడి గుర్తు చేసుకుని నాలో నేనే నవ్వు కున్నాను.

•••

లైసెన్స్ చూపించటానికి పర్స్‌కోసం బ్యాగ్ తెరిచి, సంధ్య ట్రాఫిక్ పోలీస్‌తో మాట్లాడుతున్నప్పుడు, లోపలకి దూరి వెచ్చగా పడుకున్న బూడిదరంగు పాము అప్పుడే ఒక కునుకు తీసి లేచింది.

మెల్లగా ఒళ్ళు విరుచుకుంటూ బ్యాగ్‌లో కదులుతోంది.

# నవమినాడు నైవేద్యాలు

# వంటలు

చైత్రశుద్ధ నవమినాడు ఆ శ్రీరాముడికి ఎంతో ప్రీతికరమైన వడపప్పు, పానకం నైవేద్యంగా సమర్పిస్తుంటారు. కాస్త వెరైటీగా ప్రయత్నిద్దామనుకునేవారు వీటిని కూడా ఆ శ్రీరాముడికి నైవేద్యంగా సమర్పించవచ్చు.

## సేవరీ వడపప్పు

**కావలసిన పదార్థాలు:** పెసరపప్పు - ఒక కప్పు, మిరపకాయ తరిగినది - 1, తురిమిన



కొబ్బరి - 2 టీస్పూన్లు, కొత్తిమీర తరిగినది - 1 టీస్పూన్, చిటికెడు ఉప్పు

**తయారీ విధానం:** పెసరపప్పుని గంట, రెండు గంటలపాటు నానబెట్టుకుని, శుభ్రంగా కడిగి వడగట్టాలి. నీరంతా పోయాక పెసర పప్పు ఒక బౌల్‌లోకి తీసుకుని, మిగిలిన పదార్థాలన్నీ ఒకదాని తరువాత మరొకటి కలుపు కోవాలి. ముందుగా ఆ శ్రీరాముడికి నైవేద్యంగా సమర్పించిన తరువాత తీరిగ్గా ఆరగించవచ్చు.

## ఫల పంచామృతం

**కావలసిన పదార్థాలు:** కమలాలు - 2, తర్బూజా ముక్కలు - ఒక కప్పు, ఖర్జూరాలు - 12, కిస్‌మిస్ -16, కొబ్బరికోరు - 5 స్పూన్లు, పెరుగు - 2 కప్పులు, పాలు - 2 కప్పులు, కొబ్బరినీళ్ళు - ఒక కాయలో ఉన్నంత, తేనె - 5 స్పూన్లు, పంచదార - 5 స్పూన్లు, ఉప్పు - అర స్పూను, అరటిపండ్లు - 2, మిరియాల పొడి - ఒక స్పూన్, పుచ్చకాయ ముక్కలు - ఒకకప్పు

**తయారీ విధానం:** కమలాపండ్ల తొనలు, తర్బూజా, అరటిపండ్లను ముక్కలు చేసుకోవాలి. ఈ ముక్కలన్నింటినీ ఓ పాత్రలో తీసుకుని



వాటిపై ఉప్పు, పంచదార, మిరియాలపొడి చల్లాలి. తర్వాత పాలు, కొబ్బరి నీళ్ళు, పెరుగు, తేనె ఒక దాని తర్వాత మరొకటి పోయాలి. అన్నింటినీ కలిపి అరగంట ఫ్రిజ్‌లో పెట్టాలి. నైవేద్యంగా పెట్టే ముందు ఖర్జూర ముక్కలు, కిస్‌మిస్, కొబ్బరికోరు పైన చల్లుకుంటే చాలు. ఎంతో రుచికరమైన పండ్ల పంచామృతం రెడీ.

## హయగ్రీవ

**కావలసిన పదార్థాలు:** శనగపప్పు - ఒక కప్పు, బెల్లం తురిమినది - 3 లేదా 4 కప్పులు, నెయ్యి - 4 టేబుల్ స్పూన్లు, యాలకుల పొడి - చిటికెడు, కుంకుమపువ్వు - చిటికెడు, జీడిపప్పు - 2 టేబుల్ స్పూన్లు, కిస్‌మిస్ - 2 టేబుల్ స్పూన్లు

**తయారీ విధానం:** పాన్‌లో ఒక స్పూన్



నెయ్యి వేసి శనగపప్పుని మంచి సువాసన వచ్చే వరకూ వేయించాలి. తరువాత కుక్కర్‌లో వేయించిన శనగపప్పును వేసి రెండు కప్పుల నీళ్ళు పోసి మూడు విజిల్స్ వచ్చేవరకూ ఉడికించుకోవాలి. శనగపప్పును ఉడికించగా మిగిలిన నీటిని తీసి పక్కన పెట్టుకోవాలి. తరువాత వేడి నీళ్ళలో బెల్లం కరిగించి, దానికి శనగపప్పు ఉడికించిన నీళ్ళను కూడా జతచేసి స్టవ్ మీద పెట్టుకుని లేతపాకం వచ్చేదాకా ఉడికించుకోవాలి. పాకం వచ్చాక, దానికి శనగపప్పు, కుంకుమపువ్వు జతచేసి మిశ్రమం దగ్గరపడేంతవరకూ కలుపుతూ ఉండాలి. యాలకుల పొడి, కొద్దిగా నెయ్యి మిశ్రమంపై వేసుకుని మరొక్కసారి కలుపుకుని దించేయాలి. ముందే నేతిలో వేయించి పెట్టుకున్న జీడిపప్పు, కిస్‌మిస్‌లతో గార్నిష్ చేసుకుని అందంగా అందాల రాముడికి నివేదించవచ్చు.

## పైనాపిల్ బాసుంది



**కావలసిన పదార్థాలు:** పైనాపిల్ ముక్కలు - అరకప్పు, పాలు - 3 కప్పులు, పంచదార - పావుకప్పు, యాలకుల పొడి - ఒక టీస్పూన్, కుంకుమపువ్వు - పావు టీ స్పూన్, జీడిపప్పు - పావుకప్పు, పిస్తాపప్పు - పావుకప్పు, నెయ్యి - కొద్దిగా

**తయారీ విధానం:** గిన్నెలో పాలు పోసి బాగా మరిగించాలి. సగం అయ్యాక చక్కెర, యాలకుల పొడి, కుంకుమ పువ్వు వేసి కలపాలి. సన్నని మంట మీద ఉంచి పైనాపిల్ ముక్కలు వేసి ఐదు నిమిషాల తర్వాత దించేయాలి. ఈ లోపు కడాయిలో నెయ్యి వేసి జీడిపప్పు, పిస్తాపప్పులను వేయించుకోవాలి. వీటిని పైనాపిల్ బాసుందిలో కలిపి ఫ్రిజ్‌లో పెట్టుకోవాలి. నైవేద్యంగా సమర్పించిన తర్వాత చల్లగా తాగితే వేసవిలో హాయిగా ఉంటుంది.

## స్వీట్‌కార్న్ కోసాంబరి

**కావలసిన పదార్థాలు:** ఉడికించిన స్వీట్ కార్న్ - అరకప్పు, కొబ్బరి తురుము - పావు కప్పు, క్యారెట్ తురుము - అరకప్పు, పచ్చి మామిడికాయ ముక్కలు - పావుకప్పు, నిమ్మకాయ - అర చెక్క, ఉప్పు - రుచికి సరిపడా



**తాలింపు కోసం:** నూనె - ఒక టీ స్పూన్, ఆవాలు - కొంచెం, ఇంగువ - చిటికెడు, పచ్చిమిర్చి- కొన్ని ముక్కలు

**తయారీ విధానం:** ఒక గిన్నెలో ఉడికించిన స్వీట్ కార్న్, కొబ్బరి తురుము, క్యారెట్ తురుము కలిపి పెట్టుకుని, దానికి నిమ్మరసం కలుపుకోవాలి. తరువాత బాణలిలో తాలింపు పెట్టుకుని స్వీట్‌కార్న్ మిశ్రమంలో కలపాలి. ఆఖరున ఉప్పు వేసి కలుపుకుని ఆ శ్రీరాముడికి నైవేద్యంగా సమర్పించవచ్చు. (ఉప్పు ముందే కలిపితే నీరంతా బయటికి వస్తుంది. కనుక ఉప్పు ఆఖరున జత చేసుకోవాలి.)




**మదగజనగరం ప్రధాన వీధుల్లో వీరధర్మ ఊరేగింపు నత్తనడకలా సాగుతోంది. వీరధర్మ కాళ్ళను దగ్గరగా బంధించిన గొలుసు అడుగులకు అడ్డం పడుతోంది. శిక్ష ఆలస్యమవుతుందన్న భయం పట్టుకుంది భటులకు. వాళ్ళ నాయకుడి ద్వారా సేనానికీ, అతని ద్వారా మహామంత్రికీ, మహామంత్రి ద్వారా మహారాజుకూ విషయం అందింది. వీరధర్మను రథం మీద నిలబెట్టి, బంధించి ఊరేగించడానికి అనుమతి లభించింది.**

రథం ముందు ఎత్తయిన ఏనుగు మీద ఒక పర్వతకాయుడు కూర్చున్నాడు. అతని ముందు పెద్ద భేరి ఉంది. మాటి మాటికీ దానిని మ్రోగిస్తూ అతను వీరధర్మ నేరాన్నీ, అతనికి మహారాజు విధించిన శిక్షనూ వివరిస్తూ, శిక్షా దృశ్యాన్ని పౌరులందరూ చూడాలని బెదిరింపుగా హెచ్చరిస్తూ చాటింపు వేస్తున్నాడు. జనం విరగబడి చూస్తున్నారు.

రథం మీద స్తంభంలా నిలబెట్టబడిన వీరధర్మ చెవులకు ఆ చాటింపు వినిపించడం లేదు. ఇళ్ళ అరుగుల మీద నుండీ, మేడల మీద నుండీ తనను విచిత్రంగా చూస్తున్న జనం అతనికి కనిపించడం లేదు. ఎడతెగని ఆలోచనలు అతని చెవులకూ, కళ్ళకూ విశ్రాంతిని ఇచ్చేశాయి.

తన కాళ్ళనూ, చేతులనూ బంధించిన ఆ గొలుసులను ఎవ్వరూ తెంచలేరు; తెంచరు! తను తెంచుకోలేడు. బలంగా, లావుగా ఉన్న ఆ లోహ శృంఖలాలను తెంపే శక్తి తనలో లేదు! తాను మహా భీమసేనుడు కాదు! బంధించిన కాళ్ళతో, అలాగే తనను నేలలో కట్రాటలా పాతుతారు. కాళ్ళు కదలవు; చేతులు కదలలేవు! మదపుటేనుగులు ఒక్కొక్కటిగా తన మీద... తన వంశానికి సంక్రమించిన శాపం తన విషయంలో నిజం కాబోతోందా? నలభై ఏళ్ళ జీవితం పాతికేళ్ళకే ముగిసిపోతున్నదా?

వీరధర్మకు తల్లి గుర్తొస్తోంది. తండ్రి గుర్తొస్తున్నాడు. గురువు కంఠీరవుడు, సనాతన మహర్షి; స్కందానందయోగి, చిరంతనయోగి గుర్తొస్తున్నారు. తరంగ...తరంగ...గుర్తొస్తోంది.

గర్తవాటికలో వృద్ధ దంపతులను తాను రక్షించాడు. మదగజనగర రాజవీధి గర్తవాటికలో తనను ఎవరు రక్షిస్తారు? అది ఆ వృద్ధ దంపతుల అదృష్టం. ఇది తన దురదృష్టం! గుండెలో హాలాహలం నింపుకున్న జీవంతకుడనే నరరూప రాక్షసుడి ఆజ్ఞను ధిక్కరించే వాడు ఇక్కడ లేడని తేలిపోయింది. అలాంటి వాడు ఉండి ఉంటే జీవంతకుడి ఆగడాలు సాగేవి కావు! అలసిపోయిన వీరధర్మ శరీరం బరువెక్కినట్టు అనిపిస్తోంది. ఆలోచనలతో బరువెక్కిన తల ముందుకు వాలిపోయింది.

•••

ముఖం మీద దెబ్బ పడినట్టనిపించి, వీరధర్మ ఉలిక్కి



పడి కళ్ళు తెరిచాడు. ఎందుకో తన శరీరం తన అదుపులో లేనట్టు అనిపిస్తోంది. ఒకసారి కళ్ళు మూసి, చూపులకు తెరలా అడ్డుపడుతున్న నీళ్ళను తొలగించి చూశాడు.

తనిప్పుడు రథం మీద లేడు! చాటింపు వేస్తున్న చప్పుళ్ళు లేవు! వీరధర్మ కాళ్ళ వైపు చూసుకున్నాడు. మోకాళ్ళ దాకా తన కాళ్ళు నేలలో దాక్కున్నాయి. తనను స్తంభంలా నాటేశారు! చాలా నీరసంగా ఉంది. కళ్ళు మళ్ళీ మూతలు పడుతున్నాయి.

"వాడి ముఖం మీద నీళ్ళు చల్లండి! నీళ్ళు తాగించండి!" ఎవరో కీచుగా ఆజ్ఞాపిస్తున్నారు. "వాడు స్పృహలో ఉండాలి. తనకు జరిగే శిక్షా కార్యక్రమాన్ని కళ్ళారా చూడాలి!" ఎవరో తన మీద నీళ్ళు దిమ్మరించారు. వీరధర్మ ఉక్కిరిబిక్కిరవుతూ తల విదిల్చాడు. రెండు చేతుల్తో ముఖం తుడుచుకోవాలనిపిస్తోంది. కానీ ఆ కోరిక తీరదు. తన చేతుల్ని వెనక్కి విరిచి కట్టేశారు. ఎవరో తన పెదాలకు ఏదో పాత్రను అందిస్తున్నారు...తనకు నీళ్ళు త్రాగించడానికా? వీరధర్మ నోరు తెరిచి, ఆత్రుతగా నీళ్ళు తాగసాగాడు.

కీచుగా ఎవరో చేస్తున్న అట్టహాసం అతని చెవులను తాకింది. దాహం తీరింది. ప్రాణం లేచి వచ్చింది. వీరధర్మ తల తిప్పి చూశాడు. కుడివైపున ఎత్తుగా ఉన్న కొయ్య వేదిక మీద ఆడంబరంగా వున్న పెద్ద ఆసనం మీద రాజు జీవంతకుడు ఠీవీగా కూర్చుని, తన వైపు వెటకారంగా చిరునవ్వు చిందిస్తున్నాడు. వీరధర్మకు అంతా అర్థమైపోయింది. తనిప్పుడు రాజవీధిలో ఉన్నాడు. ఏనుగులతో తొక్కించి హతమార్చే శిక్షను స్వయంగా చూసి, రాక్షసానందం అనుభవించడానికి రాజు స్వయంగా విచ్చేశాడు.

వీరధర్మ రాజవీధిని తేరిపార చూశాడు. చాలా విశాలంగా, చాలా పొడవుగా, తిన్నగా ఉన్న రాజవీధి ఇరువైపులా ప్రజలు కిటకిటలాడుతున్నారు. మేడలపైనా, మిద్దెలపైనా జనం క్రిక్కిరిసి ఉన్నారు! తనని నిస్సహాయుడిగా చేసి, శిక్ష వీక్షించబోతున్న జీవంతకుడిని వీరధర్మ ఓరగా చూశాడు.

తనిప్పుడు శౌర్య పరాక్రమాలూ, శక్తి సామర్థ్యాలూ పనిచేయని, ఉపయోగపడని దయనీయ స్థితిలో ఉన్నాడు. ఇది...ఇది...ఈ స్థితి అంతానికి ఆరంభమా? మృత్యువును జయించాలన్న ఆశతో గమ్యం తెలియని ప్రయాణం ప్రారంభించిన తనను చూసి మృత్యువు నవ్వుతోందా, ఇప్పుడు? తన తాత ముత్తాతలలాగే, తండ్రిలాగే-శాపగ్రస్తులై గతించిపోయిన వీరతిలక వంశ పురుషులలాగే-నాలుగు పదులు ఆయుర్ధాయంతో తృప్తి పడి, జీవించి ఉండాల్సిన తను దుస్సాహసం చేశాడా? ఏ విధంగా ఆసన్నమైనా సరే, మరణం నుండీ ఎవ్వరూ తప్పించుకోలేరు. ఎందరో వీరాధివీరులు మరణించారు! శూరాధిశూరులు మరణించారు. మహావీరులైన పంచపాండవులు మరణించారు! తనూ అంతేనా? చరిత్ర లెక్కలేనంత మంది వీరుల మరణాలను చూసింది! తన మరణాన్నీ చూస్తుంది.

ఉన్నట్టుండి చెవులు పగిలేలా మ్రోగిన కాహళధ్వని వీరధర్మ ఆలోచనా ప్రవాహానికి అడ్డు తగిలింది. ఆ కాహళధ్వని దేనికో సంకేతంలా ఉంది. రాజవీధి చివర నల్లటి మదించిన ఏనుగుల బృందం ప్రత్యక్షమైంది. విపరీతంగా బలిసిన ఏనుగుల శరీరాలు ఎండలో మెరుస్తున్నాయి. వీరధర్మ అప్రయత్నంగా లెక్కపెట్టాడు. ముందు వరుసలో పది మదగజాలున్నాయి. వాటి వెనుక చాలా వరుసలున్నాయి! ఒక్క బంధితుడిని చంపడానికి అన్ని ఏనుగులు కావాలా? ఒక్కటి చాలు! కానీ కానీ జీవంతకుడు పొందగోరుతున్నది రాక్షసానందం; పైశాచిక ఆనందం!

ఉన్నట్టుండి ఆకాశం బ్రద్దలయ్యేలా, దుందుభుల శబ్దాలు రాజ వీధిలో వ్యాపించాయి. మదగజాల మీద కూచున్న పర్వతకాయులు తమ ముందు ఉంచుకున్న ఢక్కలను ముంజేతుల పరిమాణంలో ఉన్న గుదియలతో లయబద్ధంగా మ్రోగిస్తున్నారు. దిక్కులు పిక్కటిల్లుతున్న ఆ శబ్దాలతో రాజవీధిలో వాతావరణం మారిపోయింది.

### జరిగిన కథ

వైశాలిక రాజ్య యోధుడు వీరధర్మ. రాజ పరివారం కుట్రవల్ల కన్నతల్లిని పోగొట్టుకుంటాడతడు. తిరిగి వారికి తగినశాస్తి చేస్తాడు. సంపూర్ణాయుస్సు సాధించే లక్ష్యంతో బయలుదేరతాడు. మార్గాంతరంలో ఎన్నో కష్టాలు, అనుభవాలు చవిచూస్తూ చివరకు శ్వేత మరాళ మార్గదర్శనంతో పర్వతశిఖరంపై వున్న తాపసి చిరంతనయోగిని ప్రసన్నం చేసుకుంటాడు. యోగి ద్వారా మరణ రహస్యం గ్రహించి పునరాలోచనలో పడతాడు. మదగజనగరంలో వృద్ధ దంపతుల కుమార్తెల్ని రాజు చెర నుండి విడిపించేందుకు పూనుకుంటాడు. రాజద్రోహనేరం కింద వీరధర్మకు మరణశిక్ష విధిస్తాడు రాజు.

ఆ తర్వాత....

తన శరీరం మీద స్వేదబిందువులు పొంగుతున్నట్టు గుర్తించాడు వీరధర్మ. తను భయపడుతున్నాడా కాదు; భయం కాదు, ఆపద సమయంలో సాగే శారీరక ప్రతి చర్య. దానిని ఎవ్వరూ ఆపలేరు.

తన పాలిట మృత్యుదేవత పరివార రూపంలో భీకరాకారాలతో వస్తున్నాయి ఏనుగులు. లయబద్ధంగా వినిపిస్తున్న డక్కల మోతలు దగ్గరగా వస్తున్నాయి. జనం అరుస్తున్నారు. హర్షధ్వానాలా? వీరధర్మ కన్నతల్లిని స్మరించాడు. కన్నతండ్రిని స్మరించాడు. అపమృత్యువు నుండి తప్పించుకోడానికి తన తండ్రి జీవించినంత కాలమూ స్మరించిన మృత్యుంజయ మహా శివుణ్ణి స్మరించుకున్నాడు. వీరధర్మ విరక్తిగా చిరునవ్వు నవ్వుకున్నాడు. మరణించిన తల్లి దండ్రులు తన ప్రాణాలు రక్షించలేరు! నిత్యమూ ప్రార్థించిన తన తండ్రిని రక్షించని మృత్యుంజయ మహా శివుడు ఒక్కసారి కూడా ప్రార్థించని తనను రక్షించడు! మాతృదేవత, పితృదేవుడు, మహాదేవుడు-ఎవ్వరూ ఇప్పుడు తన మీదికి వస్తున్న నల్లటి పర్వతాల్లాంటి మదగజాలను ఆపలేరు!

ఏనుగుల ఊరేగింపు సమీపానికి వచ్చేసింది; ఆగింది. దుందుభుల మోత ఆగింది. ఒక్కొక్క మదగజమే వస్తూ తనను తొక్కుతూ వెళ్తుంది. నలభై మదపుటేనుగులా? వీరధర్మకు హఠాత్తుగా తరంగ గుర్తొచ్చింది. సరోవర తీరంలో పొదల చాటు నుండీ, అనాచ్ఛాదితగా పరుగెట్టిన తరంగ రూపం అతని మనో యవనిక మీద ప్రత్యక్షమైంది. ఆశ్రమంలో వివిధ సన్నివేశాలలో తనకు కనిపించిన తరంగ రూపాలు మూసిన కళ్ళ ముందు దూసుకెళ్తున్నాయి. తరంగ, ఆమె తల్లి, తండ్రి కనిపిస్తున్నారు. తన మనోనేత్రానికి కనిపిస్తున్న వాళ్ళందరికీ తను ఇక కనిపించడు! వీరధర్మ ఆలోచనను ప్రక్కకు తోసివేస్తూ తన మాతృమూర్తి కోసం సింహక్షీరం సాధించడానికి సనాతన యోగి అదిగో...ధ్యానం చేస్తున్నారు.

ఉన్నట్టుండి వీరధర్మలో ఏదో మెరుపు మెరిసింది. అతని మస్తిష్కం బ్రహ్మాండమైన ఆ మెరుపు వెలుగుతో నిండిపోయింది. అతని గుండె దడదడ కొట్టుకుంది. వీరధర్మ కళ్ళు తెరిచాడు. తనను నుజ్జు నుజ్జు చేయడానికి వస్తున్న మృత్యు స్వరూపాలు పది అడుగుల దూరంలో ఆగి ఉన్నాయి. కాహళం ధ్వనించింది. ముందు వరుసలోని చివరి మదగజం కదిలింది. దాని మెడలోని గంటలు యమధర్మరాజు మహిషం మెడలోని ఘంటికల్లా మ్రోగుతున్నాయి. మదగజాలను నియంత్రించే శక్తి కేవలం ఒక్క ప్రాణికే ఉంది. ఆ ప్రాణి; సింహం! ఔను..సింహం! సింహం! సింహం!

వీరధర్మ నిర్భయంగా, నిర్లక్ష్యంగా కళ్ళు మూసుకున్నాడు. అపూర్వమైన ఏకాగ్రత అతని సర్వస్వాన్నీ ఆవరించింది. సనాతన మహర్షి తనకు 'సింహగాయత్రి'ని ఉపదేశం చేస్తున్నాడు. ఆ ఉపదేశాన్ని వీరధర్మ అంతరంగం అందుకుంది.

"మహాసింహాయ విద్మహే!

కంఠీరవాయ ధీమహి!

తన్నో హర్యక్ష ప్రచోదయాత్!"

సర్వస్వాన్నీ విస్మరించిన వీరధర్మ మస్తిష్కంలో, హృదయంలో, రక్తంలో, అతని సర్వస్వంలో సింహగాయత్రి మహామంత్రం మహా ప్రణవ నాదంలా నినదిస్తోంది. భక్తి వీరధర్మ భావం అయింది. శ్రద్ధ అతని శ్వాస అయింది. విశ్వాసం అతని ఉనికిగా మారింది!

**వీరధర్మ కాళ్ళు బలమైన గొలుసులతో బంధించి పెడరెక్కలు విరిచికట్టి ఊరేగింపుగా తీసుకువెళ్ళారు. తలవరకు నేలలో పాతేసి కడసారి మంచినీరు తాగించారు. అతడిని కాళ్ళతో తొక్కి చంపేందుకు పర్వతాల్లాంటి మదగజాలు అతడికి పది అడుగుల దూరానికి చేరుకున్నాయి. తనను రక్షించేవారెవ్వరూ లేరు అనుకుంటూ మరణానికి సన్నద్ధమయ్యాడు వీరధర్మ. తల్లిదండ్రుల్ని స్మరించాడు. ఆ తర్వాత ఏం జరిగింది?**

సింహగాయత్రి మహామంత్ర దివ్య తరంగాలు అతన్ని కుదిపివేస్తున్నాయి. రాజవీధిని ఆవరించిన రణగొణ ధ్వనులు అతని చెవులను చేరడం లేదు. ధ్యానం వీరధర్మను కాల స్థల పరిమాణాలకు అతీతంగా తీసుకు వెళ్ళింది. ఉన్నట్టుండి ఏదో దివ్య సుగంధం అతని నాసికా పుటాలను స్పృశిస్తోంది. ఔను...అది ఆ దివ్య పరిమళమే. దివ్య లోకంలోని అద్భుత పుష్పాలన్నీ కలిసి, తమ సౌరభాలను మనోహరంగా సమ్మేళనం చేసి, వెదజల్లుతున్న మహాపరిమళం! ఆనాడు... ఆనాడు.. సింహక్షీరాన్ని నదీజలంలో అర్పించే ప్రయత్నం చేసిన నాడు తనను అలరించిన ఆనంద పరిమళం!

దివ్య సౌరభం తనను వినూత్న విధానంతో మేలుకొలుపుతున్నట్టుంది. నాసికను తాకుతున్న ఆ సుగంధం తన శరీరాన్ని లీలగా, సున్నితంగా పిల్లతెమ్మెరలా, ఏదో చిన్నారి పక్షి రెక్క విసిరిన గాలిలా తాకుతోంది. ఉదయం నుండీ తన శరీరాన్ని నలిపి వేస్తున్న భరించలేని బాధ, అలసట, నీరసం మాయమైపోతున్న అనుభూతి!

అలౌకికమైన సువాసన అది! ఆ సువాసన తనను కళ్ళు తెరవమని ఆదేశిస్తోంది! అంత సేపటి నుండీ వీరధర్మ అలసటను సూచిస్తూ బరువుగా మూతపడిన కనురెప్పలు తేలికగా, ఉత్సాహంగా విచ్చుకున్నాయి. విచ్చుకున్న కళ్ళు ఆశ్చర్య చూషకాల్లా విశాలంగా అయ్యాయి.

ఎదురుగా రాజవీధికి ఇరువైపులా ఉన్న మేడల కన్నా ఉన్నతంగా, ఆమె...ఆ దివ్యసుందర మూర్తి... గాలిలో నిలుచుని, తననే చూస్తోంది! ఆమె.. ఆమే! ఆ దేవతే! సుకృతీనదీ జలంలో తాను సింహక్షీరాన్ని సమర్పించబోయిన క్షణాల్లో తనకు దర్శనం అనుగ్రహించిన దేవత! అవే శ్వేత వస్త్రాలు! అదే ధగధగల కిరీటం! అవే దివ్యాభరణాలు! అవే రాగి రంగు శిరోజాలు! పగడాల పెద

## కావాలనే చేశాడట!



*బాలీవుడ్ హీరో ఇమ్రాన్ హష్మి పేరు చెప్పగానే సీరియల్ కిస్సర్ అనే నిక్‌నేమ్ టక్కున గుర్తుకొస్తుంది. క్రికెటర్ అజహరుద్దీన్ జీవిత కథ ఆధారంగా తీస్తున్న సినిమాలో ఇమ్రాన్ హీరో. ఇక అజర్ రెండో భార్యగా నర్గీస్ ఫక్రీ నటిస్తోంది. ఈ సినిమాలో ఓ పాటలో లిప్‌లాక్ కోసం ఇమ్రాన్ లెక్కలేనన్ని టేకులు తీసుకున్నాడట! ఒకానొక దశలో లిప్‌లాక్ అంటే విసుగొచ్చేసింది, ఇమ్రాన్ కావాలనే ఇన్ని టేకులు తీసుకున్నాడా? అనే అనుమానం కూడా వచ్చింది అంటూ చెబుతోంది నర్గీస్. నర్గీస్ మాటలు వింటూంటే 'పిల్లికి చెలగాటం... ఎలుకకి ప్రాణ సంకటం' అన్న సామెత గుర్తుకొస్తోందని సినీజనాలు అంటున్నారు.*

వుల మీద అదే సుందర మందహాసం! సూర్య చంద్రుల్లా వెలుగులు చిమ్ముతున్న విశాల విలోచనాలతో అదే శాంతి; అదే కాంతి! సందేహం లేదు... ఆ తల్లి మరెవరో కాదు; క్షీరదేవతే!

చేతులెత్తి నుదురుకు తాకించి, భక్తి పారవశ్యంతో ఆ తల్లికి నమస్కరించాలనిపిస్తోందతనికి. కానీ చేతులు సంకెళ్ళ ఆధీనంలో ఉన్నాయి. తన ఆధీనంలో లేవు! వీరధర్మలో మొలకెత్తిన సంకల్పాన్ని మించిన వేగంతో వెనక విరిచి కట్టబడిన అతని చేతులు, అతన్ని ఆశ్చర్య పరుస్తూ విడుదల పొందాయి! గర్తవాటికలో బంధించినప్పటి నుండీ తిమ్మిర్లెక్కిన చేతులు ఇప్పుడు తేలికగా, బలంగా ఉన్నాయి! వీరధర్మ చేతులు జోడించి, నుదురు మీద ఆన్చి నమస్కరించాడు. అతని పెదవులు భావోద్రేకంతో అదురుతూ కదిలాయి. "తల్లీ! తల్లీ! క్షీరమహాదేవతా! నమో నమః!"

"నాయనా, ధర్మా, నేను క్షీరదేవతను కాను.." గాలిలో నిలుచున్న దేవతామూర్తి నుండీ వీణా నాదంలా వాక్కు వెలువడి, వీరధర్మ చెవుల్ని అలరించింది. విచిత్రం! ఆమె పెదవులు కదలడం లేదు!

"తల్లీ!" వీరధర్మ ఆశ్చర్యంతో అన్నాడు.

"నేను సింహగాయత్రీదేవిని! నీ తల్లి చికిత్సకు ఉపయోగపడని క్షీరాన్ని నేలపాలు చేయకుండా భక్తితో నీకు లభించిన చోటికి తిరిగి తెచ్చావు. నదీజలంలో నిమజ్జనం చేయబోయావు! అది నీ చిత్తశుద్ధి. అది నచ్చినందుకే ఆనాడు నీకు దర్శనమిచ్చాను! ఈనాడు త్రికరణ శుద్ధిగా, విశుద్ధమైన ఏకాగ్రతతో, పదునెక్కిన భక్తితో, సంశయంలేని సద్బుద్ధితో నన్ను ధ్యానించావు. సాటి మానవుల ప్రాణాలు రక్షించిన నీ ప్రాణాలు రక్షించబడాలి. అది ధర్మం. రక్షకు శిక్ష అధర్మం. ఇది మానవ రాజ్యం కాదు. పిశాచ సామ్రాజ్యం. అందుకు కారణం రాజు జీవంతకుడు! వీడు ప్రజల పాలిట అంతకుడు! హంతకుడు! మదగజాలను బలంగా మలుచుకుని రాక్షస పాలన సాగిస్తున్నాడు! వాడినీ, వాడి మదగజబలాన్నీ నాశనం చేస్తాను. ఈ రాజ్యంలో పశువుల మందలాగా పుష్కలంగా ఉన్న గజసంతతి సుదూర అరణ్యాలకు పారిపోతాయి. బలహీనులను గజగర్త శిక్షతో మట్టుపెట్టడానికి యీ పాపిష్టిరాజు వినియోగిస్తున్న మత్తగజాలన్నీ ఇప్పుడే మట్టిపాలవుతాయి! ఈ సింహగాయత్రి విలయ విన్యాసాన్ని దర్శించు!"

సింహగాయత్రి దేవత పెదవులు కదపకుండా, వాక్కును ఉపయోగించకుండా తను వినగలిగేలా చెప్పిన మాటలు వీరధర్మ శరీరాన్ని గగుర్పాటుకు గురిచేశాయి. అతను అప్రయత్నంగా తనను మర్దించడానికి వచ్చిన మదగజాలను చూశాడు. చలనం లేని రాతి ఏనుగుల్లా ఉన్నాయవి. పౌరులూ అంతే! అందరూ ప్రాణాలతో ఉన్న విగ్రహాలే!

వీరధర్మ తలెత్తి, సింహగాయత్రి దేవత వైపు చూశాడు. ఉన్నట్టుండి, ఆకాశంలో మెరుపులు మెరుస్తూ మేఘాలను చీల్చాయి. ఉరుములతో నాలుగు దిక్కులూ దద్దరిల్లిపోయాయి. గాలిలో తేలియాడుతూ శ్వేతవస్త్రంలో వెలిగిపోతున్న దేవత-విశాల నేత్రాలు పసుపుపచ్చరంగులోకి మారిపోయాయి! శ్వేత వస్త్రాలు పసుపు, ఎరుపు రంగుల మిశ్రమ వర్ణంలోకి మారాయి. మెరుపులను ఆమె చూపులు ధిక్కరిస్తున్నట్టున్నాయి. ఉరుముల శబ్దాలను మింగివేస్తూ, మహా గర్జన భీకరంగా ధ్వనించింది! విచ్చుకున్న వీరధర్మ కళ్ళ ముందు అతను చూస్తుండగానే సింహగాయత్రి దేవత భయంకరమైన సింహంలా మారిపోయింది! అంత ఎత్తు నుండీ సింహం నేల మీదికి దూకింది!

అంతసేపూ సింహగాయత్రి దేవత మహిమతో మూగ ప్రతిమల్లా ఉన్న జనం ఒక్కసారిగా హాహాకారాలు చేయసాగారు! "సింహం!సింహం! సింహం!" ఎన్నో వందల, వేల కంఠాలు ఒక్కసారిగా అరుస్తున్నాయి. అంతసేపూ దేవత ఎవ్వరికీ కనిపించలేదు!

దివ్యహర్యక్షం ఏనుగుల వైపు తిరిగి, చెవులు పగిలేలా గర్జించింది. మదగజాలన్నీ ఒకేసారి

## మనమీదేనర్రోయ్!

సరసి





భయంతో ఘీంకారాలు చేశాయి. హర్యక్షదేవత ఏనుగుల మీదికి దూకలేదు, వాటి కుంభస్థలాలను ఛిద్రం చేయలేదు. అయితే మత్తగజాలు అన్నీ, ఒక్కసారిగా నేల మీద కుప్పకూలిపోయాయి. వాటి మీద కూర్చున్న పర్వతకాయులు వాటి శరీరాల క్రింద నలిగి, నుజ్జు నుజ్జు అయిపోయారు. మదగజాల నోళ్ళ నుంచీ రక్తం కాలువ కట్టింది. ఏనుగుల శవాలతో రాజవీధి నిండిపోయింది.

తలను అటూ యిటూ ఊపుతూ మహా సింహం గర్జిస్తూనే ఉంది. జనం అరుస్తున్నారు. కకావికలుగా పరిగెడుతున్నారు. సింహదేవత వేదిక మీద కూర్చుని, ఆశ్చర్య విగ్రహంలా, చలనం లేని రాతిబొమ్మలా ఉన్న జీవంతకుడి వైపు తిరిగింది. జీవంతకుడి శరీరం వశం తప్పి వణుకుతోంది!

భయానకంగా గర్జన చేసి, సింహదేవత ఒక్కసారిగా గాలిలోకి ఎగిరి, జీవంతకుడు ఆసీనుడై ఉన్న వేదిక మీదికి వాలింది. జీవంతకుడి




నోరు గుహలా తెరుచుకుంది. కళ్ళు అంతులేని భయంతో విచ్చుకున్నాయి. ఆసనం మీంచీ దిగి, పారిపోయే ప్రయత్నం చేశాడతను. అయితే గజ గజ వణికిపోతున్న స్తంభాల్లాంటి కాళ్ళు, అతన్ని మళ్ళీ ఆసనం మీద కూలవేశాయి.

సింహదేవత అతని వైపు లంఘించింది. రెప్పపాటులో జీవంతకుడి బలిసిన మెడ సింహం నోటిలో చిక్కుకుంది. అతని శరీరాన్ని గుడ్డ పీలికలా అటూ యిటూ దులుపుతూ మదపు టేనుగుల శవాల మధ్య లాక్కెళ్తోంది దివ్యసింహం! రాజవీధి ఇరువైపులా చలనం కోల్పోయి నిలుచుని ఉండిపోయిన పౌరులు భయభక్తులతో ఆశ్చర్యంతో చూస్తున్నారు.

దివ్యసింహం ఒక్కసారి తల విదిల్చింది. జూలు ఎర్రమేఘాల్లా స్పందించింది. జీవంతకుడి శరీరం గాలిలోకి ఎగిరి, వెంటనే క్రిందికి దూసుకు వచ్చింది. అతని పాలనలో ఎక్కువమందిని గజగర్త శిక్షతో అంతం చేసిన, అతనికి అతిప్రియమైన మదగజం 'గజసింహ' వైపు జీవంతకుడి శరీరం దిగి వస్తోంది. వెల్లకిలా పడి ప్రాణాలు కోల్పోయిన మత్తగజం గజసింహ పొడవాటి దంతం మీద పడి, దంతం అడుగుదాకా దిగిపోయింది. చచ్చిపోయిన జీవంతకుడి రక్తంతో, చచ్చిపోయిన 'గజసింహ' ఏనుగు దంతం ఎండలో ఎర్రగా మెరుస్తోంది.

•••

దివ్యసింహం ఒక్కసారిగా గాలిలోకి ఎగిరింది. సింహం రూపంలో ఉన్న అగ్నిలా గాలిలో తేలుతూ ప్రయాణం చేస్తున్న సింహాన్ని పౌరులు తలలు పైకెత్తి, చేతులు జోడించి చూస్తూ ఉండిపోయారు. అందరినీ ఆశ్చర్య పరుస్తూ సింహం నగరం చుట్టూ ప్రదక్షిణంగా తిరుగుతోంది. నగరంలో ఆవరించిన నిశ్శబ్దాన్ని మ్రింగివేస్తూ వెలి ప్రదేశాల నుండీ భీకరంగా ఏవో శబ్దాలు వినవస్తున్నాయి. ఏనుగుల ఘీంకారాలు!

వీరధర్మ ముఖం మీద చిరునవ్వు మెరిసింది. సింహగాయత్రి దేవత మదగజ రాజ్యంలోని గజ సంతతిని అరణ్యాల్లోకి వెళ్ళగొడుతోంది! ఘీంకార శబ్దాలు దూరంగా దూరంగా వెళ్తున్నాయి...

అప్పటిదాకా రాజవీధిని మారు మ్రోగించిన హాహాకారాలు ఇప్పుడు లేవు. హఠాత్తుగా ఆశ్చర్యం వీరధర్మ శరీరాన్ని జలదరింప చేసింది. తన కాళ్ళు-మోకాళ్ళ దాకా-ఇప్పుడు భూమిలో లేవు! తాను అందరిలాగే నేల మీద నిలుచున్నాడు! ఈ విచిత్రం ఎలా జరిగింది? వీరధర్మ చూపులను నేల మీద నుంచీ ఆకాశం వైపు సారించాడు. తూర్పు వైపున అగ్నిజ్వాలలా మెరుస్తోంది ఏదో! ఆ కాంతి ఏమిటో వీరధర్మకి తెలుసు. అతను రెప్పపాటు మరిచిపోయి చూస్తూ ఉండిపోయాడు. మంటలా ధగధగలాడుతున్న వెలుగు మాయమైంది. ఆ స్థానంలో మెరిసే శ్వేత వస్త్రాలతో హర్యక్షగాయత్రి స్వరూపం ప్రత్యక్షమైంది! వీరధర్మ ధన్యవాదపూర్వకంగా, ఆనందబాష్పాల గుండా చూస్తూ చేతు లెత్తి నమస్కరించాడు. దేవత వినీలాకాశంలో కలిసి, అంతర్ధానం అయిపోయింది. వీరధర్మ కళ్ళు మూసుకుని, మౌనంగా ఆ దేవతా మూర్తికి కృతజ్ఞతలు విన్నవించుకుంటూ ఉండిపోయాడు.

మిన్నుముట్టిన హర్షధ్వానాలు వీరధర్మను కళ్ళు తెరిపించేలా చేశాయి. పౌరులు అరుస్తూ గుంపులుగా తన వైపు పరిగెట్టుకు వస్తున్నారు. కొన్ని క్షణాలలో పౌరులు వీరధర్మ ముందు గుంపుగా నిలబడ్డారు. అందరూ హర్షాతిరేకంతో, ముక్తకంఠంతో అరుస్తున్నారు. అవి అరుపులు కావు. జయజయధ్వానాలు...

"జయహో వీర యువకా! జయహో!"

ఆ జయజయధ్వానాలలో తమ పైశాచిక చక్రవర్తీ, మదగజాలూ వాటిని నియంత్రించే దుర్మార్గులూ అంతమైనందుకు ప్రజలలో పెల్లుబికిన ఆనందం ధ్వనిస్తోంది. వీరధర్మ రెండు చేతులనూ పైకెత్తి, వాళ్ళను వారించాడు.

"జయజయధ్వానాలు నాకు కాదు; సింహదేవతకు అర్పించండి!" నిశ్శబ్దం ఆవరించాక అన్నాడు వీరధర్మ, చేతులెత్తి ఆకాశం వైపు నమస్కరిస్తూ. వేలాది చేతులు నింగికి నమస్కరించాయి.

గిరిజాల జుట్టుతో, పెరిగిన తెల్లటి గడ్డంతో ఉన్న ఒక వృద్ధుడు వీరధర్మ దగ్గరగా వచ్చాడు. తెల్లటి వస్త్రాలు ధరించాడాయన. మెడలో రుద్రాక్ష మాలలు. నుదుటి మీద విబూదిరేఖలు. బూడిద మీద నిప్పు కణికలా, విబూదిమీద గుండ్రటి ఎర్రటి బొట్టు. భుజం మీద పసుపు రంగు ఉత్తరీయం.

"నాయనా, నా పేరు సుధాముడు. ఈ రాజవంశానికి కులబ్రాహ్మణుడిని. రాజగురువుని. జీవంతకుడు రాజైన క్షణం నుండీ నా గురుత్వం మరుగున పడింది. ఈ రాజ్యానికి జీవంతకుడే సర్వస్వం అయిపోయాడు. రాజు తనే. న్యాయకోవిదుడూ తనే. గురువూ తనే; దైవమూ తనే! జీవంతకుడు రాజుకాడు; నియంత. రాక్షస నియంత! నీ మూలంగా ఆ దుర్మార్గుడి పీడ మా ప్రజలకి విరగడైంది..."

"ఔను నాయనా..." అంటూ మరో వ్యక్తి ముందుకు వచ్చాడు. వీరధర్మ అతడిని తేరిపారా జూశాడు. మహామంత్రి!

"జీవంతకుడు రాజూ, న్యాయకోవిదుడూ, గురువూ, దైవమూ మాత్రమే కాదు, నాయనా! మహామంత్రి కూడా! ఆశ్చర్యపోతున్నావా? సభలో నీకు శిక్ష విధించినప్పుడు మహామంత్రిగా నా స్పందన చూశావుగా! తప్పక ఆశ్చర్యపోతావు! అది అభినయం నాయనా! ప్రాణాల కోసం నేను నిరంతరం చేసే నటన! నాకన్నా ముందు సేవలు అందించిన మహామంత్రి ఒకే ఒక్కసారి జీవంతక మహారాజుగారి మాటను కాదన్నందుకు సూర్యాస్తమయం కాకముందే గజగర్త శిక్షకు బలైపోయాడు! ఆయనలాగా బలికావడం ఇష్టం లేక, జీవంతకుడు పాడిన పాటకు తాళం వేస్తూ, ఆడిన ఆటకు అడుగు కలుపుతూ, జీవితం గడుపుతూ వచ్చాను.."

"మహామంత్రి చెప్పింది, అక్షరసత్యం నాయనా!" రాజగురువు సుధాముడు అన్నాడు.

**(ఇంకా వుంది)**



# మండేకాలంలో ఫిట్‌నెస్ కావాలంటే...

**ఓ వైపు భానుడి ప్రతాపం! మరోవైపు ఒంట్లోంచి పుట్టే విపరీతమైన వేడి. కాసేపు ఎండలోకి వెళ్తే చాలు శక్తిని కోల్పోయిన శరీరం అలసట, నీరసపడిపోవడం సహజం. ఎండాకాలంలో ఇలాంటి వాతావరణ పరిస్థితుల్ని తట్టుకుని ఫిట్‌గా ఉండాలంటే చాలా కష్టం.**

**పోనీ వ్యాయామం లాంటివి మానేద్దామా అనుకుంటే శరీర దృఢత్వం కోల్పోతామన్న భయం కలుగుతుంది. ఊరికూరికే నీరసం వస్తూ ఉంటుంది. నీళ్లు తాగుతూనే ఉంటాం. ఆకలి వేయని స్థితి! ఫలితం శరీరం దృఢత్వాన్ని కోల్పోవడం! వేసవి తాపాన్ని తట్టుకునే విధంగా శరీరాన్ని దృఢంగా ఉంచుకోవాలంటే కొన్ని జాగ్రత్తలు పాటించాలి. అవేంటో తెలుసుకోండి!**

ఉదయాన్నే ఏడుగంటల లోపు, సాయంత్రం ఎండ పూర్తిగా తగ్గిన తర్వాతి సమయాన్నే వ్యాయామానికి కేటాయించడం మంచిది. కొందరికి మధ్యాహ్నం వ్యాయామాలు చేయడం అలవాటు. ఎండవేడిమి ఎక్కువగా ఉండటంవల్ల అలాంటివారికి మరింత నీరసం కలిగే ప్రమాదం ఉంది కాబట్టి ఈ మూడు నెలలూ ఉదయం లేదా చల్లటి సాయంత్రాలు మాత్రమే వ్యాయామం చేయడం మేలు!

## మ్యూజిక్కే మనకి తోడు

ఎండాకాలంలో ఒక్కోసారి ఒక్కరే వ్యాయామం చేయాలంటే నీరసంగా లేజీగా అనిపిస్తుంది. ఒంటరిగా వ్యాయామం చేయడానికి బద్ధకం, నిరాసక్తత కలగవచ్చు. అందుకే పైన చెప్పిన వేళల్లో పార్కుల్లో కానీ ఇంట్లో కానీ స్నేహితులు, కుటుంబ సభ్యులు, ఇలా ఎవరో ఒకరితో కలిసి వ్యాయామం చేయడానికి ప్రయత్నించండి. దీని వల్ల నీరసం అనే ఫీలింగ్ కలిగే అవకాశాలు చాలా తక్కువ. ఒక వేళ ఒక్కరే చేయాలనుకుంటే మ్యూజిక్ వింటూ వ్యాయామం చేయడం మంచిది.

## చర్మ సంరక్షణ ముఖ్యం

ఇంట్లో ఉండే వారి సంగతటుంచితే, ఆఫీసులకు వెళ్లేవారు పగలంతా బయట తిరిగి పనులు చూసుకునేవారు ఆరోగ్యంతో పాటు చర్మ సంరక్షణ మీద కూడా తగినంత శ్రద్ధ వహించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఎండ తీవ్రతకు చర్మం కమిలిపోయి నల్లగా తయారవుతుంది. మరి ఈ సమస్య నుంచి కాపాడుకోవాలంటే సన్‌స్క్రీన్ లోషన్ రాసుకోవడం ఉత్తమం. అలాగే సున్నిపిండిని వారానికి మూడు రోజులు ఉపయోగించాలి. ఇది ఎండ వేడి నుంచి చర్మాన్ని కాపాడటంలో ఉపయోగపడుతుంది. శరీరానికి హాయిని గొలిపే కాటన్ వంటి దుస్తులను ధరించడం వల్ల కూడా ఒంట్లోకి అధిక ఉష్ణం చేరకుండా ఉండే అవకాశాలు ఉన్నాయి.

## శరీరాన్ని ఇలా చల్లబరచండి

వ్యాయామం చేసే సమయంలో శరీరంలోని నీరంతా చెమట రూపంలో బయటకి వెళ్లిపోతుంది. అలాగే బయట ఎండకి తిరిగేటప్పుడు కూడా శరీరంలో నీటి స్థాయి క్రమంగా తగ్గే అవకాశం ఉంది. కాబట్టి శరీరంలో నీటిస్థాయిని క్రమబద్ధం చేసుకుని సమన్వయ పరుచుకోవాల్సిన అవసరం చాలా ఉంది. దీనికోసం వ్యాయామం చేయడానికి కనీసం పదిహేను నిమిషాల ముందు రెండు లేదా మూడు గ్లాసుల నీరు తాగాలి. బయటకి వెళ్లే వాళ్లయితే వాటర్ బాటిల్ తప్పనిసరిగా వెంట ఉంచుకోవాలి. అయితే కేవలం నీరు మాత్రమే కాదు నీటితో పాటు పండ్ల రసాలు, మజ్జిగ, కొబ్బరిబోండం వంటి శరీరానికి చలువ చేసే పానీయాలను తాగడం చాలా మంచిది. ఫ్రిజ్ నీళ్లకన్నా కుండలో నీళ్ళు మరింత చలువ చేస్తాయి. అలాగే వృద్ధులు, చిన్న పిల్లలకు ప్రతి నాలుగు గంటలకొకసారి గ్లూకోజ్ వాటర్ తాగిస్తూ ఉండాలి.

## సరైన భోజన వేళలు

అదే పనిగా నీరు తాగుతుంటే ఆకలి వేయదు. కాబట్టి ఎండాకాలంలో కచ్చితమైన భోజన సమయాలు పాటించడం తప్పనిసరిగా అలవాటు చేసుకోవాలి. ఆకలి లేదని ఆహారం మానేయకుండా సమయానికి కొంచెం అయినా సరే ఆహారం తినడం ఆరోగ్యకరమైన మంచి పద్ధతి. మసాలా తిళ్లు కాకుండా తేలికగా జీర్ణం అయ్యే ఆహారం తీసుకోవడం ఉత్తమం. బయట ఫాస్ట్‌ఫుడ్‌కి ఈకాలంలో ఎంత దూరంగా ఉంటే అంతమేలు.

- నివేదిత

# డేర్ డెవిల్



-మధుబాబు

25

**గుండెల మీది నించి కొండంత బరువు దిగి పోయినట్లు తేలికగా నిట్టూర్చి తన చేతుల్లో ఉండిపోయిన పాము వైపు చూశాడు నఫీజు.**

**జమేలీ చేయి పట్టుకుని, మధ్యమధ్యలో వెనక్కితిరిగి అతనివైపు చూస్తూ కోట దగ్గరికి వెళ్ళిపోయింది నదియా.**

**'మెయిన్‌డోర్ దగ్గరికి పోవటం లేదు. ప్రక్కభాగంలో ఏమైనా చిన్నచిన్న ద్వారాలు ఉన్నాయేమో దానికి తెలియదు' ఉన్నట్లుండి నఫీజు చెవులకు చేరింది శ్యామ్‌సుందర్ కంఠం.**

మెలికలు తిరుగుతూ బుసలు కొట్టడం మొదలుపెట్టింది నఫీజు చేతుల్లో ఉన్న పాము. నిర్మొహమాటంగా దాని తలను ఇసుకలో గుచ్చి, తన ఎడమ పాదంతో బలంగా అదిమి పట్టుకున్నాడు నఫీజు.

'తప్పించుకోవటానికి అవసరమైన సమతలం లభించలేదు శ్యామ్‌సాబ్. అడ్డంగా దొరికిపోయాను' నదియాతో జరిపిన సంభాషణ గుర్తు చేసుకుంటూ చెప్పాడు.

'నదియా ప్రార్థన చేసినందువల్ల భగవంతుడు ఆమె కోరిక మన్నించి నిన్ను ఆమెకు చూపించాడో లేదో తెలియదుగానీ, ఆమె ప్రార్థన మనకి బాగా ఉపయోగపడే చిహ్నాలు కనిపిస్తున్నాయి' దూరంగా ఉన్న కోట మీద దృష్టి కేంద్రీకరిస్తూ అన్నాడు శ్యామ్ సుందర్.

పాదం కింద ఉన్న పాముని ప్రాణాలు పోయేటట్లు బలంగా అదుముతూ, 'అదెలా సాధ్యం శ్యామ్‌సాబ్?' అని ఆశ్చర్యంగా అడిగాడు నఫీజు.

'మడ్డి భూతానివి నువ్వు. ఆమె వెంట కోటలోకి వెళ్ళడమే బెటర్. ఆ రహంతుల్లా గనుక జాబిల్లిని పట్టుకోగలిగితే కోటలోకే తీసుకు వస్తాడు. ఆల్రెడీ లోపలే ఉంటావు కాబట్టి నువ్వు వెంటనే రంగం

### జరిగిన కథ

**జు**బ్బా కొండల్లో నిక్షిప్తమైన నిధికోసం జుబ్బా రాజ్య మహాసుల్తాన్ అన్వేషిస్తూ ఉంటాడు. ఫిలోలజిస్టు సబ్జెక్టు చదివే జాబిల్లికి పురాతన లిపిలో ఉన్న పత్రాలిచ్చి అధ్యయనం చేయమంటాడు మహాసుల్తాన్. అతడి సోదరుడు రహంతుల్లా ఆ నిధిని కాజేసేందుకు జాబిల్లిని కిడ్నాప్ చేస్తాడు. అతడి చెరనుంచి తప్పించుకున్న జాబిల్లి ఘనీసుల్తాన్ మనుషులకు దొరికిపోతుంది. గూఢచారి శ్యామ్‌సుందర్, నఫీజు యిద్దరూ జాబిల్లిని వెతుక్కుంటూ ఘాజీ పట్టణం వస్తారు. రహంతుల్లా జుబ్బారాజ్య నేతగా బాధ్యతలు చేపడతాడు. జాబిల్లి ఆచూకీ తెలుసుకునేందుకు రాచ భవనం ఎదుటే ఉండి రహంతుల్లా కదలికలపై నిఘా వేస్తారు శ్యాం, నఫీజు.

ఆ తర్వాత....

లోకి దిగటం చాలాతేలిక' చెప్పాడు శ్యామ్‌సుందర్.

'ఈ సుల్తాన్‌ల వ్యవహారాలన్నీ చాలా డిఫ రెంట్‌గా ఉంటాయి శ్యామ్‌సాబ్. మీకు చెప్పేం తటి వాడిని కాదు గాని, ఆడవాళ్ళని అంతః పురాల్లో కూర్చోబెడతారు. వాళ్ళకి ఆడవాళ్ళే కాపలా ఉంటారు లేదా అటూఇటూ కాని వాళ్ళు అపా యింట్ చేయబడతారని... మరి నేను' అంటూ మాట ఆపాడు నఫీజు.

'నువ్వు భగవంతుడు పంపించిన మడ్డి భూతానివి. అవసరం అయితే ఎవరికీ కనిపించ కుండా మాయం అయిపోగలవు' నవ్వాడు శ్యామ్ సుందర్.

సిగ్గుతో తలవంచుకున్నాడు నఫీజు. 'క్షమిం చాలి శ్యామ్ సాబ్. ఒక్కసారిగా ఎదురైన ప్రాబ్లెమ్ అది. ఏం చేయాలో తెలియలేదు. తనే అన్ని మాటలూ మాట్లాడేసింది ఆ మల్లె మొగ్గ.... కాదని అంటే గోల అవుతుందన్న భయంతో తల ఊపే శాను' చిన్నకంఠంతో చెప్పాడు.

'నవ్వుతూనే అతని భుజం తట్టాడు శ్యామ్ సుందర్' అనుకోని విధంగా మనకి లభించిన అతిచక్కని అవకాశం. తెలివిగా ఉపయోగించు కోవాలి. నువ్వు ఎలర్ట్‌గా ఉండు' అన్నాడు.

వెంటనే వచ్చేసింది అనుమానం నఫీజుకి. 'నేను ఎలర్ట్‌గా ఉండటం ఏమిటి శ్యామ్‌సాబ్? మీరు?' అడిగాడు.

'కోటని నువ్వు గమనించుకుంటూ ఉంటావు కాబట్టి. నేను ఎడారిలోకి పోయి రహంతుల్లా సైని కుల్ని గమనించుకుంటాను. ఒకవేళ జాబిల్లి గనుక ఎడారిలో ఉండగా నాకు కనిపిస్తే ఫాస్ట్‌గా మూవ్ కావచ్చు' అన్నాడు.

'ఏదైనా ప్రాబ్లెమ్ ఎదురయితే?' అడిగాడు నఫీజు.

'అటువంటి సందేహాలు పొరపాటున కూడా మన మనసుల్లోకి ఎంటర్ కాకూడదు. తల వంచు కుని మనం చేయవలసింది ఏమిటో చేసుకుంటూ పోవడమే' అన్నాడు శ్యామ్‌సుందర్.

పల్లపు ప్రదేశంలో నిలబడి సీరియస్‌గా చర్చించుకుంటూ పడమటిదిశలోకి పోయిన సూర్యుడు మటుమాయం అయిపోవటాన్ని గమనించలేదు వారిద్దరూ. గమనించేసరికి బాగా చీకటి పడి పోయింది. అప్పటివరకూ వేడివేడిగా ఉన్న వాతా వరణం ఒక్కసారిగా చల్లబడి, చల్లటి గాలులు వీచటం స్టార్ట్ అయింది.

'మీరు విశ్రాంతి తీసుకోండి. నేను వాచ్‌మన్ డ్యూటీ ఎక్కుతాను' అంటూ పల్లంలోనుంచి పైకి బయలు దేరబోతూ ఉలిక్కిపడ్డాడు నఫీజు.

అతను ఎందుకలా తత్తరపడ్డాడో వెంటనే గ్రహించి, పల్లంలోనే వెల్లకిలా పడిపోయాడు శ్యామ్ సుందర్.

రెండే రెండు అంగల్లో అంతకుముందు నదియా ఏ పొద దగ్గర ప్రార్థనచేసిందో ఆ పొద దగ్గరికిపోయి నిలుచున్నాడు నఫీజు.

'మా నదియా బేటీ వట్టి బోళాపిల్ల. మంచి చెడుల పర్యవసానాలు ఏమీ తెలియని పసిబిడ్డ. ఆ బిడ్డని మోసం చేసినట్టు నన్ను మోసం చేయటానికి, ప్రయత్నిస్తే నిన్ను కత్తితో పొడిచి చంపేస్తాను' అంటూ పొద దగ్గరికి వచ్చింది జమేలీ.

వట్టిగా రాలేదు. మందపాటి దుప్పటి, పరిశుభ్రమైన దుస్తులు, పెద్ద కత్తి, నీట్‌గా పాక్‌చేసిన తినుబండారాలు అన్నీ తీసుకువచ్చింది.

'తన తండ్రి అమరజీవి అయిపోయాడని తెలిసిన క్షణం నుంచీ అదోమాదిరిగా పిచ్చిచూపులు చూస్తున్న మా నదియా నిన్ను చూసిన క్షణం నుంచీ తిరిగి మామూలుగా తయారైపోయింది. తనలో నిన్నటివరకూ ఉన్న ఉత్సాహం ఇందాకటి నుంచీ మళ్ళీ కనిపించటం మొదలు పెట్టింది' తను తీసుకువచ్చిన సరంజామానంతా అతనికి దగ్గరగా పెట్టి, నడుము మీద చేతులు వేసుకుంటూ చెప్పింది ఆమె.

'బిడ్డ భవిష్యత్తు ఏమౌతుందో ఇంకా తేలలేదు' అని కూడా అంటూ ఉండగా, ఆమెను మధ్యలోనే ఆపేశాడు నఫీజు.

'నేను కూడా నీ వంటి మనిషినే అని నీకు తెలిసిపోయింది. మరి వెంటనే రహంతుల్లాకి నా గురించి ఎందుకు రిపోర్టు చేయలేదు?' అని అడిగాడు.

'నదియా బేటికి సంరక్షకురాలిని. ఆ బిడ్డ క్షేమమే నాకు ముఖ్యం. ఆ బిడ్డ ఆనందంగా ఉండ టానికి ఏమైనా చేస్తాను. నిన్ను మడ్డిభూతంగానే అనుకోమంటే తప్పకుండా అనుకుంటాను' స్పష్టంగా చెప్పింది జమేలీ.

'నువ్వు గమనించే ఉంటావని నేను ఆశిస్తున్నాను. రహంతుల్లా చేతులు ముడుచుకు కూర్చోడు. మహాసుల్తాన్ వారసురాలిని ప్రాణాలతో ఉంచడు. ఏదో ఒకటిచేసి అడ్డు తొలగించు కుంటాడు' సూటిగా విషయాన్ని విశద పరిచాడు నఫీజు.

'అందుకే నేను సిద్ధపడుతున్నాను. అటువంటి ప్రమాదం ఏర్పడిన వెంటనే నదియాని కోటలో నుంచి తప్పించేస్తాను' చెప్పింది జమేలీ.

'అది ఏమంత తేలికగా జరుగుతుందని నేను అనుకోవడం లేదు' కోట దగ్గర కాపలా ఉన్న వారివైపు చూస్తూ అన్నాడు నఫీజు.

చిన్నగా నవ్వి అతన్ని తనతో రమ్మని సైగ చేసింది జమేలీ. పదిహేను అడుగుల ఎత్తున్న కోట దగ్గరికి తీసుకుపోయింది. కాపలా జనం తనను గమనించడం లేదని నిశ్చయం చేసుకుని, గోడలో ఒక భాగాన్ని బలంగా అదిమింది.

నిశ్శబ్దంగా పక్కకు జరిగింది ఒక రాతి పలక.



**ఆ ఎడారి ఎండలో నడక మొదలెట్టాడు శ్యామ్‌సుందర్. నీడకోసం అల్లాడిపోతున్నాడు. కొంతదూరం వెళ్ళాక ఒక ఇసుక దిబ్బ కనిపించింది. దాని వెనుకవైపున్న నీడలోకి అడుగులు వేశాడు. అక్కడ కనిపించిన దృశ్యం చూసేలోపే కైజారుతో శ్యామ్‌పై ఎవరో దాడి చేశారు. ఆ దాడి చేసింది ఎవరు? ఆ గుట్ట వెనుక ఉన్న గుట్టు ఏమిటి? శ్యామ్ గాయపడ్డాడా?**

ఆరు అడుగుల ఎత్తు, రెండు అడుగుల వెడల్పు ఉన్న ఒక మార్గం ఆ గోడలో ప్రత్యక్షం అయింది.

'అవసరం అయితే రెండో కంటివాడికి తెలియకుండా కోటలో నుంచి పారిపోయేందుకు చేయబడిన ఏర్పాటు ఇది. సూటిగా నదియా నిద్రపోయే గదిలోకి తీసుకుపోతుంది ఇది' తన వెనుక నిలబడి ఉన్న నఫీజుతో చెప్పింది ఆమె.

'ఈ మార్గం గురించి రహంతుల్లాకి తెలిసే ఉంటుంది' సాలోచనగా అన్నాడు నఫీజు.

'తెలిసినా తెలియకపోయినా పెద్ద తేడా ఏమీ ఉండదు. ప్రమాదపు వాసన సోకిన వెంటనే పారిపోతాం. ఇప్పుడు నువ్వు కూడా నదియా బేటితో ఉంటావు కాబట్టి నాకు మరింత ధైర్యం వచ్చింది' అంటూ తను ఆ మార్గంలో ఎంటర్ అయింది జమేలీ.

'వంటిమీద మట్టి వదిలించుకో. శుభ్రమైన దుస్తులు ధరించు. కడుపునిండా ఆరగించు. రేపు ఉదయం వేళలో ఈ మార్గం గుండా నదియా బేటీ దగ్గరికి వచ్చేయ్' అన్నది.

అంటూ ఉండగానే తిరిగి యథాస్థానంలోకి జరిగింది. పక్కకు పోయిన రాతి పలక ద్వారం మూసుకుపోయింది.

•••

'చూడు పిల్లా... నేను రహంతుల్లాని కాదు. ఘనీసుల్తాన్‌ని. నాకు అహంకారం లేదు. లేనిపోని గొప్పలకు పోయి తప్పటడుగులు వేయటం అలవాటు లేదు. కాబట్టి నువ్వు రెండో ఆలోచన చేయకుండా ఆ నిధి ఎక్కడ ఉందో చెప్పేయటం చాలా మంచిది' రాత్రి పది గంటల సమయంలో జాబిల్లిని బంధించి ఉంచిన గదిలోకి వచ్చి, స్పష్టంగా చెప్పాడు ఘనీసుల్తాన్.

'మహాసుల్తాన్‌కి తెలిస్తే నీ బతుకు సర్వనాశనం అయిపోతుంది' కోపంగా అన్నది జాబిల్లి.

'రహంతుల్లా కొట్టినదెబ్బకి మహాసుల్తాన్ తల్లక్రిందులు అయిపోయాడు. ఈ పాటికి దొరికిపోయి ఉంటాడు. లేదా ఎడారిలో ఎండకుఎండి ప్రాణాలు పోగొట్టుకుని ఉంటాడు...' అంతకు ముందు జరిగిన సంఘటనను సవివరంగా చెప్పి, తన అభిప్రాయం వెల్లడించాడు ఘనీసుల్తాన్.

బింకంగా ఉన్న జాబిల్లి కనుల్లో వెంటనే ప్రత్యక్షమైంది తడి. గొంతు గద్గదమైంది.

'చూడు పిల్లా. నువ్వు మహాసుల్తాన్ పట్ల విశ్వాసం చూపించడంలో అర్థం ఉంది. నేను కాదని అనటంలేదు. కానీ ఆయన లేనప్పుడు మొండిగా మంకుపట్టు పట్టడంమాత్రం బాగోలేదు. ఈ రాజ్యంలో భద్రపరచబడి ఉన్న ఆ నిధి ఏదో ఈ రాజ్య పౌరులకే దక్కాలి. నువ్వు దాన్ని నీ దేశం తీసుకుపోవడం అసాధ్యం. నమ్మకద్రోహం చేసి, నిన్ను ఇన్ని బాధలకు గురిచేసిన రహంతుల్లాకి దక్కటం కూడా అన్యాయమే. ఉన్నట్లుండి మృదువుగా అన్నాడు ఘనీసుల్తాన్.

'నాతో సహకరించు. నీ కష్టానికి సరైన ప్రతిఫలం లభిస్తుంది. నిన్ను క్షేమంగా నీ దేశం చేర్చే బాధ్యత నేను తీసుకుంటాను' అని కూడా చెప్పాడు.

మహాసుల్తాన్ తల్లక్రిందులు అయిపోయాడన్న మాట అతను చెప్పకముందే, ఆ గది దగ్గర కాపలాగా నిలబడి ఉన్న అతని అనుచరుల మాటల ద్వారా గ్రహించింది జాబిల్లి.

ఘనీసుల్తాన్ అభిప్రాయం ఆమెను ఆలోచనలో పడవేసింది.

'మహాసుల్తాన్‌కి ఒక చిన్నబిడ్డ ఉందిట..' అంటూ మొదలు పెట్టింది సాలోచనగా.

'అవును నదియా సుల్తానా. ఆరేడు సంవత్సరాల వయసు. నువ్వు గనుక మాకు నిధిని అప్పగిస్తే అందులో ఒక వంతు నేనే స్వయంగా తీసుకుపోయి ఆ బిడ్డకి ఇస్తాను' అన్నాడు ఘనీసుల్తాన్ తడుముకోకుండా.

ఆ తరువాత ఎంతోసేపు ఆలోచించలేదు జాబిల్లి. 'మనం ముందుగా జుబ్బా కొండల దగ్గరికి పోవాలి' అన్నది.

వెయ్యికాండిల్స్ బల్బు మాదిరి గప్పున ప్రకాశించింది ఘనీసుల్తాన్ వదనం. 'బహుత్ అచ్చా. బహుత్ బహుత్ అచ్చా. వెంటనే ఏర్పాట్లు మొదలు పెడతాను. ఎయిర్ కండీషన్ వాన్ సిద్ధం చేస్తాను. నీకు ఏం కావాలన్నా చిటికెలో నీ ముందుకు పంపిస్తాను. బహుత్ అచ్ఛా' అంటూ గది బయటికి జంప్ చేశాడు.

'ఏం కావాలంటే అది తీసుకువచ్చి ఆమె ఎదుట పెట్టండి. కడుపు నిండా ఆహారం తీసుకునేటట్లు చూడండి. గదిలో నుంచి బయటికి మాత్రం రానీయకండి' కాపలా ఉన్నవారిని హెచ్చరించాడు.

తలలు ఊపారు వాళ్ళు అటెంక్షన్‌లో నిలబడుతూ.

కూర్చుని ఉన్న కుర్చీలో వెనక్కివాలి, అలసటతో నిండి ఉన్న కనుల్ని అరిచేతులతో అదుముకుంటూ గాఢంగా నిట్టూర్చింది జాబిల్లి. తను ఆశిస్తున్నట్టు ఆ నిధి గనుక బట్ట బయలు కాకపోతే - ఏమిటి తన పరిస్థితి?

•••

మెడ దగ్గర నుంచి పాదాల వరకు తెల్లటి అంగీ ధరించాడు శ్యామ్‌సుందర్. అదే రంగు తలపాగా తలకు దట్టంగాచుట్టి, చివరి భాగాన్ని మొఖానికి అడ్డంగా అమర్చుకున్నాడు.

అందువల్ల అతను తమ దేశానికి చెందినవాడు కాదని కనిపెట్టడం రహంతుల్లా సైనికులకు అసాధ్యం అయిపోయింది.

'ఎక్కడి వరకూ నీ ప్రయాణం?' జుబ్బా పట్టణాన్ని వదిలి పాతిక మైళ్ళదూరం పోయిన వెంటనే, అతని ఒంటెను అడ్డగిస్తూ అడిగాడు సైనికుడు అటువంటి పరిస్థితి ఎదురయితే, వెంటనే ఇచ్చేందుకు సమాధానం ముందే సిద్ధం చేసుకున్నాడు శ్యామ్‌సుందర్.

'ఎనిమిది ఒంటెలు నావి. పరుగు పందేల్లో

## అర్ధరాత్రి వచ్చిన వ్యక్తి ఎవరు?



*ఇదేదో హారర్ సినిమా పేరనుకుంటే పప్పులో కాలేసినట్టే! చెన్నైలో వాస్తవంగా జరిగిందని చెప్పుకుంటున్న సంఘటన. వివరాల్లోకి వెడితే... నయనతార చెన్నైలో ఓ అపార్ట్‌మెంట్‌లో ఉంటోంది. మొన్నీమధ్య అర్ధరాత్రి సమయంలో ఆమె ఫ్లాట్‌లోకి ఓ వ్యక్తి ప్రవేశించాడు. అతగాడిని చూసి నయనతార కేకలు వేసింది. దాంతో అతడు పారిపోయాడు. ఇదీ కథ. ఇంత పక్కాగా అల్లిన కథలో చిన్న ట్విస్ట్ ఏమిటంటే... గత కొన్ని రోజులుగా నయనతార చెన్నైలో ఉండడంలేదు. తెలుగు సినిమా షూటింగ్ కోసం హైదరాబాద్‌లో ఉంటోందట! నయనతార ఇక్కడ ఉంటే ఆ వ్యక్తి అపార్ట్‌మెంట్‌లోకి ఎలా ప్రవేశించాడు? ఇక్కడున్న నయనతార అక్కడ ఎలా అరవగలిగింది? ఈ ప్రశ్నలన్నీ ఇలా ఉంటే...అర్ధరాత్రి ఓ వ్యక్తి ఫ్లాట్‌లోకి ప్రవేశించాడన్న విషయం మీద ఇప్పటి వరకూ ఎవరి నుంచి ఎలాంటి ఫిర్యాదు అందలేదని చెన్నై పోలీసులు చెబుతున్నారు. ఈ గజిబిజి మీద నయనతార నోరు విప్పితే తప్ప అసలు విషయాలు బయటికి రావు అంటున్నారు తమిళ తంబిలు.*

ఫస్టురాగల దమ్ము కలిగినటువంటివి. రాత్రికి రాత్రి ఎవరో దొంగిలించుకుపోయారు. వెతుకు తున్నాను' తడుముకోకుండా చెప్పాడు.

'ఏనిమిది ఒంటెల్ని ఒంటరిగా ఎవరూ దొంగి లించలేరు. ముగ్గురైనా ఉండి ఉంటారు. ఒంటరిగా వాళ్ళని నువ్వేం చేయగలవ్' వెక్కిరింపుగా అడి గాడు ఆ సైనికుడు.

'అన్యాయం జరిగింది. ఆగేదిలేదు అటోఇటో తేల్చుకోవటమే. ముగ్గురు కాదుకదా, ముప్పయ్ మంది ఉన్నాసరే ఎగబడటమే' తన నడుముకు ఉన్న కత్తిని తడుముకుంటూ చెప్పాడు శ్యామ్‌సుందర్.

గుంపుగా నిలబడి ఉన్నారు రహంతుల్లా సైని కులు. అదేపనిగా ఎడారిలో చక్కర్లు కొడుతూ ఉండటం వల్ల మురికిగా మారిపోయి ఉన్నాయి వారి ముఖాలు. తాము వెతుకుతున్న మనిషి కనిపించ లేదు కాబోలు - అసహనం కూడా చాలా అధిక మైన మోతాదులో కనిపిస్తోంది.

'లాగిపెట్టికొడితే లేచి నిలబడటం చేతకాని ఈ చచ్చు మొఖం, వంటరిగా ముప్పయి మందినైనా సరే ఎదిరిస్తాట్ట. ఎలా ఎదిరిస్తాడో చూద్దాం' అంటూ ఉన్నట్లుండి తన ఒంటెను ముందుకు దూకిం చాడు వారిలో ఒకతను.

వికృతంగా శబ్దం చేస్తూ శ్యామ్‌సుందర్ కూర్చునిఉన్న ఒంటెను ఢీ కొట్టింది అది.

తూలి పడిపోకుండా ఉండటానికి అతను చేసిన ప్రయత్నం విఫలం అయింది. ఇసుకమూట మాదిరి క్రింద పడిపోయాడు.

దూరంగా పారిపోవటానికి ట్రై చేసిన అతని వాహనాన్ని వెంటనే పట్టుకున్నాడు ఆ సైనికుడు.

'నీ వంటి వీరాధి వీరుడు ఒంటె మీద ప్రయాణం చేయటం అవమానకరం. నీ పౌరుషం ప్రతాపం అందరికీ తెలియాలంటే, కాలినడకనే ప్రయాణం చేసి ఆ దొంగల్ని పట్టుకోవాలి. ఆ పనిమీదే ఉండు' అంటూ మిగిలిన వారికి సైగ చేశాడు.

తప్పించుకోవడానికి తీవ్రమైన ప్రయత్నం చేస్తున్న శ్యామ్‌సుందర్ ఎక్కి వచ్చిన ఒంటెను వదిలి పెట్టకుండా తమ ఒంటెలతో పాటు పరుగులు తీయిస్తూ, పది నిమిషాల్లో దూరంగా వెళ్ళి పోయారు వారందరూ.

దుస్తులకు అంటుకున్న ఇసుక చేతులతో దులుపుకుంటూ, పైకిలేచాడు శ్యామ్‌సుందర్.

నడినెత్తిమీద ఉన్నాడు సూర్యుడు. వేడి చాలా అధికంగా ఉంది. ఆ సమయంలో నడక ప్రారంభం చేస్తే మరో గంటలో డీ హైడ్రేషన్ బారిన పడటం డెఫినెట్.

నీడ కావాలి. చల్లగా ఉండవలసిన అవసరం లేదు. ఎండ సూటిగా వచ్చి మీద పడకుండా ఆప గల మరుగు వెంటనే వెతుక్కోవాలి.

మడ్డిభూతం కోసం నదియా బేటీ పంపించిన దుస్తుల్ని, ఆయుధాన్ని తాను తీసుకువచ్చేశాడు. పాపం, నఫీజు ఆమెకు ఎటువంటి సమాధానం చెప్పుకుంటున్నాడో.

'తలపాగా అంచుతో మరుగు పరుచుకున్న ముఖాన్ని కూడా చురుక్కుమనిపిస్తున్న ఎండ గురించి తక్షణ ఆలోచనలు చేయకుండా వేరే టాపిక్‌పైపు ఆలోచన మళ్ళడంతో అతను చేసిన ప్రయత్నం వృథా అయింది. శరీరమంతా ఎర్రకారం అద్దినట్లు మంటపెట్టడం మొదలైంది. దాంతో ఆలోచించటం ఆపేశాడు శ్యామ్‌సుందర్. తల వంచుకుని అడుగులు వేయటం మొదలు పెట్టాడు.

సరిగ్గా అరగంట తరువాత అతని దారికి అడ్డంగా ప్రత్యక్షం అయింది పెద్ద ఇసుకగుట్ట. దానికి వెనుకగా పక్కగా అగుపిస్తోంది సన్నపాటి నీడ.

విపరీతమైన దాహంతో ఎండుకుపోయిన పెదవుల్ని నాలుకతో తడుముకుంటూ అటుకేసి నడిచాడు అతను. మూడు అడుగులే వేశాడు. ఉన్న ట్లుండి ఆగి, తదేకదీక్షగా చూశాడు ఆ గుట్ట మధ్య భాగంలో పైకి పొడుచుకు వచ్చి ఉన్న ఒక కొండ రాయిని.

అతను నీడకోసం ఎంతగా తపించిపోతున్నాడో, అదే మాదిరి తను కూడా అల్లాడి పోతున్నది ఎడా రిలో సంచరించే తొండ వంటి ఒక అల్పజీవి.

ఎగిరెగిరి దూకుతూ ఆ కొండరాయి దగ్గరికి పోతున్నది అది. మరో సెకనులో రాయిని సమీ పిస్తుందని అనుకుంటూ ఉండగా - ఉన్నట్లుండి వెనక్కిదూకింది అది. వచ్చిన దారినే వేగంగా గుట్ట కిందికి పారిపోయింది.

'నఫీజు గాడికి కనిపించే పాముల వంటి క్షుద్ర ప్రాణి ఏదో ఆ రాయి వెనుక నక్కిఉండి ఉంటుంది' అను కుంటూ తిరిగి ముందుకు అడుగు వేయబోతూ, మళ్ళీ ఆగిపోయాడు అతను. జాగ్రత్తలన్నిటినీ గాలికి వదిలేసి సూటిగా ఆ రాయి దగ్గరికి పోయాడు.

మెడల వరకూ వంటినిండా ఇసుక కప్పుకుని ఉన్నారు ఇద్దరు వ్యక్తులు. తలపాగాలతో మొఖా లను మరుగు పరుచుకుంటున్నారు.

శ్యామ్‌సుందర్ కొండరాయిని సమీపిస్తూ ఉండగానే, ఉన్నట్లుండి ఇసుకలో నుంచి లేచాడు ఒక మనిషి. తళతళ మెరుస్తున్న కైజారు ఒకటి ఉంది అతని చేతిలో.

తనకు తెలియకుండానే రియాక్ట్ అయ్యాడు శ్యామ్‌సుందర్. ఎడమచేత్తో ఆ ఆయుధాన్ని అడ్డు కున్నాడు. కుడిచేత్తో ఆ మనిషి మొఖం మీద బలంగా పొడిచాడు.

అతను అంత వేగంగా కదులుతాడని గాని, అంతబలమైన పంచ్‌ని డెలివర్ చేయగలడనిగాని ఊహించ లేదు కాబోలు. ఎగిరి వెనక్కి పడిపోయాడు ఆ మనిషి. గింగిరాలు తిరుగుతూ పోయి పది అడు గుల దూరంలో పడిపోయింది అతని ఆయుధం.

రగ్బీ ఫుట్‌బాల్ ప్లేయర్ మాదిరి ఏటవాలుగా డైవ్‌చేసి, చిటికెలో ఆ ఆయుధాన్ని వశపరుచు కున్నాడు శ్యామ్‌సుందర్. పళ్ళు బిగిస్తూ, పడి పోయిన ఆ మనిషి వైపు కదలబోతుండగా.

బాధా సూచకమైన శబ్దం చేశాడు ఇసుకలోనే ఉండిపోయిన రెండవ మనిషి. వెల్లకిలా పడి పోయిన మొదటి శాల్తీ గల గుండెల మీద పాదాన్ని మోపి, కైజారును మొఖానికి అనించి ఎంక్వయిరీలు స్టార్ట్ చేయాలని అనుకుంటున్న శ్యామ్‌సుందర్ దృష్టి డైవర్ట్ అయింది. ఒక్కఅంగలో అతని దగ్గరికిపోయి మొఖంమీద తలపాగా ఇవతలికి లాగాడు.

కరెంట్ షాక్ కొట్టినట్లు అయింది.

రహంతుల్లా పంపిన సైనికుల చేతికి చిక్కవలసిన జుబ్బా పాలకుడు మహాసుల్తాన్.

భుజాల మీద దిగబడిన బుల్లెట్ గాయాలు చాలా బరువు చేసినట్లున్నాయి. 'విపరీతమైన ఫీవర్‌తో వణికి పోతున్నాడు'.

•••

'మంచి దుస్తులు పంపాను. ఏమైపోయాయి అవి?' మధ్యాహ్నం సమయంలో తన బెడ్ రూమ్ లోకి వచ్చిన నఫీజుని చూసి కోపంగా అడిగింది నదియా బేటీ.

ఆయుధంతోసహా వాటిని శ్యామ్‌సాబ్‌కి ఇచ్చి పంపినట్లు చెప్పలేదు అతను.

'మడ్డిభూతాన్ని అని మొదటే చెప్పాను కదా నా చేయి తగలగానే నాశనం అయిపోయాయి అవి' వినయంగా సమాధానం ఇచ్చాడు.

'వాటిని జమేలీకి ఇచ్చేయ్... ఉతికించి శుభ్రం చేయిస్తుంది'.

'అందంలో చందమామకి నా వందనాల మీద వందనాలు. నాతో పాటు ఇంకో భూతం కూడా భూమి మీదికి వచ్చింది. నాకంటే భయంకరంగా ఉంటుంది. దానికి మీ పేరు మీద దానం చేసేశాను' కనురెప్ప కూడా కదిలించకుండా చెప్పాడు నఫీజు.

మతిపోయేంత అందంగా నవ్వింది నదియా. 'సరేసరే కాస్సేపు ఆగితే మా జమేలీ మళ్ళీ ఏదో కొన్ని దుస్తుల్ని సంపాదించి తీసుకువస్తుంది. ఈ లోపల నువ్వు ఆహారం తీసుకో' అంటూ అతన్ని ఒక అందమైన డైనింగ్ టేబిల్ దగ్గరికి తీసుకుపోయింది.

## ఒక్క ఛాన్స్ ఇస్తే చాలు అదరగొడతా



సినిమాల్లో లావణ్య త్రిపాఠి ఎక్కువగా సంప్రదాయ దుస్తుల్లోనే కనిపిస్తుంది. మోడ్రన్ డ్రస్సులు వేయడం చాలా తక్కువ మొదటి సినిమా 'అందాల రాక్షసి' నుంచి మొన్న వచ్చిన 'సోగ్గాడే చిన్ని నాయనా' వరకూ అన్నీ సంప్రదాయ సిద్ధమైన క్యారెక్టర్లే. కానీ తనకు మోడ్రన్ డ్రస్సులంటే ఎక్కువ ఇష్టమట! సినిమాల్లో వీటిని వేసుకునే సందర్భం ఇంత వరకూ రాలే దన్నది లావణ్య బాధ! అలాంటి సినిమా ఒక్కటి వస్తే చాలు మోడ్రన్ డ్రస్సుల్లో అదర గొట్టేస్తానంటోంది.

స్త్రీ జనం నివసించే ఏరియా అది. మగ వాళ్ళు ధరించే దుస్తులు ఆ ప్రదేశంలో కనిపించవు. జమేలీ నిజంగానే చాలా కష్టపడాలని అర్థం అయింది నఫీజుకి.

'ఎడారి పువ్వుకంటే అందంగా ఉండే నదియా సుల్తానా నాకు చెప్పాల్సిన ఆజ్ఞలు ఏమైనా ఉన్నాయా? ఏదైనా పని పూర్తిచేసి చూపించాలా?' బంగారు పళ్ళెరంలో ఉన్న ఖర్జూర పళ్ళను అందుకుని ఆత్రంగా నోటిలో కుక్కుకుంటూ అడిగాడు నఫీజు.

బుగ్గ మీద వేలు పెట్టుకుని అతనికి ఎటువంటి పని అప్పగించాలో ఆలోచించటం మొదలుపెట్టింది నదియా. ఆమె ఆలోచన పూర్తి కాకముందే పరుగు పరుగున ఆ మందిరంలోకి వచ్చింది జమేలీ. మందిరం తలుపులు గట్టిగామూసి గడియ పెట్టింది.

'ఏమిటి హడావుడి జమేలీ?' ఆరిందా మాదిరి అడిగింది నదియా.

'తల్లీ... భగవంతుడు కరుణామయుడు. తల వంచి అతడికి కృతజ్ఞతలు తెలియచేసుకో' కంపి స్తున్న కంఠంతో చెప్పింది జమేలీ.

'ఎందుకు? ఏమిటి విశేషం?' మళ్ళీ అడిగింది నదియా.




'ఇంతకుముందు నీ బాబాయి చెప్పినట్లు నీ తండ్రిగారు హతమారి పోలేదుట. గాయాలైనాసరే లెక్క చేయకుండా ఎడారిలోకి పారిపోయాడు. ఆయన కోసం మీ బాబాయి సైనికులు వెతుకుతున్నారట' చెప్పింది జమేలీ.

'నాకు వివరంగా తెలియాలి. నఫీజూ..' ఉన్నట్లుండి నఫీజు వైపు తిరుగుతూ మాట్లాడింది నదియా.

'ఆజ్ఞ...' టేబుల్ ముందు నుంచి లేచి నిల బడుతూ తలవంచి అభివాదం చేశాడు నఫీజు.

'నీ దివ్యదృష్టితో చూసి వెంటనే చెప్పు. మా నాయన ఎక్కడ ఉన్నారు? ఎలా ఉన్నారు?' ఆజ్ఞను వినిపించింది నదియా.

మొఖాన్ని చింతాకంత చేసుకుని, కళ్ళ నీళ్ళు పెట్టుకున్నంత పని చేశాడు నఫీజు.

'ఏమిటి ఆలస్యం? అసహనంగా అడిగింది నదియా.

'చందమామకు పేరుపెట్టే అందం కలిగిన నదియా బేటి నన్ను క్షమించాలి. మంత్రాలు మర్చి పోయిన మడ్డి భూతాన్ని నేను. దివ్యదృష్టి లేదు' తలవంచుకుంటూ చెప్పాడు నఫీజు.

'అవసర సమయంలో సహాయం చేయలేక పోయిన నేను ఇంకా ఈ భూమి మీద ఉండటానికి అర్హుడిని కాదు. వెంటనే మా లోకం వెళ్ళిపోతాను' అంటూ ద్వారం వైపు తిరిగాడు.

చటుక్కున అతని చేతిని పట్టుకుని అతి బలవంతంగా ఆపింది నదియా. 'నీకు మంత్రాలు మరపు వచ్చిన మాట నేను మర్చిపోయాను. మరేం పరవాలేదు. నువ్వు నా దగ్గరే ఉండాలి. కాని మా నాయనగారు ఎలా ఉన్నారో తెలుసుకోవటం చాలా బాగుంటుంది' అన్నది.

కనుల చివరల నుంచి జమేలీ వైపు చూశాడు నఫీజు. ఉబికి వస్తున్న నవ్వును అతి బలవంతంగా అదిమి పట్టుకున్నది ఆమె.

'వజ్రాల దీపం వంటి నదియా బేటీ. నువ్వు ఆజ్ఞ ఇస్తే నేను ఒకసారి ఎడారిలోకిపోయి ఆ రహస్యం ఎటువంటిదో తెలుసుకువస్తాను' నదియా వైపు తిరుగుతూ అన్నాడు నఫీజు.,

'ఎలా తెలుసుకు వస్తావు? నీకు మంత్రాలు రావు. గాలిలో ఎగరలేవు, ఇసుకలో దూరిపోలేవు ఎలా?' అడిగింది నదియా.

'కాళ్ళున్నాయి, చేతులున్నాయి, మెడకాయ మీద తలకాయ ఉంది. మామూలు మనిషి మాదిరి గానే పోయి వస్తాను. ఆజ్ఞ ఇవ్వు' అన్నాడు నఫీజు.

'నఫీజుకి మంచి ఆయుధం కావాలి. ఎక్కి తిరగటానికి మంచి వాహనం కావాలి. అన్నిటికంటే ముందుగా మంచి దుస్తులు ఇవ్వాలి' జమేలీ వైపు తిరిగి, పెద్దదాని మాదిరి అతనికి అవసరమైన జాబితాని వల్లించింది నదియా.

'మీ బాబాయి చాలా కోపంగా ఉన్నారు. కాపలా చాలా కట్టుదిట్టంగా ఉంది. ఆయుధమైతే ఎలాగో అలా తెచ్చిస్తాను,. ఆహారం నీళ్ళు తెస్తాను. మిగిలినవి చాలా కష్టం. అందరికీ తెలిసి పోతుంది' అన్నది జమేలీ.

'చాలు. అవే చాలు. ఇలాపోయి అలా వచ్చేస్తా? సగర్వంగా ఎనౌన్స్ చేశాడు నఫీజు.

మందిరం వెలుపలికి పోయి అరగంట తరువాత ఒక కత్తితో తిరిగి వచ్చింది జమేలీ. చిన్న మూటలో రొట్టెలు, ఒక నీటి సంచీ కూడా తీసుకువచ్చింది.

నదియా దగ్గర సెలవు తీసుకుని రహస్య మార్గం ద్వారా కోట వెలుపలికి వచ్చిన నఫీజుని తను కూడా అనుసరించి తోటలోకి వచ్చింది జమేలీ.

'ఏమిటీ నీ ఆలోచన? తోటలోకి అడుగుపెట్టిన వెంటనే అడిగింది. అంత నిష్కల్మషంగా మాట్లాడిన తర్వాత ఆమె దగ్గర దాపరికాలు అనవసరమను కున్నాడు నఫీజు. కథంతా సవివరంగా చెప్పేశాడు.

'రహంతుల్లా కిడ్నాప్ చేసిన మా జాబిలమ్మను తిరిగి ఈ కోటలోకి తీసుకు వస్తారన్న అను మానంతో నేను ఇక్కడ ఆగిపోయాను. మా శ్యామ్ సాబ్ ఎడారిలో వెతుకులాటకు వెళ్ళాడు. అదీ సంగతి' అన్నాడు ఆఖర్లో.

'మీ అమ్మాయిని రహంతుల్లా తిరిగి పట్టుకో గలిగితే, తప్పకుండా ఇక్కడికే తీసుకువస్తాడు. ఇక్కడికి తీసుకువస్తే, అంతఃపురంలోనే బంధి స్తాడు. అవసరం అయితే నేను ఆమెను కూడా ఈ రహస్యమార్గం ద్వారా బయటికి తీసుకు వచ్చేస్తాను. నువ్వు కూడా మా మహా సుల్తాన్ గురించి ఆలోచించు. ఆయన క్షేమంగా వుంటే ఈ కష్టాలు అన్నీ గాలిలో కలిసిపోతాయి' అన్నది జమేలీ.

'నువ్వు ఇటువంటి ఆలోచనలు చేస్తున్నావని రహంతుల్లాకి తెలిస్తే నీ తల తెగ నరికిస్తాడు' అన్నాడు నఫీజు.

'నా సుల్తాన్ కుటుంబానికి సేవ చేసు కోవటంలో నా ప్రాణాలుపోయినా నేను లెక్క చేయను' నిబ్బరంగా అన్నది జమేలీ.

ఆమె తెచ్చిచ్చిన ఆయుధంతో, ఆహారంతో తిరిగి ఆ తోటలోనే మకాం పెట్టి రహంతుల్లా అను చరుల కదలికల మీద ఒక కన్నువేసి ఉంచాలని అనుకుంటున్నాడు నఫీజు.

కానీ జమేలీ మాటలు అతన్ని తీవ్రంగా కది లించేశాయి.

'నీకు నేను సహాయం చేస్తాను. నేను కూడా ఎడారిలోకి పోయి వస్తాను' అంటూ అప్పటికప్పుడు నడక మొదలు పెట్టాడు.

•••

సూర్యుడు పడమటి దిశవైపు పరుగులు తీస్తూ ఉండగా జుబ్బా కొండల్ని సమీపించింది ఘనీ సుల్తాన్ నడుపుతున్న మోటార్ వెహికల్.

అంతకుముందు జాబిల్లికి వాగ్దానం చేసినట్లు చాలా అధునాతనమైన వెహికల్‌నే తీసుకు వచ్చాడు అతను.

'కొండల్ని చేరుకున్నాం. ఇక్కడినించి ఎటుగా పోవాలో చెప్పవలసింది నువ్వే' వెనుక సీటులోఉన్న జాబిల్లికి చెప్పాడు.

తను డీకోడ్ చేసిన పుస్తకంలోని వివరాల్ని గుర్తు చేసుకుంటోంది జాబిల్లి. 'పొదల పాము తోక మాదిరి మందంగా మొండిగా కనిపిస్తుంది ఒక గుట్ట. ఎక్కడ వుందో చూడండి' మెల్లగా చెప్పింది.

వెహికల్‌లో నుంచి దిగి చుట్టూ చూశాడు ఘనీసుల్తాన్. అన్ని గుట్టలూ ఒకే మాదిరి కని పించాయి అతని కనులకి.

చీకటిపడటానికి మరో గంట మాత్రమే వ్యవధి ఉన్నట్టుగా తెలిసిన సమయంలో కూడా అతనికి కనిపించలేదు అది.

'నువ్వు పొరపాటు పడినట్లు అనిపిస్తోంది' వేడి గాలి తగలకుండా టైట్‌గా డోర్ మూసుకుని కూర్చున్న జాబిల్లి వంక కోరగా చూస్తూ కోపంగా అన్నాడు అతను.

నెమ్మదిగా వెహికల్‌లో నుంచి బయటికివచ్చి, అటూ ఇటూ చూసింది జాబిల్లి. ఉన్నట్లుండి చేతిని జాచి ఒక గుట్టని చూపించింది.

**(ఇంకా వుంది)**



# ఓ కుర్రాడి కత్తిలాంటి ఆలోచన
# గ్రామాల్లో స్టడీ మాల్స్!

**చెట్టుకింద స్కూల్లో బ్లాక్‌బోర్డుమీద బెత్తంతో చూపించి అమ్మ, ఆవు అని చదివించే రోజులు ఇంకెన్నాళ్ళు? ప్రభుత్వం ఎలాగో అన్నీ చేయలేదు! చాకులాంటి మనకుర్రాళ్ళు తల్చుకుంటే మాత్రం, మన గ్రామసీమల్ని ఎడ్యుకేషన్ మాల్స్‌గా మార్చి పారేస్తారు. గ్రామాల్లో కూడా ఇప్పుడు విద్యలు నేర్పే విజ్ఞాన సముదాయాల్ని లేదా విద్యలవాడలను ఏర్పాటు చేసే రోజులు తీసుకువచ్చాడు ఓ కుర్రోడు. అ కథేంటో చదవండి.**

మాల్ పేరు చెప్పగానే ఏం గుర్తొస్తోంది? ఇంటి సామాగ్రి మొదలు, దుస్తులు, వినోద కార్యకలాపాల వరకూ అన్నీ ఒకే చోట ఉండే షాపింగ్‌మాల్స్ గుర్తొచ్చాయి కదా! మాల్ అంటే అన్నీ ఒకేచోట ఉండే స్థలం అని అర్థం. సిటీ కల్చర్‌లో చాలా మందికి ఈపేరు సుపరిచితమే! కానీ మహారాష్ట్రలోని కొన్ని పల్లెటూర్లలో ఓ కత్తిలాంటి కుర్రాడు సరికొత్త స్టడీ మాల్స్ ఏర్పాటు చేశాడంటే మీరు నమ్ముతారా! మీరనుకున్నట్లు ఇందులో వినోదాన్ని మాత్రమే కాదు విద్యార్థులకు అవసరమయ్యే విజ్ఞానాన్ని కూడా అందిస్తున్నాయి ఈ మాల్స్!

మాల్ అనే పదంలోని అంతరార్థం గ్రహించి, గ్రామీణ ప్రాంతాల్లో విద్యావ్యవస్థను చక్కదిద్దే కాన్సెప్ట్‌తో చేసిందే ఈ ఆల్ ఇన్ వన్ స్టడీమాల్! వినడానికే కొత్తగా ఉంది కదా! దీని రూపకర్త సంతోష్ దిగంబర రావు ఫడ్.

## ఎందుకోసం?

మనిషిలో అంతర్గతంగా దాగి ఉన్న శక్తుల సంపూర్ణవికాసమే విద్య. కానీ ఇప్పుడున్న మన విద్యావ్యవస్థలో ఇలాంటి పదాలకు చోటే లేదు. గ్రామీణ ప్రభుత్వ పాఠశాలలో అయితే ఊహక్కూడా దీనికి తావుండదు! అరకొర వసతుల మధ్య చదువుకునే పేద బాలల భవిష్యత్తు కలలు పాఠశాలలోనే సమాధి అయి పోతున్నాయి.. పట్టణాల విద్యకు, పల్లెటూర్లలో విద్యకు అదే తేడా! దీన్ని బాగు చేయాలంటే ప్రజలు కూడా చేయూతనివ్వాలి. ఈ ఆలోచననే అందిపుచ్చుకున్నాడు ఎంబిఏ గ్రాడ్యుయేట్ సంతోష్. విద్యావ్యవస్థ రూపురేఖలు మార్చేందుకు కంకణం కట్టుకున్నాడు. గ్రామీణ ప్రాంతాల్లో కూడా డిజిటల్ విద్యావ్యవస్థ తెస్తే పిల్లల భవిష్యత్తు బాగుపడుతుందనుకున్నాడు.

## అలా మొదలైంది

థింక్ షార్ప్ ఫౌండేషన్ సహకారంతో 2013 సంవత్సరంలో సంతోష్, తన మిత్రులు భగ్వాన్ జాదవ్, శ్రద్ధ భంగె సహకారంతో మొదటిసారిగా మహారాష్ట్రలోని సురంగలీ గ్రామంలో స్టడీ మాల్ ప్రారంభించాడు. ఈ విద్యా ఉద్యమ వ్యాప్తిలో భాగంగా స్టడీ మాల్‌ను 2015 నాటికి జల్గావ్ సమీపం వరంగావ్ గ్రామానికి విస్తరించాడు. ఆ సక్సెస్‌తో మూడో మాల్‌ను ముంబైలోని వంగనీ గ్రామంలో ప్రారంభించాడు. ఇప్పుడు ఔరంగాబాద్ చికత్‌గావ్‌లో నాలుగో సెంటర్ ప్రారంభించేందుకు ప్రయత్నాలు చేస్తున్నాడు.

## ఇదీ ఈ మాల్ ప్రత్యేకత

ఈ డిజిటల్ స్టడీమాల్స్‌లో విద్యకు సంబంధించిన పుస్తకాలతో పాటు విజ్ఞానాన్ని అందించే మరెన్నో బుక్స్ ఉంటాయి. స్టడీమాల్‌లో మీరు ఏవిధమైన డబ్బులు చెల్లించకుండానే అక్కడనున్న పుస్తకాలు చదువుకోవచ్చు. విద్యాసంబంధమైన ఉపకరణాలన్నింటినీ ఉచితంగా వాడుకోవచ్చు. డిజిటల్ క్లాస్ రూంలతో పాటు, వివిధ రకాల ఆట వస్తువులు, ఎడ్యుకేషన్ గేమ్స్, ఇతర నైపుణ్యాలను అందించే వస్తువులు, క్రియేటివిటీ పెరుగుదలకు దోహదంచేసే ఎన్నెన్నో సాధనాలు అందుబాటులో ఉంటాయి. ఐదు నుంచి పదహారు సంవత్సరాల పిల్లలకు ఉపయోగపడే విజ్ఞానదాయకమైన వస్తువులు ఇందులో ఉంటాయి. అంతేకాదండోయ్ ఈ స్టడీమాల్‌కు వచ్చే వారికి గైడెన్స్‌గా టీచర్లు కూడా ఉంటారు. సొంతంగా నేర్చుకోలేని వారికి టీచర్లే స్వయంగా నేర్పిస్తుంటారు. కథలు చెప్పడం, కవితలు రాయడం, బొమ్మలు వేయడంలాంటి పనులలో చాలామంది పిల్లలను నిమగ్నం చేస్తారీ వాలంటీర్లు. మొత్తానికి ఈస్టడీ మాల్‌కి వెళ్లిన పిల్లలు టెక్నాలజీ నేర్చుకుంటూ, వివిధ అంశాలపై ఆటపాటల ద్వారా విజయాలు సాధిస్తున్నారు.

## ఏంటి దీనివల్ల ప్రయోజనం?

మూడు గ్రామాల్లో ఈ స్టడీమాల్స్‌ను దాదాపు వెయ్యి మందికి పైగా విద్యార్థులు ఉపయోగించుకుంటున్నారు. గ్రామీణ ప్రాంత విద్యార్థులకు, టెక్నాలజీతో కూడిన సృజనాత్మక విద్య అందించడంలో ఈ మాల్ చాలా ఉపయోగపడుతుంది. గ్రామీణ విద్యార్థులకు విద్య విషయంలో మరింత అవగాహన కలిగిస్తుంది. ఈస్టడీ మాల్ స్థాపించిన తర్వాత అక్కడ ప్రభుత్వ పాఠశాలల్లో విద్యార్థుల హాజరు శాతం గణనీయంగా పెరిగింది. డిజిటల్ లెర్నింగ్ పద్ధతుల వల్ల పిల్లల్లో ఏకాగ్రత పెరిగింది. పిల్లలు చదువుకునే సమయం 70 నుండి 80 శాతానికి పెరిగిందట. ఇక వాళ్ల నేర్చుకునే మెళకువలు 30 నుంచి 40 శాతానికి పెరిగాయట. అంతేకాదండోయ్ పిల్లల్లో మార్కులు కూడా ఐదు నుంచి పదిశాతం వరకు పెరిగాయని చెబుతున్నారు. ఇంతలా పిల్లల్లో చదువుపట్ల ఇష్టాన్ని కలగజేస్తున్న ఇలాంటి మాల్స్ దేశంలో మరిన్ని వస్తే పల్లెల్లో విద్యాశాతం పెరుగుతుందని చాలామంది అభిప్రాయపడుతున్నారు.

- కీర్తి






# ప్రాణం తీసిన ప్రాక్టికల్ జోక్!

**'పోస్టుమార్టమ్ అయిపోయిందా?' గదిలోకి అడుగు పెడుతూ అడిగాడు డిటెక్టివ్ శరత్.**

**'అయిపోయింది. అమ్మాయి నీళ్ళల్లో పడి మరణించలేదు. ఆమెని కొట్టిచంపి ఆ తరువాత నీళ్ళల్లో పారేశారు' చెప్పాడు పోస్ట్‌మార్టమ్ డాక్టర్ ఫణి.**

తల ఊపాడు శరత్. 'అమ్మాయి శరీరంపైన పెనుగులాట సూచనలూ, ఇతర గాయాలు ఏమైనా ఉన్నాయా?'

'లేదు. అమ్మాయి కన్యకాదు. గర్భవతీ కాదు' చెప్పాడు ఫణి.

ఆలోచిస్తూ ఇన్‌స్పెక్టర్ విజయ్‌వైపు చూశాడు శరత్.

'కేసు త్వరగా సాల్వ్ చేయాలి. ఒత్తిడి పెరుగుతోంది. మీడియా విస్తరించేకొద్దీ ప్రతి కేసూ ప్రాణాంతకమవుతోంది. పైగా అమ్మాయికి పదిహేనేళ్ళే. ఇదీ సంచలనానికి కారణమవుతోంది' చెప్పాడు విజయ్.

•••

'స్కూలుకి ఎలా వెళ్తుంది?' అడిగాడు శరత్.

'ఇంటికి ఆటో వస్తుంది. ఎల్కేజీ నుంచి అదే ఆటో. మాకు ఆటో అతని మీద అనుమానం లేదు' చెప్పారు అమ్మాయి తల్లిదండ్రులు.

'బాయ్ ఫ్రెండ్....'

'అలాంటిదేమీ లేదు'.

'నేను సెల్‌ఫోను, కంప్యూటర్ హార్డ్ డిస్కు తీసుకెళ్తాను'.

'తీసుకోండి. కానీ హంతకుడిని పట్టుకోండి. వాడికి శిక్ష పడాలి' కసిగా అన్నాడు ఆమె తండ్రి.

•••

'అమ్మాయి అమల యావరేజ్ విద్యార్థిని. కానీ మోస్ట్ పాపులర్. స్కూలులో ఆటలు, పాటలన్నిటిలో పాల్గొంటుంది. ఆమెకో గ్యాంగ్ ఉంది. వాళ్లంతా అబ్బాయిల్ని ఏడ్పించటం, వాళ్ళతో కలిసి తిరగటం చేస్తుంటారు. ఆమెకు ఓ బాయ్ ఫ్రెండ్ ఉన్నాడు' చెప్పాడు అసిస్టెంట్ రాము.

'అతని పేరు' అడిగాడు శరత్.

'ప్రదీప్'

'అంతేకాదు. ఆమె హత్యకు రెండు రోజుల ముందు వారిద్దరి మధ్య పెద్ద గొడవ జరిగిందట' ఇంతలో సెక్రటరీ సుధ వచ్చింది. 'బాస్.. అమ్మాయి ఫోన్‌లో ప్రదీప్ కాల్స్ బోలెడున్నాయి. హత్యకు గురయిన రోజు రాత్రి తొమ్మిది వరకూ అతడితో మాట్లాడుతూనే ఉంది' సుధ చెప్పింది.

'హత్య రాత్రి తొమ్మిదిన్నరకు జరిగి ఉండవచ్చు' అన్నాడు రాము.

'అయితే ప్రదీప్‌ని కలుద్దాం. ఈ లోపు ఆమె క్లోజ్ ఫ్రెండ్స్‌ని ప్రశ్నించు. ప్రదీప్ సమాధానాలు, స్నేహితుల సమాధానాలు పోల్చి చూద్దాం' అన్నాడు శరత్ లేస్తూ.

•••

'అమల నేను ప్రేమించుకున్నాం. ఆమెకు పదిహేను, నాకు పదహారేళ్ళు. అంత మాత్రాన ప్రేమించుకోకూడదని ఉందా? ప్రేమకు వయసుతో సంబంధం ఏమిటి?'

'ఇంకా మీ చదువే పూర్తి కాలేదు.....అయినా ఆ రోజు మీ మధ్య గొడవ జరిగిందని తెలిసింది?' ఆశ్చర్యం అణుచుకుంటూ అడిగాడు శరత్.

'అవును. ప్రేమలో భిన్నాభిప్రాయాలు, వాదనలు ఉంటాయి. అంతమాత్రాన నన్ను హంతకుడంటే ఎలా?'

'కరెక్టే. మరి ఎవరు చంపారామెను?'

'నాకేం తెలుసు. నన్ను ప్రేమిస్తున్నా అంటుంది. కానీ అందరితో సన్నిహితంగా ఉంటుంది. ఇక నాకూ వాళ్లకీ తేడా ఏముంది? వాళ్లమీద పడుతుంది. తనని ముట్టుకోనిస్తుంది. వాళ్ళతో ఫోన్లు, చాటింగ్ చేస్తుంది. నేను మాట్లాడితే, అసూయ అంటుంది, తనకి స్వేచ్ఛ ఉందంటుంది' అదే మా గొడవ. మాట్లాడటం మానేస్తే తనే వెంటబడేది. ఆ రోజంతా ఫోన్లే. అందరితో మాట్లాడటం మానేస్తే ఫ్రెండ్లీగా ఉంటానన్నా'.

'ఎవరితో క్లోజ్‌గా ఉంటుంది?'

'మా గ్యాంగ్ అందరితో. షిండే, శ్రీకర్, హుస్సేన్, సాంగా.."

•••

'బాస్ ప్రదీప్ చెప్పింది నిజమే. హత్య జరిగిన రోజు అతడు ఊళ్లో లేడు. ఎవరికివాళ్ళు తననే ప్రేమిస్తోందని భ్రమ పడేవారు. కానీ అందరితో ప్రదీప్‌నే ప్రేమిస్తున్నానని చెప్పేది' చెప్పాడు రాము.

అమల ఫేస్‌బుక్ ఎకౌంట్ చూశాడు శరత్. నిజమే. అమ్మాయి బర్త్‌డేరోజు ఆమె మగ స్నేహితులంతా ఆమెని ప్రేమలో ముంచెత్తారు. ఎటు వెళ్లినా చుట్టూ ముగ్గురు నలుగురు.

**అంతా పద్నాలుగూ, పదిహేనేళ్ళ వయస్కులైన స్నేహితులే. వారిలో అమల చాలా చలాకీ. ఆ వయసుకే ప్రదీప్,ఆమె ప్రేమికులయ్యారు. కానీ అమల ఆకస్మికంగా హత్యకు గురైంది. ఆ రోజు వారిద్దరిమధ్యా పెద్ద గొడవే జరిగింది. ప్రదీప్‌పైనే బలమైన అనుమానం. ఒక్క సాక్ష్యం దొరికితే చాలు. అరెస్టు చెయ్యొచ్చు. కానీ ఎలా? డిటెక్టివ్ శరత్ సాక్ష్యాన్ని ఎలా సంపాదించాడు?**

శరత్ ఆలోచిస్తూ రామూని అడిగాడు, 'ఆమెకు స్నేహితురాళ్ళు లేరా?' అని.

'జానెట్, లైలా'

'వాళ్లని ప్రశ్నిద్దాం పద' అన్నాడు.

•••

'అమల మంచిదేగానీ, ఎవర్ని ఎంతదూరంలో ఉంచాలో తెలియదు, అందుకే ఆమెకు సమస్యలు' చెప్పింది లైలా.

'నా అనుమానం ప్రదీప్‌పైనే. ఎవరితో మాట్లాడినా అతడికి కోపం వచ్చేది. రెండు మూడుసార్లు అమలపై చెయ్యి చేసుకున్నాడు, ఒకసారి క్రికెట్ బ్యాట్ ఎత్తాడు కూడా'

'గర్భవతినని ఇద్దరు ముగ్గురికి చెప్పింది, అతడి మీదే నా అనుమానం' చెప్పింది జానెట్.

కానీ పోస్ట్‌మార్టమ్‌లో గర్భవతి కాదని తేలింది.

అమల ప్రాక్టికల్ జోక్స్ వేసేదా?' అడిగాడు శరత్.

'అబద్ధాలు చెప్పి అందర్నీ ఇబ్బంది పెట్టేది. తరువాత మళ్ళీ నిజం చెప్పేది. శాడిస్ట్ అనుకుంటాం' అంది లైలా.

శరత్ కళ్లు చిన్నవయ్యాయి.

•••

'గర్భవతినని చెప్పింది, ఇంకా మేం చిన్నపిల్లలమే కదా, అబార్షన్ చేయించు కోమన్నా' తలవంచుకుని చెప్పాడు ప్రదీప్.

ఒళ్ళు మండింది శరత్‌కి. 'ప్రేమించుకోవడానికి చిన్నపిల్లలు కారు. గర్భం ధరిస్తే మాత్రం చిన్నపిల్లలా?' అడిగాడు.

'గర్భం నా వల్లనే అని నాకు నమ్మకం లేదు' తలొంచుకుని మెల్లగా అన్నాడు ప్రదీప్. అతికష్టం మీద కోపాన్ని అదుపు చేసుకున్నాడు శరత్.

•••

'నువ్వు' అమల మీద బ్యాట్‌ఎత్తేవట. నిజమేనా?' అడిగాడు.

తల ఊపాడు ప్రదీప్.

'బ్యాట్ ఏది?'

'లేదు. దినేష్‌కి ఇచ్చా?'

'దినేష్ ఎవరు?'

'అమల పక్కింట్లో ఉంటాడు' చెప్పాడు ప్రదీప్.

•••

'ఇదే అంకుల్ బ్యాట్' అందించాడు దినేష్.

'అది నా బ్యాట్' అడ్డుకున్నాడు దినేష్ తమ్ముడు సురేశ్.

'దీన్ని నేను పరిశీలించి తెచ్చిస్తాను' చెప్పాడు శరత్.

'ఏం పరిశీలిస్తారు?' అడిగాడు దినేష్.

'తరువాత చెప్తాను' అని గ్లవ్స్ చేతులతో బ్యాట్ అందుకున్నాడు శరత్.

'నాకు మ్యాచ్ ఉందంకుల్. బ్యాట్ కావాలి' అడిగాడు సురేశ్.

'త్వరలో ఇస్తాను. మీకు అమల తెలుసా?'

'పక్కింటి అమ్మాయేగా, నాతో ఆడేది' చెప్పాడు సురేశ్.

'తెలుసు. ప్రదీప్ గర్ల్ ఫ్రెండ్' అన్నాడు దినేశ్.

'ప్రదీప్ గర్ల్ ఫ్రెండ్ కాదు. నా ఫ్రెండ్' అన్నాడు సురేశ్.

వాళ్ళిద్దరినీ మార్చిమార్చి చూశాడు శరత్. 'మీరిద్దరూ అమలతో కలిసి చదివేవారా?.

'నేను క్లాస్‌మేట్. వీడు అమలకి జూనియర్. నైన్త్ క్లాస్' చెప్పాడు దినేశ్.

'ఏం కాదు. నీ కన్నా నేనే పెద్ద' అని కోపంగా వెళ్లిపోయాడు సురేశ్.

'వీడంతే. చిన్నపిల్లాడివి అంటే కోపం వస్తుంది. అయితే, ప్రదీప్ అమలను చంపలేదు. అమలతో తనకు సంబంధం లేదని చెప్పాడు నాతో. ఆమె ఎవరు పడితే వాళ్ళతో క్లోజ్‌గా ఉంటుంది. మా ఇంట్లో కూడా అమ్మ, నాన్న లేనప్పుడే వచ్చేది. అలా రావద్దని చెప్పాను నేను' చెప్పాడు దినేశ్.

●●●

'ఇటీవలే కనుగొన్నారు దీన్ని. ల్యుమిస్నానో అనే ఫ్లోరోసెంట్ సయానో అక్రిలేట్ ఇది. అత్యంత ఆధునికం. శక్తిమంతం. వేలి ముద్రలను స్పష్టం చేస్తుంది' చెప్పాడు ఫణి.

శరత్ ఇచ్చిన బ్యాట్ ఛాంబర్‌లో పెట్టి ల్యుమిసియానోను దానిపై స్ప్రే చేశాడు.

'కానీ ఎంతమంది ఈ బ్యాట్ వాడారో తెలియదు. ఈ బ్యాటుతోనే కొట్టి నట్టు గ్యారంటీ కూడా లేదు'.

'మునిగేవాడికి గడ్డిపోచే ఆధారం. దానిపై వేలిముద్రలు చూడు. బ్యాట్‌పై ఎక్క డయినా మనిషి శరీరాన్ని తాకిన ఆన వాళ్ళున్నాయేమో చూడు. చిట్లిన చర్మం, అంటిన రక్తం, వెంట్రుకలు, మాంసం.

'ఇదిగో రకరకాల వేలిముద్ర లున్నాయి.' మాట్లాడుతూ హఠాత్తుగా మౌనంగా అయిపోయాడు ఫణి.

'ఏమైంది?' అడిగాడు శరత్.

ఫణి మాట్లాడలేదు. అతడి ముఖం గంభీరంగా మారింది.

'ఏమైంది?' రెట్టించాడు శరత్.

'విజిబుల్ వేవ్‌లెంగ్త్ హైపర్ స్పెక్ట్రల్ ఇమే జింగ్ అని కొత్తగా ఓ టెక్నిక్ వచ్చింది. అతి సూక్ష్మ మైన రక్తం చుక్కని కూడా దీంతో పసి కట్టవచ్చు. డిఎన్ఏ ఎనాలిసిస్ చేయవచ్చు. అంతేకాదు, రక్తం మరక పడి ఎంతకాలమైందో కూడా తేదీతో సహా చెప్పవచ్చు'.

'బ్యాట్‌పై రక్తం మరక ఉందా?'

'ఉంది'. మొత్తం శుభ్రం చేశారు. కానీ ఓ చుక్క ఉంది' చెప్పాడు ఫణి.

●●●

'మా వేలిముద్రలు ఎందుకు? ముక్తకంఠంతో అడిగారు. ప్రదీప్, దినేశ్, షిండే, శ్రీకర్, హుస్సేన్, సాంగా.

"ఈ బ్యాటు అమలను కొట్టి చంపటానికి ఉప యోగించారు. దీనిపై ఎవరెవరి వేలిముద్ర లున్నాయో చూడాలి. మీరు హంతకులు కాకపోతే మీకు భయం ఎందుకు?'

మౌనంగా వేలి ముద్రలు ఇచ్చారు.

'మా తమ్ముడు, వాళ్లఫ్రెండ్స్ కూడా ఈ బ్యాటుతో ఆడేరు. వాళ్ల వేలిముద్రలు కూడా కావాలా?' వ్యంగ్యంగా అడిగాడు దినేష్.

'వాళ్లనీ పిలవండి' అన్నాడు శరత్.

వాళ్ల వేలిముద్రలు కూడా తీసుకున్నాడు. ఒక్కొక్కరి వేలిముద్ర దగ్గర వారి పేర్లు గుర్తుపెడుతూ అన్నిటినీ రాముకి అందించాడు.

'నేరం చేసిన వాడు తప్పించుకోలేడు. మీరంతా పిల్లలు. నేరం ఒప్పుకోండి. శిక్ష తగ్గుతుంది. నేను



నేరస్థుడిని పట్టుకుంటే మాత్రం శిక్ష కఠినంగా ఉంటుంది. మీకు ఏం తెలిసినా చెప్పండి. బహుమతి ఉంటుంది' అన్నాడు శరత్. ఎవరూ మాట్లాడక పోవడంతో బయటకు నడిచాడు. కారు చేరుతుండగా ఫోన్ వచ్చింది.

'శరత్... బ్యాటుపై రక్తం మరక అమలదే. డిఎన్ఏ పరీక్ష తెలిపింది. సో...హత్యకు ఉపయోగించింది ఈ బ్యాట్‌నే'.

ఏదో అనబోయాడు శరత్. అంతలో అతడి కనుకొలకులలో ఏదో కదలిక కనిపించింది. అసంకల్పితంగా పక్కకు దూకాడు. అతడి తలమీద పడాల్సిన దెబ్బ కారు మీద పడింది. కారు అద్దం భళ్లున పగిలింది.

వెంటనే తనపై దాడిచేసిన కుర్రాడిపైకి దూకాడు శరత్. అతడు ఇనుపరాడ్ మళ్లీ తిప్పి కిందకి దింపేలోగా అతడి చేయి పట్టుకుని మెలి తిప్పాడు.

'అమ్మా' అరిచాడు కుర్రాడు.

ఓ చేయితో అతడిని వంచి పట్టుకుని మరో చేత్తో అతడి ముఖం తనవైపు తిప్పి చూశాడు శరత్.

'నువ్వా?' అన్నాడు ఆశ్చర్యంగా.

'నేనే... అమ్మానాన్న లేనప్పుడు వచ్చేది. నన్ను రెచ్చగొట్టింది. నాకు అంతా నేర్పింది. ఇప్పుడు తను గర్భవతి అని తనని పెళ్లి చేసుకోమని అంది. నేనెలా చేసుకుంటాను? ఎంతచెప్పినా వినలేదు. కోపం వచ్చింది. బ్యాటుతో కొట్టాను. చచ్చిపోయింది. నీళ్లలో పడింది.' పిచ్చివాడిలా అరుస్తున్నాడు పిల్లవాడు.

ఈ గోల విని ఇంట్లోంచి బయటకు వచ్చిన పిల్లలు జరిగింది చూస్తూ స్థాణువైపోయారు. వారిలోంచి దినేష్ పరుగున వచ్చాడు.

'నేను చెప్పాను సురేశ్. దాని జోలికి పోవద్దని' అని సురేశ్‌ని విడిపించబోయాడు.

అతడిని పక్కకు నెట్టాడు శరత్. సురేశ్‌ని ఎత్తి కారులోకి తోశాడు. కారు డ్రైవ్ చేస్తూ చెప్పాడు.

'అమల నీతో అబద్ధం చెప్పింది. ఆమె గర్భవతి కాదు. నిన్ను ఏడిపించింది. నువ్వు నిజమని నమ్మావు. ఆమె ప్రాక్టికల్ జోక్ ఆమె ప్రాణం తీసింది. నిన్ను జైలు పాలు చేసింది' నిండా పద్నాలుగేళ్ళు కూడా లేని సురేశ్‌కి చెప్పాడు శరత్.

**-కస్తూరి మురళీకృష్ణ**

**సెల్: 98496 17392**




**సీతమ్మ తనకు చెప్పిన ప్రతి మాటా రామునికి వినిపించాడు హనుమ. సీతమ్మ మాటలు వింటూ రాముడు కన్నీరు మున్నీరవ్వడాన్ని చూసి సుగ్రీవునిసహా అంతా బాధ పడ్డారు. కన్నీరు పెట్టుకున్నారు. వీరపత్నిగా తానేం కోరుకుంటున్నదీ, వీరుడిగా రాముడు ఏం చెయ్యాలన్నదీ, ఏం చేస్తే ఇక్ష్వాకువంశం కీర్తి ప్రతిష్టలు వర్ధిల్లుతాయన్నది సీతమ్మ చెప్పిన మాటలు చెవుల్లో గింగిర్లు పెడుతోంటే...ఆ మాటలు వినిపించిన హనుమను అభిమానంగా చూశాడు రాముడు. ఆరాధనగా చూశాడు. ఆప్యాయంగా చూశాడు.**

# సైన్యంతో సముద్ర తీరానికి చేరిన రాముడు

అదే చూపును సుగ్రీవునిపైకి మరల్చి, అతనితో అన్నాడిలా.

"మిత్రమా! ఊహల్లో కూడా సాధించలేని మహా కార్యాలను సాధించిన ఈ హనుమకు సాటి ఎవరైనా ఉన్నారా? అలాగే అపారమైన సాగరాన్ని దాటి, లంకానగరంలోకి ఒంటరిగా ప్రవేశించి, సీతను దర్శించిన హనుమను ఎంత పొగిడినా తక్కువే కదా."

సమాధానంగా సన్నగా నవ్వాడు సుగ్రీవుడు.

"ఎందరో రాక్షసుల్ని హతమార్చాడు. ఎన్నో అద్భుతాలు సాధించాడు. అతనికి మనం అప్పజెప్పిన పని సీతను చూసి రావడం. అయితే సీతను చూసి రావడమే కాదు, ఆమెతో మాట్లాడి, ఆమెకు జీవితం పట్ల ఉత్సాహాన్ని కూడా కలిగించాడు హనుమ. కలిగించి, నాకూ నా తమ్ముడికీ నిందతోడి చావుని తప్పించాడు. రఘువంశాన్నే రక్షించాడు." అన్నాడు రాముడు.

నిజం నిజం అంది వానరసేన.

"ప్రభువుని బట్టే సేవకులు అంటారు. నీ పట్టుదలా, నీ కార్యదీక్షా నీ సేవకులు అందరికీ వంటబట్టాయి." అన్నాడు రాముడు. ఆనందించాడు సుగ్రీవుడు.

హనుమను చూశాడు రాముడు.

"హనుమా! ఇంతటి మహదానందాన్ని కలిగించిన నీకు ఏమివ్వగలనయ్యా? నువ్వు చేసిన ఉపకారానికి ఏమిచ్చినా చాలదు కూడా." అన్నాడు.

"స్వామీ" అన్నాడు హనుమ. తనకేమీ వద్దన్నట్టుగా చేతిసైగ చేశాడతను.

"రాజునే కాని రాజ్యం లేదు. చేతులు ఉన్నాయిగాని, చేతిలో చిల్లిగవ్వ లేదు." బాధపడ్డాడు రాముడు.

"స్వామీ" ఆందోళన చెందాడు హనుమ.

"సకల ఐశ్వర్యాలూ ఒక ఎత్తు! నా నిండుమనసు కౌగిలి ఒక ఎత్తు! అందుకని, రావయ్యా! రా! నా కౌగిలి స్వీకరించు." అన్నాడు రాముడు. చేతులు జాచాడు. పరుగున వెళ్ళాడు హనుమ. రామయ్య కౌగిలిలో ఒదిగిపోయాడు. అనంతవిశ్వం చేతులు జాచి ఓ అణువుని కౌగిట బంధించడాన్ని, బంధించి మురిసిపోవడాన్ని ఆకాశసంచారులు చూశారు. ఆశ్చర్యపోయారు.

కాసేపు గడిచింది.

సుగ్రీవునితో అన్నాడిలా రాముడు.

"మిత్రమా! సీత ఎక్కడ ఉన్నదీ తెలిసింది. ఒక పని అయింది. రెండో పని... మనం అంతా లంకలోకి ప్రవేశించాలి. నూరుయోజనాల సముద్రాన్ని దాటడం అంత సులువేమీ కాదు. సైన్యంసహా మనం సముద్రాన్ని దాటాలి. ఎలా అన్నది ఆలోచించు."

"ఆలోచించాను రామచంద్రా! సేతువు నిర్మించకుండా మనం సముద్రాన్ని దాటడం అసాధ్యం. అందుకని సేతునిర్మాణమే ధ్యేయంగా మనం ఆలోచించాలి. సేతువు నిర్మించామా, రావణుడు హతుడైనట్టే!" అన్నాడు సుగ్రీవుడు.

ఆలోచనలో పడ్డాడు రాముడు.

"రామా! చెప్పలేనన్ని శుభశకునాలు నాకు తోస్తున్నాయి. మనస్సు ఉత్సాహంతో ఉరకలు వేస్తోంది. సేతువు నిర్మించామా, విజయం మనదే." అన్నాడు మళ్ళీ సుగ్రీవుడు.

**లంకలోని రక్షణ ఏర్పాట్ల గురించి నిశితంగా రాముడికి వివరించి చెప్పాడు హనుమ. సూర్యుడు ఆకాశ మధ్యంలోకి ప్రవేశించిన ఈ ముహూర్తమే శుభ ముహూర్తం, లంకపై దాడికి బయలుదేరండి అన్నాడు రాముడు. వానరవీరులుసహా రామలక్ష్మణులు రాత్రింబవళ్ళు నడిచి మహేంద్రగిరికి చేరుకున్నారు. భయంకరంగా వినవస్తున్న సముద్రహోరు వింటూ ఒంటరిగా కూర్చుని దుఃఖించాడు రాముడు. అప్పుడు లక్ష్మణుడేమన్నాడు?**

ఆలోచన నుంచి తేరుకున్నాడు రాముడు. హనుమను చూశాడు.

"హనుమా! నా తపశ్శక్తితోనో, లేదంటే నా బాణాలతోనో నేను సేతువు నిర్మిస్తాను. సైన్యాన్ని సముద్రం దాటిస్తాను. అయితే లంక గురించి నాకే కాదు, మన వాళ్ళందరికీ బాగా తెలియాలి. నువ్వు లంకను నిశితంగా పరిశీలించావు కాబట్టి, అక్కడి అగడ్తల గురించీ, ద్వారాలు, రహస్యమార్గాలు, రక్షణ ఏర్పాట్ల గురించీ వివరంగా చెప్పు." అడిగాడు రాముడు.

"చెబుతాను ప్రభూ! చెబుతాను." అంటూ హనుమ చెప్పసాగాడిలా.

"రామా! లంకానగరాన్ని త్రికూటపర్వతం దక్షిణ భాగంలో నిర్మించారు. సముద్రమే దానికి పెద్ద అగడ్త. ఆ అగడ్తను దాటడం దేవతలకు కూడా సాధ్యం కాదు. నగరం నాలుగువైపులా ఎత్తయిన ప్రాకారం చుట్టూ లోతయిన మరో అగడ్త కూడా ఉంది. నగర ప్రవేశానికి మూడు ప్రధానద్వారాలు ఉన్నాయి. ఆ ద్వారాలను ఆనుకుని, కర్రవంతెనలు ఉన్నాయి. శత్రువులు దాడి చేస్తే ఆ వంతెనలను ఎత్తి వేసే వీలుంది. ఉత్తరానగల ప్రధానద్వారం దగ్గరి వంతెనను స్తంభాలపై నిర్మించారు. దానిని కదిలించడం ఎవరి తరమూ కాదు. అన్ని ద్వారాల దగ్గరా శతఘ్నులు ఉన్నాయి. అలాగే ఇన్ని అని చెప్పేందుకు వీలులేని విధంగా రథాలు, మత్తగజాలు, గుర్రాలు, పదాతిసైన్యం ఉంది. వారందరినీ అరివీరభయంకరులు గొప్పగొప్ప వీరులు కాపాడుతూ ఉంటారు.

రామా! రావణుడే సర్వసైన్యాధ్యక్షుడు. అతను ద్వార ముఖ్య రక్షకులను ఓ కంట కనిపెడుతూ, అనుక్షణం సైన్యాన్ని పరిశీలిస్తుంటాడు. నేను వంతెనల్నీ, బురుజుల్నీ, అక్కడక్కడ ప్రాకారాలనీ కూలదోసి, సైన్యంలో నాలుగవభాగాన్ని నాశనం చేశాను. మందిరాలనూ, గృహాలనూ దగ్ధం చేయడంతో నగరం అంతటా దారులు ఏర్పడ్డాయి. మన సైన్యం లంకలోకి ప్రవేశిస్తే చాలు! వారి రక్షణ ఏర్పాట్లను తుత్తునియలు చేస్తాయి."

హనుమ చెప్పిందంతా విని, ఆలోచనగా కాసేపు కళ్ళు మూసుకున్నాడు రాముడు. రాముడు ఎప్పుడైతే కళ్ళు మూసుకున్నాడో చెప్పడాన్ని ఆపాడు హనుమ. కాసేపటికి కళ్ళు తెరిచాడు రాముడు.

"ఇంకా" అన్నాడు. చెప్పడాన్ని కొనసాగించమన్నట్టుగా హనుమను చూశాడు.

"రామా! ఒకవేళ సైన్యం అంతా లంక చేరేందుకు ఆలస్యమవుతుందనుకుంటే... ఓ పని చేద్దాం. ముందుగా అంగద, జాంబవంత, పనస, నీల, మైంద, ద్వివిదుల్ని పంపుదాం. వారు సముద్రాన్ని దాటి, లంకకి చేరుకుంటారు. చేరుకుని, ప్రాకారాలు, బురుజులు, యంత్రాలు, భవనాల్ని నాశనం చేస్తారు. కనిపించిన రాక్షసవీరుల్ని మట్టుబెడతారు. అందుకని..."



"ఊఁ! అందుకని?" అడిగాడు రాముడు.

"ఆలస్యం అమృతం విషం అన్నారు. అందుకని లంకపై దాడికి ముహూర్తం వెంటనే నిర్ణయించు ప్రభూ." అన్నాడు హనుమ.

నిర్ణయిద్దాం అన్నట్టుగా తలూపాడు రాముడు. సుగ్రీవుణ్ణి చూశాడు.

"మిత్రమా! నువ్వు అన్నట్టుగానే చెప్పలేనన్ని శుభశకునాలు నాకూ తోస్తున్నాయి. సూర్యుడు ఆకాశ మధ్యంలో ప్రవేశించాడు. ఈ సమయాన్ని 'విజయం' అంటారు. ఇంతకన్నా మంచి ముహూర్తం లేదు. ఈ ముహూర్తంలోనే లంకపై దాడికి మనం సన్నద్ధం అవుతున్నాం. రావణుని అంతు చూసేందుకు ఇదే సరైన ముహూర్తం! రండి! బయల్దేరండి." అన్నాడు రాముడు.

వానరవీరులంతా ఉత్సాహంగా కేకలు వేశారు. పదంటే పదమంటూ ఒకరిని ఒకరు తోసుకోసాగారు. చేతికి అందిన కొమ్మనీ, రాయినీ గాలిలోకి విసిరి, పట్టుకోసాగారు. కోలాహలం మిన్ను ముట్టింది.

"మిత్రమా" సుగ్రీవుణ్ణి దగ్గరగా పిలిచాడు రాముడు. చెప్పాడిలా.

"ఇలాంటప్పుడే శత్రువులు పొంచి ఉంటారు. మనం జాగ్రత్త పడాలి. జల, ఫల మూలాల్ని విష పూరితం చేసేందుకు శత్రువులు ప్రయత్నిస్తారు. కనిపెట్టి ఉండాలి."

"అలాగే మిత్రమా"

"తర్వాత...సైన్యం సుఖంగా ప్రయాణించేందుకు నీడనిచ్చే వనాలనూ, నీటి వనరుల ప్రాంతాలనూ నిర్ణయించేందుకు నీలుని నియమించండి! అతనికి లక్షమంది సైన్యాన్ని అప్పగించండి."

"సరే"

"పదాతిదళానికి ముందు కొంత సైన్యంతో ఋషభుణ్ణి నియమించండి. అలాగే ఆ దళానికి వెనుక మరికొంత సైన్యంతో గంధమాదనుణ్ణి నియమించండి. మనం అంటే... నువ్వూ, నేనూ, లక్ష్మణుడూ మధ్య భాగంలో నడుద్దాం. ఈ మధ్య భాగాన్ని వేగదర్శీ, జాంబవంతుడూ కనిపెట్టుకుని ఉంటారు." చెప్పాడు రాముడు.

"ఆజ్ఞ" అన్నాడు సుగ్రీవుడు. రాముడు చెప్పినట్టుగానే ఆదేశాలను జారీ చేశాడు. మహారాజు ఆదేశానుసారం అంతా ఆయన చెప్పినట్టుగానే ఆయా ప్రదేశాల్లో నిల్చుని ప్రయాణానికి సిద్ధమయ్యారు.

"సుగ్రీవా"

"మిత్రమా"

"సైన్యంలో ఎప్పుడూ పోరాటపటిమగలవారే ఉండాలి. వృద్ధులూ, భీరువులూ ఉండకూడదు. అందుకని నువ్వేం చేస్తావంటే... సైన్యంలో గల ముసలివారినీ, యుద్ధం అంటే భయపడేవారినీ మంచి మాటలు చెప్పి, కిష్కింధకు పంపించేయ్." అన్నాడు రాముడు. సరేనన్నట్టుగా తలూపి, రాముడు చెప్పిన విధంగానే చేశాడు సుగ్రీవుడు. జైశ్రీరాం అన్నాడు. ఆ కేక మిన్ను ముట్టింది. అదే రాజాజ్ఞగా సైన్యం ముందుకు కదిలింది.

పర్వతాలు, గుహలు, అరణ్యాలు, నదీతీరాల్లో ఉన్న అసంఖ్యాక ఋక్ష, వానర సైన్యాలు సింహనాదాలు చేస్తూ ఎగురుతూ, దూకుతూ, కేరింతలాడుతూ ముందుకు ఉరికాయి. రభస, దధిముఖుల సాయంతో జాంబవంతుడు సైన్యాన్ని దగ్గర ఉండి నడిపించసాగాడు. పరిసరాల్లోని పల్లెలకూ, పట్టణాలకూ ఏ విధమైన హానీ జరగరాదని హెచ్చరిక చేశాడు రాముడు. అతని హెచ్చరిక అనుసరించి మహాసైన్యం వాటికి దూరంగా సముద్రంలా గంభీరంగా నడవసాగింది. రాత్రింబవళ్ళు నడిచి సహ్య, మలయాద్రులను దాటింది. చల్లనినీరు తాగుతూ, ఫలమూలాలు తింటూ, తేనెలు జుర్రుకుంటూ ప్రయాణించసాగింది సైన్యం. దక్షిణసముద్రతీరంలోని మహేంద్రగిరికి చేరుకుంది. లక్ష్మణ సుగ్రీవులు సహా రాముడు ఆ గిరిని ఎక్కాడు. అక్కణ్ణుంచి ఎదురుగా ఉన్న సముద్రాన్ని చూశాడు. తిమింగలాది జలచరాలతో నిండుగా ఉన్న సముద్రాన్ని చూసి సుగ్రీవునితో అన్నాడిలా.

"ఏదైనా మంచి ఉపాయం ఆలోచించాలి. ఆలోచించి, ఈ సముద్రాన్ని మనం దాటగలగాలి. దాటితేనేగాని లాభం లేదు మిత్రమా."

రాముడి మాటకి ఒకరిని ఒకరు చూసుకున్నారు లక్ష్మణ సుగ్రీవులు. ఏం మాట్లాడాలో ఇద్దరికీ తోచలేదు.

"ముందు ఓ పని చెయ్యండి! ఇక్కడే అనుకూల ప్రదేశాల్లో సైన్యాన్ని విశ్రాంతి తీసుకోమని చెప్పండి. మకాం విడిచి, ఏ ఒక్కరినీ ఒంటరిగా తిరగవద్దని చెప్పండి. తిరిగితే సేనానాయకులూ, ముఖ్యులూ మాత్రమే తిరగాలి. అదీ మనుష్యరూపం ధరించి మరీ తిరగాలని చెప్పండి. ఈ సంగతి దండోరా వేయించండి." ఆజ్ఞాపించాడు రాముడు. సరేనన్నారు లక్ష్మణ సుగ్రీవులు. రాముడు చెప్పిందంతా దండోరా వేయించారు. అలాగే తగిన స్థలాల్ని చూసి, సైన్యాన్ని విశ్రమింప చేశారు.

మకాం ముందు ఒంటరిగా ఉన్నాడు రాముడు. సముద్రపుహోరు భయంకరంగా వినవస్తోందతనికి. ఈ సముద్రాన్ని దాటడం ఎలా? సీతను కాపాడడం ఎలా అని ఆలోచిస్తూ కన్నీరు పెట్టుకున్నాడతను. ఒంటరిగా దుఃఖిస్తున్న అన్నను సమీపించాడు లక్ష్మణుడు.

"ఏంటన్నయ్యా ఇది? ఊరుకో." అన్నాడు.

"రామలక్ష్మణులంటే అగ్నివాయువులంటారు. అయినా మనం సీతను కాపాడుకోలేకపోయాం. పాపం! లంకలో ఎంతగా అలమటిస్తోందో సీత! తలచుకుంటేనే గుండెలు దేవేస్తున్నాయి. ఏ బాధనైనా భరించవచ్చుగాని, వియోగాన్ని తట్టుకోవడం కష్టం లక్ష్మణా! ఇప్పుడు ఈ క్షణంలో నాకేమనిపిస్తోందో తెలుసా?" అడిగాడు రాముడు.

ఏమనిపిస్తోంది? అని లక్ష్మణుడు అడగలేదు. అన్నను బాధగా చూస్తూ నిల్చున్నాడంతే!

"చచ్చిపోవాలనిపిస్తోంది లక్ష్మణా! ఆ సముద్రంలోకి దూకి చచ్చిపోవాలనిపిస్తోంది. అయినా సీతకోసం... నా సీత కోసం బతకాలనిపిస్తోంది. అంతా అయోమయంగా ఉంది లక్ష్మణా! అంధకారంగా ఉంది. బాధగా ఉంది." అన్నాడు రాముడు.

ఓదార్పుగా అన్న భుజం మీద చేయి వేశాడు లక్ష్మణుడు. నిమిరసాగాడు.

"అసలే సీత సుకుమారం. ఆపై ఉపవాసాలూ, భరించలేనంత దుఃఖం. సీత ఇప్పుడు ఎలా ఉందో ఏమో! రాక్షసస్త్రీలు ఆమెను ఎంతగా హింసిస్తున్నారో! ఈ బాధలు తొలగి, ఎప్పుడు మేమిద్దరం ఒకటవుతామో! దేవుడు మమ్మల్ని చల్లగా చూసేదెన్నడో." భోరుమన్నాడు రాముడు. చేతుల్లో ముఖాన్ని దాచుకున్నాడు.

"ఊరుకో అన్నయ్యా! ఊరుకో" అంటూ రాముణ్ణి దగ్గరగా తీసుకున్నాడు లక్ష్మణుడు.

ఆసరికి సూర్యాస్తమయం అయింది. తన వంశీయుడు రాముడి బాధ చూడలేక కాబోలు సూర్యుడు కొండల్లోకి ఒరిగిపోయాడు.

**-అరణి**

# సౌభాగ్య చక్రం

ఏప్రిల్ 13 నుంచి
ఏప్రిల్ 19 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



## మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

బదిలీలు, మార్పులు, వృత్తి, వ్యాపారాలు, పెట్టుబడులకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో బదిలీలు, మార్పులు చేర్పులు అసౌకర్యం కలిగిస్తాయి. రియల్ ఎస్టేట్, రిటైల్ రంగాల వారికి శుభప్రదం. 15,16 తేదీల్లో ప్రేమానుబంధాలు బలపడతాయి. పెట్టుబడులు, పొదుపు పథకాలు లాభిస్తాయి. చిన్నారులు, ప్రియతముల విషయంలో శుభపరిణామాలు సంభవం. 17,18,19 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో అదనపు ఆదాయం కోసం ప్రయత్నిస్తారు. శ్రమకు తగిన ఫలితం లభించకపోవడంతో నిరుత్సాహపడతారు.



## వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)

విద్య, ప్రయాణాలు, గృహారంభ, ప్రవేశాలు, ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో కాంట్రాక్టులు, అగ్రిమెంట్ల విషయంలో జాగ్రత్తలు పాటించాలి. విద్యార్థులు పట్టుదలతో కృషి చేసి సత్ఫలితాలు సాధిస్తారు. 15,16 తేదీల్లో కుటుంబ సభ్యుల వ్యవహారాలపై దృష్టి సారిస్తారు. రియల్ ఎస్టేట్ రంగంలోని వారికి శుభప్రదం. దూరప్రయాణాలకు అనుకూలం. 17,18,19 తేదీల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ప్రేమానుబంధాలు బలపడతాయి. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి.



## మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, వేడుకలు, విద్యా విషయాలు, బదిలీలు, సమావేశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో ఆర్థిక వ్యవహారాల్లో ఆచితూచి వ్యవహరించాలి. తొందరపాటు నిర్ణయాల వల్ల నష్టపోతారు. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. 15,16 తేదీల్లో ఆర్థిక వ్యవహారాలు ప్రోత్సాహకరం. విద్యార్థులకు శుభప్రదం. సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. వేడుకల్లో పాల్గొంటారు. 17,18,19 తేదీల్లో బదిలీలు, వేడుకలకు అనుకూలం. రియల్ ఎస్టేట్ రంగం వారు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి.



## కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)

కీలక నిర్ణయాలు, ఇంక్రిమెంట్లు, వృత్తిపరమైన సమావేశాలు, వేడుకలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో వృత్తి, వ్యాపారాల్లో అంచనాలు తప్పే అవకాశం ఉంది. పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది. కొత్త ప్రాజెక్టుల గురించి ఆలోచిస్తారు. 15,16 తేదీల్లో ఇంక్రిమెంట్ల విషయంలో సానుకూల సంకేతాలు అందుకుంటారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. పెట్టుబడులు లాభిస్తాయి. 17,18,19 తేదీల్లో సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. పెద్దలకు సంబంధించిన ఒక సమాచారం నిరుత్సాహం కలిగిస్తుంది.



## సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

ఉన్నత విద్య, దూరప్రయాణాలు, వృత్తి, వ్యాపారాలు, సమావేశాలు, బృందకార్యక్రమాలకు ఈ వారం ప్రోత్సాహకరం. బుధ, గురువారాల్లో సమావేశాల్లో మాటపడాల్సి వస్తుంది. రాజకీయ సినీరంగాల వారు పట్టుదలతో లక్ష్యాలు సాధిస్తారు. 15,16 తేదీల్లో ప్రయాణాలు, చర్చలకు ప్రోత్సాహకరం. సమావేశాలు, వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. సంకల్పం ఫలిస్తుంది. 17,18,19 తేదీల్లో ఆర్థిక విషయాల్లో మీ అంచనాలు ఫలిస్తాయి. ప్రణాళిక లోపించడం వల్ల చిక్కులు ఎదుర్కొంటారు. పెట్టుబడులకు సంబంధించిన సమాచారం సేకరిస్తారు.



## కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

ఆర్థిక సంస్థలతో పనులు, ఆర్థిక వ్యూహాలు, బృందకార్యక్రమాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో పెట్టుబడుల విషయంలో ఆచితూచి వ్యవహరించాలి. ఆర్థిక విషయాల్లో సన్నిహితుల సహకారం లభిస్తుంది. షాపింగ్ ఉల్లాసం కలిగిస్తుంది. 15,16 తేదీల్లో ఆరోగ్యం మెరుగుపడుతుంది. ఆత్మావలోకనం చేసుకుంటారు. ధార్మిక కార్యక్రమాల్లో పాల్గొంటారు. దీర్ఘకాలిక పెట్టుబడులకు అనుకూలం. 17,18,19 తేదీల్లో కొత్త ఆలోచనలు స్ఫురిస్తాయి. సంకల్ప సాధనకు అధికంగా శ్రమించాలి. రుణ ప్రయత్నాలు ఫలిస్తాయి.



## తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

వేడుకలు, శుభకార్యాలు, సినీ, రాజకీయ విషయాలు, ఆరోగ్య అంశాలకు ఈ వారం అనుకూలం. బుధ, గురువారాల్లో వేడుకల్లో పెద్దల నుంచి మాటపడాల్సి వస్తుంది. వృత్తి, వ్యాపారాల్లో సన్నిహితుల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. 15,16 తేదీల్లో ప్రత్యర్థులపై విజయం సాధిస్తారు. వివాహాది శుభ కార్యాల్లో పాల్గొంటారు. పందాలు, పోటీల్లో విజయం సాధిస్తారు. 17,18,19 తేదీల్లో వారసత్వ విషయాలు లాభిస్తాయి. ప్రియతములతో దూరప్రయాణాలకు ఏర్పాట్లు చేసుకుంటారు. రాజకీయ, సినీ రంగాల వారు ఆర్థిక విషయాల్లో నిదానం పాటించాలి.



## వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, ఆరోగ్యం, స్పెక్యులేషన్లు, వేడుకలు, ప్రేమానుబంధాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో వృత్తిపరమైన సమావేశాల్లో పాల్గొంటారు. లక్ష్య సాధనకు ఆటంకాలు ఎదురయ్యే అవకాశం ఉంది. చర్చలు ఫలిస్తాయి. 15,16 తేదీల్లో వైద్యం, హోటల్, రిటైల్ రంగాల వారికి ప్రోత్సాహకరం. ఉద్యోగ, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. 17,18,19 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. వృత్తి, వ్యాపారాల్లో ఆశించిన లక్ష్యాలు సాధించేందుకు అధికంగా శ్రమించాలి.



## ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

వృత్తిపరమైన నిర్ణయాలు, ఆర్థిక విషయాలు, విద్య, ఆరోగ్య అంశాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో పొదుపు పథకాల విషయంలో ఆలోచించి నిర్ణయం తీసుకోవాలి. ప్రియతముల ఆరోగ్యం పట్ల శ్రద్ధ అవసరం. డిపాజిట్లపై మంచి ప్రతిఫలం అందుకుంటారు. 15,16 తేదీల్లో ప్రియతములకు సంబంధించిన ఒక సమాచారం ఉల్లాసం కలిగిస్తుంది. విద్యార్థులు లక్ష్యాలు సాధిస్తారు. వేడుకల్లో పాల్గొంటారు. ప్రయాణాలకు అనుకూలం. 17,18,19 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది. పెద్దల ఆరోగ్యం కొంత ఆందోళన కలిగిస్తుంది.



## మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

వేడుకలు, గృహోపకరణాలు సేకరణ, ఉన్నత విద్య, ప్రేమానుబంధాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో వివాహాది శుభకార్యాల్లో పాల్గొంటారు. భాగస్వామి వైఖరి ఆవేదన కలిగిస్తుంది. గృహారంభ, ప్రవేశాలకు అనుకూలం. 15,16 తేదీల్లో కుటుంబ సభ్యుల ఆరోగ్యం మెరుగుపడుతుంది. రియల్ ఎస్టేట్, గృహనిర్మాణ రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. రుణాలు మంజూరవుతాయి. 17,18,19 తేదీల్లో ఉన్నత విద్యా విషయాలకు అనుకూలం. సమావేశాలకు ఏర్పాట్లు చేస్తారు. రియల్ ఎస్టేట్, నిర్మాణ రంగాల వారికి కొంత నిరుత్సాహకరం.



## కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

వృత్తిపరమైన సమావేశాలు, కుటుంబ వ్యవహారాలు, బదిలీలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో వృత్తి, వ్యాపారాలకు సంబంధించి కీలక సమాచారం అందుకుంటారు. చర్చలు, సమావేశాల్లో నిదానం పాటించాలి. 15,16 తేదీల్లో శుభవార్త అందుకుంటారు. శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. చర్చలు, సమావేశాలు ఫలిస్తాయి. 17,18,19 తేదీల్లో పెట్టుబడులకు సంబంధించిన కీలక సమాచారం అందుకుంటారు. ఆర్థిక విషయాల్లో సన్నిహితుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది.



## మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

ఇంక్రిమెంట్లు, పెట్టుబడులు, విద్యా విషయాలు, ప్రేమానుబంధాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో పొదుపు పథకాలు లాభిస్తాయి. ప్రియతముల కోసం ఖర్చులు అధికం. విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. 15,16 తేదీల్లో వైద్యం, పరిశ్రమలు, సేవల రంగాల వారికి శుభప్రదం. వృత్తి, వ్యాపారాల్లో అదనపు ఆదాయం సమకూరుతుంది. విందుల్లో పాల్గొంటారు. 17,18,19 తేదీల్లో ఆర్థిక అంశాలకు సంబంధించిన సమావేశాలు ఫలిస్తాయి. శ్రీవారు, శ్రీమతి వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. స్పెక్యులేషన్లలో ఆచితూచి వ్యవహరించాలి.

# ఎలాంటి సినిమాలూ ఒప్పుకోలేదు

తన నటనతో అందరినీ మెప్పించిన ఆసిన్ ప్రస్తుతం పెళ్లయిన తర్వాత ఎలాంటి సినిమాలూ చేయట్లేదు. అయితే ఇటీవల కొందరు వ్యక్తులు ఆమె మళ్లీ సినిమాల్లోకి రానున్నట్లు పుకార్లు సృష్టిస్తు న్నారు. ఢిల్లీకి చెందిన వ్యాపారవేత్త రాహుల్ శర్మను వివాహం చేసుకున్న ఆసిన్, పెళ్లయిన తర్వాత నటనకు పూర్తిగా దూరంగా ఉన్నారు. ఇలాంటి వివా దాల నేపథ్యంలో తను పూర్తి వివరణ ఇచ్చింది. పెళ్లికాక ముందే తను అసైన్‌మెంట్లన్నింటినీ పూర్తి చేసినట్లు, అప్పుడు చెప్పిన విధంగానే పెళ్లయ్యాక ఎలాంటి కొత్త సినిమాలకూ సైన్ చేయలేదని చెబుతోంది ఈ అమ్మడు. అయినప్పటికీ ఆసిన్ కొత్త ప్రాజెక్ట్‌ల మీద సైన్ చేసిందని కోలీవుడ్ జనాలు కోడై కూస్తున్నారు.






ఉత్తమ చిత్రాలకు అవార్డుల ప్రకటన ఎంతో వినసొంపుగా ఉంటుంది. కానీ ఉత్తమ చెత్త చిత్రం, ఉత్తమ చెత్త నటుడు, ఉత్తమ చెత్త దర్శకుడు అంటూ అవార్డులు ప్రకటించడం వినడానికే విడ్డూరంగా ఉంటుంది. దాన్ని జీర్ణించుకోవడం కూడా కష్టమే! కానీ 'గోల్డెన్ ఖేల్' సంస్థ ఇలాంటి అవార్డుల్ని మనకి అలవాటు చేస్తోంది. ఈ సంస్థ యేటా ఇండియాలో తెరకెక్కించే సినిమాలలో ఉత్తమ చెత్త చిత్రాల్ని ఎంపిక చేసి అవార్డులు ప్రకటిస్తుంది. 2015లో గోల్డెన్ ఖేల్ అవార్డులకు ఎంపికైన

## ఉత్తమ చెత్త చిత్రం 'దిల్‌వాలే'



చిత్రాల వివరాలను ఈ సంస్థ వెల్లడించింది. షారుఖ్ ఖాన్ - కాజోల్ నటించిన 'దిల్‌వాలే' సినిమా గత యేడాది ఉత్తమ చెత్త చిత్రం అవార్డుకు ఎంపిక కాగా, సూరజ్ పంచోలి ఉత్తమ చెత్త నటుడు అవార్డుకు ఎంపి కయ్యాడు. 'హీరో' సినిమాతో ఇతగాడు బాలీ వుడ్‌లోకి ఎంటరయ్యాడు. 'ప్రేమ్ రతన్ ధన్ పాయో'లో నటించిన సోనమ్ కపూర్ ఉత్తమ చెత్త నటి అవార్డు కైవసం చేసుకుంది. ఈ చిత్రానికిగాను సూరజ్ బర్జాత్యాకు ఉత్తమ చెత్త దర్శకుని అవార్డుతో పాటు 'బస్ కీజియే బహత్ హోగయా'(చాలా చేశారు..ఇకనైనా ఆపండి) అవార్డు కూడా ఆయన్నే వరించడం విశేషం. మోస్ట్ ఇరిటేటింగ్ సాంగ్ అవార్డు కూడా ఈ సినిమా టైటిల్ సాంగ్‌కే దక్కింది. ఇలాంటి అవార్డులను ప్రకటించడం ఒక విశేషమైతే, ఈ అవార్డులను స్పోర్టివ్‌గానో, గుణపాఠంగానో భావించి ఆహ్వానించడం కూడా విశేషమే మరి!

## రిస్క్ తీసుకుంటున్న దిల్‌రాజు



ఈ ఉగాది సీజన్‌లో పవర్‌స్టార్ పవన్‌కల్యాణ్ సర్దార్ గబ్బర్‌సింగ్ సినిమా ఫీవర్ నడుస్తోంది. దీంతో రిస్క్ చేయడం ఇష్టంలేక మిగిలిన నిర్మాతలు తమ సినిమాల విడుదల వాయిదా వేసుకుంటున్నారు. కానీ దిల్ రాజ్ మాత్రం రిస్క్ చేస్తానంటున్నారు. విజయ్ హీరోగా నటించిన 'తెరీ' చిత్రాన్ని తెలుగులో 'పోలీసోడు'గా ప్రేక్షకుల ముందుకు తెస్తున్నారు. రాజారాణి తర్వాత అట్లీకుమార్ తెరకెక్కించిన ఈ సినిమా ట్రైలర్‌కు విపరీతమైన స్పందన రావడంతో దీనిపై భారీ అంచనాలే ఉన్నాయి. తన థియేటర్స్ తనకు ఉన్నాయన్న ధైర్యంతోనే రిలీజ్ చేయాలని డిసైడ్ అయ్యారట దిల్‌రాజు. అయితే పవన్‌కు పోటీగా సినిమా రిలీజ్ చేయడం రిస్క్ అని తెలిసినా 'కొన్నిసార్లు రిస్క్ చేస్తే గానీ ఫలితం పొందలేం, రిస్క్‌లు చేయడం నాకిష్టం అంటున్నారు దిల్‌రాజు.

## బాగా తెలిసొచ్చిందట

బాలీవుడ్‌లో సెన్సేషనల్ కాన్సెప్ట్‌తో సినిమాలు చేసే దర్శకుడు ఆర్. బాల్కి. ఎవరూ టచ్ చేయని డిఫరెంట్ కాన్సెప్ట్‌లంటే ఇష్టపడే దర్శకుడు. చీనీకమ్, పా చిత్రాలతో బాలీవుడ్‌లో సంచలనం సృష్టించాడు. వరుస మూడు సినిమాలు చేసింది అమితాబ్‌తోనే. కానీ భారీ అంచనాలతో రిలీజైన 'షమితాబ్' బాక్సాఫీస్ వద్ద బోల్తా కొట్టింది. ఈ ఫెయిల్యూర్ బాల్కిని తీవ్ర మనోవేదనకు గురి చేసింది. తనకు బాగా నచ్చిన కథ ప్రేక్షకులకు నచ్చకపోవడంతో ఆ పరాజయాన్ని జీర్ణించుకోవడానికి బాల్కికి చాలాకాలమే పట్టిందట. దాంతో సినిమాలు తనకోసం కాకుండా ప్రేక్షకుల కోసం తీయాలనే విషయం తెల్సొచ్చిందని అంటున్నాడు బాల్కి. ఆ బాధ నుంచి కోలుకుని బాల్కి తీసిన తాజా చిత్రం 'కి అండ్ క'. ఈ సినిమాకు మూవీ గోయర్స్ నుంచి మంచి మార్కులే పడుతున్నాయి.



# కల నిజమాయెగా... కోరిక తీరెగా...

-హర్షికా పునాచా

**టా**లీవుడ్‌ని ఏలుతున్న, ఏలిన కన్నడ భామలు చాలామందే ఉన్నారు. ఇప్పుడు ఆ జాబితాలో వచ్చి చేరింది మరో అపరంజి హర్షికా పునాచా. తెలుగు వారికి ఈ పేరు కొత్త కానీ, కన్నడిగులకు బాగా సుపరిచితమే! పర్‌ఫెక్ట్ ఫిగర్‌కి కేరాఫ్ అడ్రస్‌గా ఉండే హర్షికాకు తెలుగు వారన్నా తెలుగు సినిమాలన్నా చెప్పలేనంత ఇష్టం. తెలుగు సినిమాలో మెరవాలని ఎప్పటి నుంచో కంటున్న తన కల ఈరోజుకి నెరవేరింది అంటున్న హర్షికా పునాచా విశేషాలు ఆమె మాటల్లోనే.....

## పుట్టిందీ..పెరిగిందీ...

కర్నాటకలోని కొడగు జిల్లాలోని ఓ చిన్న గ్రామంలో పుట్టాను. అమ్మానాన్నకి నేను ఒక్కదాన్నే. చిన్నతనం అంతా హ్యాపీ హ్యాపీగా సాగిపోయింది. స్నేహితులు చాలామందే ఉన్నారు. చదువుకునే రోజుల నుంచీ ఉన్న స్నేహితులు ఇప్పటికీ కలుస్తూనే ఉంటారు. చిన్నతనంలోనే సినిమాల్లో అవకాశం రావడం మా పేరెంట్స్‌కి సంతోషాన్ని కలిగించినా, చదువు ఆగిపోతుందేమో అని భయపడ్డారు. చదువు కంటిన్యూ చేస్తానని ప్రామిస్ చేసిన తరువాత ఒప్పుకున్నారు. ఇప్పుడు నాతో పాటు వాళ్ళూ హ్యాపీనే.

## అనుకోకుండా వచ్చిన అవకాశం

చిన్నతనంనుంచీ నటిని కావాలని ఎప్పుడూ అనుకోలేదు. బాగా చదువుకోవాలి, మంచి ఉద్యోగం చేయాలి అన్న ఆలోచనే ఉండేది. ఓసారి స్నేహితులతో కలిసి కాఫీ డేకి వెళ్ళాను. అప్పుడు అక్కడికి వచ్చిన ఓ డైరెక్టర్‌గారు నన్ను చూసిన వెంటనే సినిమాలో నటిస్తావా? అని అడిగారు. మొదట షాక్ తిన్నాను. నేను సినిమాల్లో నటించడం ఏమిటి? అనిపించింది. వెంటనే ఏ సంగతీ చెప్పలేకపోయాను. ఓ రెండు రోజులు ఆలోచించిన తరువాత ఓకే చెప్పాను. ఆ విధంగా కాఫీ డే నా జీవితాన్ని, నా కెరీర్‌ని మార్చేసింది. ఆ తరువాత కన్నడంలో స్టార్ హీరోలతో నటించాను.

## ఇబ్బంది అంటే...

చాలాసార్లు షూటింగ్‌కీ, చదువుకీ లింకు కుదిరేది కాదు. స్కూల్లో, కాలేజీలో పర్మిషన్ అడిగి షూటింగ్‌లకి అటెండ్ అయ్యే

దాన్ని. అలాగే పరీక్షలున్నప్పుడు షూటింగ్‌కి డుమ్మాకొట్టి వాటిని పూర్తిచేసేదాన్ని. కెరీర్‌నీ, చదువునీ బ్యాలెన్స్ చేసుకుంటూ వచ్చానే తప్ప చదువుని ఎప్పుడూ నిర్లక్ష్యం చేయలేదు. గత సంవత్సరం ఇంజనీరింగ్ పూర్తి చేశాను. నేను ఇంజనీరింగ్ పూర్తి చేయాలన్నది మా పేరెంట్స్ కోరిక. వారి కోరిక మేరకు ఇంజనీర్ అయ్యాను. చదువు పూర్తయిన వెంటనే ఒక కంపెనీలో జాబ్‌లో జాయినయ్యాను. సగం రోజులు ఉద్యోగం, సగం రోజులు సినిమా షూటింగ్ అనే ఒప్పందం మీద చేరాను. కానీ ఎక్కువ రోజులు చేయలేకపోయాను. ఉద్యోగాన్నీ, సినిమాల్నీ కలపడం కష్టం అని తెలిసింది. దాంతో ఆ ఉద్యోగాన్నీ వదులుకున్నాను.

**ప్రత్యేకించి శిక్షణ...**

అనుకోకుండా సినిమాల్లోకి రావడంతో నటనకు సంబంధించి ప్రత్యేకించి శిక్షణ తీసుకున్నది లేదు. సినిమాల్లోకి వచ్చిన తరువాతే చాలా విషయాలు నేర్చుకున్నాను. దర్శకులు ఎలా చెబితే అలా చేసుకుంటూ పోతున్నాను. డ్యాన్స్‌ల విషయానికి వస్తే, దీనికీ ఎలాంటి శిక్షణా తీసుకోలేదు. కాకపోతే డ్యాన్స్ అంటే ఇష్టం కావడంతో పెద్ద కష్టం అనిపించడంలేదు. కన్నడంలో నేను నటించిన సినిమాలు మంచి పేరే కాకుండా అవార్డులు కూడా తెచ్చిపెట్టాయి. రాష్ట్ర ప్రభుత్వం తరఫున నంది అవార్డు, ఫిలింఫేర్ అవార్డును గెలుచుకున్నాను.

**ఎప్పటి నుంచో కంటున్న కల....**

కన్నడ సినిమాలో నటిస్తున్నప్పట్నించీ తెలుగులో సినిమా చేయాలనీ, తెలుగు తెర మీద నన్ను నేను చూసుకోవాలన్నది నా కల. అందుకే తెలుగు భాష నేర్చుకున్నాను. మాట్లాడగలను కూడా. తెలుగులో నేను చేసే సినిమాలకి నేనే డబ్బింగ్ చెప్పుకోవాలనుకున్నాను. అందుకే పట్టుపట్టి తెలుగు నేర్చుకున్నాను.

**కుటుంబ నేపథ్యం ఉన్న సినిమా ఎందుకు చేశానంటే....**

'అప్పుడలా.. ఇప్పుడిలా' ఒప్పుకున్న సమయంలో చాలా మంది నన్ను భయపెట్టారు. తొలి సినిమానే కుటుంబ నేపథ్యం ఉన్న సినిమా చేస్తున్నావు. గ్లామర్ రోల్ ఉన్న సినిమా చేయవలసింది అన్నారు. నా సినిమాను కుటుంబ సభ్యులందరూ కూర్చుని చూడాలన్నదే నా కోరిక. అందుకే ఈ సినిమా ఒప్పుకున్నాను. ఓ మంచి సినిమా ద్వారా తెలుగు వారికి పరిచయం కావాలని కలలు కన్నాను. ఆ కల ఈ సినిమా ద్వారా తీరింది. భాష తెలిసి ఉండడంతో తేలికగా చేయగలిగాను. ఈ సినిమాలో హీరోకి ఎంత ప్రాముఖ్యం ఉంటుందో, నాకూ అంతే ప్రాముఖ్యం ఉంటుంది. ఈ పాయింట్ నాకు బాగా నచ్చింది. ఈ సినిమాకే డబ్బింగ్ చెబుదామనుకున్నా, కానీ కొద్దిగా జంకాను. రెండవ సినిమా నుంచి తప్పకుండా నాకు నేనే డబ్బింగ్ చెప్పుకుంటాను.



**తెలుగు సినిమాలంటే పిచ్చి...**

నేను కన్నడ అమ్మాయినే అయినా తెలుగు సినిమాలంటే చాలా ఇష్టం. దాదాపు తెలుగు హీరోల సినిమాలన్నీ చూస్తుంటాను. ముఖ్యంగా మహేష్ బాబు సార్, పవన్ కల్యాణ్ సార్ సినిమాలంటే చాలా ఇష్టం. వీరిద్దరి సినిమాలు ఒకటికి రెండు సార్లు చూస్తుంటాను. వీరిద్దరి సినిమాల్లో చిన్న పాత్ర వచ్చినా వదులుకోను. ఒక్క సెకను కనిపించినా చాలని అనుకుంటున్నాను.

**తెలుగులో అవకాశం ఎలా వచ్చిందంటే....**

నిర్మాత ప్రదీప్ కుమార్ జంపా గారు మా కుటుంబానికి బాగా పరిచయం. ఈ సినిమా అనుకోగానే ఆయన నన్ను అడిగారు. దర్శకుడు విష్ణుగారు కథ చెప్పగానే ఓకే చెప్పేశాను. సీనియర్ యాక్టర్లు నరేష్, సుమన్‌గారితో చేయడం మరిచిపోలేని అనుభూతి. హీరో కూడా బాగా చేశాడు.

**తెలుగులో ఇంకా ఏవీ అంగీకరించలేదు....**

ఈ సినిమా తరువాత తెలుగులో ఏ సినిమా ఒప్పుకోలేదు. కథలు అయితే వింటున్నాను. ఈసారి గ్లామర్ పాత్ర చేయాలని ఉంది. తమిళంలో ఓ సినిమా ఒప్పుకున్నాను. కన్నడంలో రెండు సినిమాలకు ఓకే చెప్పాను. మరో రెండు సినిమాలకి ఓకే చెప్పవలసి వుంది.

**బాలీవుడ్‌లో....**

ఏ నటికి అయినా బాలీవుడ్‌లో చేయాలన్న కోరిక ఉంటుంది. ఆ కోరిక నాకూ ఉంది. కాకపోతే తెలుగులో దొరికినట్టు మంచి ప్లాట్‌ఫాం దొరికితే తప్పకుండా అక్కడ కూడా చేస్తాను. ఇంత వరకూ ఎవరూ నన్ను అప్రోచ్ కాలేదు.

**గ్లామర్‌గా కనిపించడమంటే....**

ఇష్టమే. గ్లామర్ పాత్రల ద్వారానే యూత్‌కి దగ్గరవుతాం. అలాగని అసభ్యంగా కనిపించమంటే మాత్రం ఒప్పుకోను. అలాగే ఇంటిమేట్ సీన్లకి కూడా! అవసరం ఉన్నా లేకపోయినా లిప్ లాక్‌లు, బెడ్‌రూం దృశ్యాలు అంటే మాత్రం చేయడం కష్టమే!

**రూమర్లు వింటూంటే నవ్వొస్తుంది**

ఈ ఫీల్డులో ఇవి చాలా సహజం. కొన్ని వింటున్నప్పుడు భలే నవ్వొస్తుంది. తమిళ సినిమాలో నేను లిప్‌లాక్ సన్నివేశంలో నటించానంటూ ప్రచారం జరిగింది. అసలు ఆ సినిమా నేను చేయనేలేదు. నేను చేయని సినిమాలో నా లిప్‌లాక్. ఇంతకన్నా నవ్వొచ్చే జోక్ ఉంటుందా? అనిపిస్తుంది.

-చిన్ని



## ఆ ఆఫర్ టెంప్ట్ చేసిందట!

**టా**లీవుడ్‌లో మోస్ట్ వాంటెడ్ హీరోయిన్ ఎవరు అంటే టక్కున రకుల్‌ప్రీత్‌సింగ్ పేరే గుర్తుకు వస్తుంది. ఇక్కడ కెరీర్ పీక్ స్టేజ్‌లో ఉండగానే రకుల్ దృష్టి కోలీవుడ్‌మీద పడింది. గత కొన్నిరోజులుగా కోలీవుడ్‌లో పాగా వేయడానికి రకుల్ ప్రయత్నిస్తూనే ఉంది. ఆ ప్రయత్నాలు ఎట్టకేలకు ఫలించాయి. పెద్ద హీరోతో నటించే ఛాన్సే కాకుండా రెమ్యునరేషన్ కూడా భారీగా ఉండడంతో టెంప్ట్ అయిపోయి వెంటనే ఓకే చెప్పేసిందట! కాకపోతే కథ గురించిన వివరాలు ఇంకా వినలేదట! విశాల్ సరసన అనగానే ఓకే చెప్పేద్దామని డిసైడ్ అయిపోయిందట! కథ ఏమన్నా కానీ, విశాల్ పక్కన ఛాన్స్ రావడమే గొప్ప అని రకుల్ భావిస్తోందని ఆమె సన్నిహితులు అంటున్నారు. అయితే రకుల్ మొదట సినిమాలు చేసిందే కోలీవుడ్‌లో. అక్కడ చేసిన రెండు సినిమాలు ఫెయిల్ కావడంతో టాలీవుడ్‌లోకి వచ్చింది. అప్పుడు అనుభవరాహిత్యంతో చేసిన సినిమాలు ఫట్ అయ్యాయి. ఇప్పుడు ఇంత అనుభవం ఉన్నా, హీరో, రెమ్యునరేషన్‌ని చూసి సినిమా చేయడం ఎంత వరకూ సమంజసమని ఆమె సన్నిహితులు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు.



# ఇంటర్వ్యూ

# ఉచిత నట శిక్షణాలయ స్థాపనే లక్ష్యం

## -దేవదాస్ కనకాల

**నటుడు, దర్శకుడు, నటకుటుంబ పెద్ద దేవదాస్ కనకాల. కమెడియన్‌గా, సపోర్టింగ్ నటుడిగా వంద చిత్రాల్లో నటించారు. గొప్ప నటుల్ని తీర్చిదిద్దడమే లక్ష్యంగా సహధర్మచారిణితో కలిసి యాక్టింగ్ స్కూల్‌కు అంకితమైన గురువు. రజనీకాంత్ సహా ఎందరో నటుల్ని తీర్చిదిద్దారు. ఉచిత నట శిక్షణాలయస్థాపనే తన అంతిమ లక్ష్యమంటున్న దేవదాస్ కనకాల ఇంటర్వ్యూ....**

తూర్పుగోదావరిజిల్లా యానాం శివారు కనకాల పేట మా ఊరు. నాన్న పాపయ్య. అమ్మ మహాలక్ష్మి.

కోలంక గ్రామంలో 9 వరకు చదివా. యానాంలో టెన్త్, ఎస్సెస్సెల్సీ, కాకినాడలో పిఠాపురం మహారాజా కాలేజీలో పియుసి చేశాను.

### పూనాలో యాక్టింగ్ కోర్సు

విశాఖపట్నంలో బి.ఏ చదువుతూ ఆంధ్రా విశ్వ విద్యాలయంలో యాక్టింగ్ కోర్స్ డిప్లొమాలో డిస్టింక్షన్‌లో పాసయ్యాను. తర్వాత పూనా ఫిలిమ్ ఇనిస్టిట్యూట్‌కి వెళ్ళా. అక్కడ యాక్టింగ్ కోర్స్ పూర్తి చేసిన 1968 బ్యాచ్ విద్యార్థిని.

### బుద్ధిమంతుడు

సాక్షి రంగారావు నా క్లాస్ మేట్. పూనా నుండి మద్రాసు వచ్చి ఆయన రూమ్‌లో ఉండేవాణ్ణి. ప్రముఖ ఫిలిమ్ జర్నలిస్టు వాశిరాజు ప్రకాశం నా మిత్రుడు కావడంతో సినిమా రంగంపై అవగాహన ఉండేది. ముళ్ళపూడి వెంకటరమణ, బాపుగార్లు 'బుద్ధిమంతుడు' సినిమా సన్నాహాల్లో ఉన్న సమయంలో సాక్షిరంగారావు నన్ను వారికి పరిచయం చేశారు. ఆ చిత్రంలో అక్కినేనిగారి స్నేహితుడిగా వేషం ఇచ్చారు. అదే నా మొదటి చిత్రం. టాటా వీడుకోలూ గుడ్ బై ఇంక సెలవు... అంటూ ఘంటసాల పాట ఆ రోజుల్లో సూపర్ హిట్. నేను, విజయచందర్, సుబ్బారావు, మరొకరు (పేరు గుర్తులేదు ముత్యాలముగ్గు సినిమాలో మృదంగం వాయించే పాత్ర చేశారు) నటించాం.

### సాంగ్ అండ్ డ్రామా డివిజన్

ఢిల్లీ కేంద్ర కార్యాలయంగా హైదరాబాద్‌లో స్థాపించిన సాంగ్ అండ్ డ్రామా డివిజన్‌కు మొట్టమొదట నేను, రాళ్ళపల్లి, ఫిలిమ్ డైరెక్టర్ సత్యనారాయణ రాజు, బుర్రకథ కళాకారుడు బెనర్జీ, లక్ష్మీదేవి, మీనా కుమారి (స్టేజీ ఆర్టిస్టు) సెలక్టయి 1970-1973 ప్రాంతంలో అక్కడ పనిచేశాం.

### ఓ సీత కథ

వాశిరాజు ప్రకాశం గారి ఆహ్వానంతో నేను తిరిగి మద్రాసు చేరుకున్నాను. ఆయన ద్వారా నాకు విశ్వనాథ్‌గారి పరిచయం కలగడంతో 'ఓ సీత కథ' చిత్రంలో అవకాశం వచ్చింది. అందులో తాగుబోతు పాత్ర. నాకు అంతగా సంతృప్తి లేనప్పటికీ ఆ సినిమాలో నటన నా సినీ జీవితాన్ని మలుపు తిప్పింది. ఆ చిత్రంలో నా పాత్ర హైలైట్ అని ప్రకాశం గారు, విశ్వనాథ్‌గారు ప్రశంసించారు. ప్రేక్షకులకు గుర్తుండి పోయేలా ఆ పాత్రను మలిచారు వారు. మంచి భవిష్యత్తు ఉందని అందరూ అనడంతో ఎలాగైనా ఏదోఒకటి సాధించాలనే పట్టుదల పట్టాను. 'ఓ సీత కథ' విడుదలైన తర్వాత వారం రోజులపాటు దినపత్రికలన్నీ కొత్త గాలి వీస్తోంది, నటనలో అతిథి నటులొస్తున్నారు జాగ్రత్త, రాటుదేలిన నటులొస్తున్నారు జాగ్రత్త... అని నన్ను అభినందిస్తూ పత్రికలు ఎన్నో వార్తలు ప్రచురించాయి.

ఆ తర్వాత సిరిసిరిమువ్వ, ప్రేమబంధం, సీతామహాలక్ష్మి, న్యాయంకోసం, అడవిదివిటీలు, గోరింటాకు, మౌనం లాంటి ఎన్నో చిత్రాల్లో నటించాను. అన్నీ జనాదరణ పొందాయి. నా పాత్రకు ప్రేక్షకుల నుండి ప్రత్యక్షంగా స్పందన వచ్చేది.

### దర్శకత్వం

నిజం, చలిచీమలు చిత్రాల ద్వారా మంచి దర్శకునిగా నాకు పేరు వచ్చింది. చలిచీమలు చిత్రంలో నూటొక్క జిల్లాలకు అందగాణ్ణి అనే డైలాగ్ నూతన ప్రసాద్ నట జీవితానికే టర్నింగ్ పాయింట్. అలాగే శివకృష్ణ బాగా నటించేవాడు. వర్మ ప్రొడ్యూస్ చేసిన 'నాగమల్లి', నవతాకృష్ణం రాజుగారి చిత్రం 'ఓ ఇంటి భాగోతం' నా దర్శకత్వంలో వచ్చినవే.

### నంది అవార్డులు

'డామిట్ కథ అడ్డం తిరిగింది' అనే దూరదర్శన్ సీరియల్‌కు కథ, కథనం, నిర్మాణం అన్నీ నావే. ప్రేక్షకులు బాగా ఆదరించారు. దీనికి అయిదు నంది అవా

ర్థులు రావడం నాకెంతో గర్వకారణం. వీరేశలింగం గారి రాజశేఖర చరిత్రను బుల్లితెరకు అందించాను. విద్యార్థులు నా సీరియల్ చూసిన పరిజ్ఞానంతో ఆ సబ్జెక్ట్ పరీక్షలు రాసి ఉత్తీర్ణులయ్యారు. అదీ ఆ సీరియల్ గొప్పతనం.

**ఫిలిమ్ ఇనిస్టిట్యూట్ టీచర్**

మద్రాసులో దక్షిణభారత చలనచిత్ర వాణిజ్య మండలి (ఎస్ఐఎఫ్‌సిసి)లో తమిళనాడు ఫిలిం అండ్ టెలివిజన్ ఇనిస్టిట్యూట్ ఉండేది. అక్కడ తమిళ నటులకే శిక్షణ ఇచ్చేవారు. కె.విశ్వనాథ్, కె.బాలచందర్, డి.వి.యస్.రాజు, బి.యన్.రెడ్డి, మధుసూదనరావు, కె.యస్.ప్రకాశరావు, సి.యస్.రావు, పి.పుల్లయ్య తదితర పెద్దలు అక్కడ విజిటింగ్ లెక్చరర్లు. తెలుగువారికి కూడా ఫిలిం ఇనిస్టిట్యూట్ ఉండాలని వీళ్ళంతా నిర్ణయించారు. రాజారామదాసుగారు దానికి ప్రిన్సిపాల్. నాకున్న అర్హతల్ని బట్టి ఆయన కోరిక మేరకే నేను అక్కడ లెక్చరర్‌గా చేరాను.

**ఎందరో నటుల్ని పరిచయం చేశా**

'కన్నె వయసు' మలయాళ చిత్రానికి ఎస్.పి.ఆంజనేయులుగారు తెలుగులో నన్ను హీరోగా అనుకున్నారు. కానీ నాకు తగ్గ రోల్ కాకపోవడంతో నా స్థానంలో ఇంజనీరింగ్ విద్యార్థిని హీరోగా సిఫార్సు చేశాను. అలా ఎందరినో పరిచయం చేశాను. ఎందరో విద్యార్థుల్ని నటులుగా తయారు చేసి యాక్టింగ్ కోర్స్ పూర్తి చేయించాను. వారిలో రజనీకాంత్, నారాయణరావు, రాజేంద్రప్రసాద్, అంకినీడు ప్రసాద్ (సిరిసిరి మువ్వ చిత్రంలో విలన్) ఉన్నారు.

**ఫిలిమ్ ఇన్‌స్టిట్యూట్ సక్సెస్**

బి.యన్.రెడ్డిగారు, పుల్లయ్యగారు మరికొంత మంది ఈ ఫిలిమ్ ఇనిస్టిట్యూట్ బోర్డు సభ్యులు. ఎన్టీఆర్, ఏఎన్నార్, శివాజీగణేశన్, సావిత్రిలాంటి వాళ్ళని చూసిన కళ్ళతో మా విద్యార్థుల్ని చూసి వీళ్ళేం నటులవుతారని పెదవి విరిచారు. కానీ ఆర్నెల్ల తర్వాత నారాయణరావు, రజనీకాంత్, రాజేంద్ర ప్రసాద్ లాంటి నటులంతా తమ నటనతో వారిని మెప్పించారు. దీంతో మన ఫిలిమ్ ఇనిస్టిట్యూట్ సక్సెస్ అవుతుందని వాళ్ళందరికీ ధైర్యం వచ్చింది. ఈ కృషిలో నా భార్య లక్ష్మీదేవి కూడా తోడుగా ఉండేది.

రజనీకాంత్, నారాయణరావు, శుభలేఖ సుధాకర్ లాంటివాళ్ళందరికీ అంతులేని కథ, శుభ సంకల్పం చిత్రాల్లో బాలచందర్, విశ్వనాథ్‌గారు అవకాశ మిచ్చారు. తొలి యత్నంలోనే ఆ నటులంతా సక్సెస్ అయ్యారు. రాజేంద్రప్రసాద్ లేడీస్ టైలర్‌తో సక్సెస్ అయ్యారు.


నవ్య వీక్లీ చదువుతూ...


భార్యతో...

**విలువలతో రాజీపడలేదు**

రికమెండేషన్ క్యాండిడేట్స్‌ను తీసుకోకూడదనే ఫిలిమ్ ఇనిస్టిట్యూట్ బోర్డు సభ్యుల నిర్ణయానికి విరుద్ధంగా డివిఎస్ రాజుగారు పేర్లకి చుక్కలుపెట్టి పంపేవారు. ఈ సారికి కానిచ్చేయండి అని ఆయన సర్ది చెప్పారు. దాంతో నేను 1975లో లెక్చరర్ పదవికి రాజీనామా చేశాను.

**హైదరాబాద్‌లో నట శిక్షణ**

హైదరాబాద్‌లో ఆంధ్రప్రదేశ్ థియేటర్ ఇనిస్టిట్యూట్ రిపర్టర్ ప్రారంభించాం. ఎ.ఆర్.కృష్ణ ఛైర్‌పర్సన్. సతీసమేతంగా రమ్మని కబురు పంపడంతో ఇద్దరం వచ్చి చేరాం. మధుసూదనరావుగారు 1984లో మధు ఫిలిమ్ ఇనిస్టిట్యూట్ ప్రారంభించారు. విద్యార్థులకు శిక్షణ ఇవ్వడంతోనే సరిపోవడంతో నేను సినిమాల్లో నటించలేకపోయాను. ఆహుతి ప్రసాద్, అచ్యుత్, శివాజీరాజా, రామ్‌చరణ్, కామేశ్వరి, సూర్య మధు ఇనిస్టిట్యూట్‌లో నా దగ్గర శిక్షణ పొందినవారే.

1985లో ఫిలిమ్ అండ్ టెలివిజన్ ఇనిస్టిట్యూట్ ఆంధ్రప్రదేశ్‌ను స్థాపించాం. అనిల్, సునీల్, కాళికేయ ప్రభాకర్, సమీర్, అల్లరి నరేష్, మంచుమనోజ్ ఇలా ఎందరికో ఈ సంస్థలో మెళకువలు నేర్పి తీర్చిదిద్దాం.

చిత్ర పరిశ్రమ నన్నెప్పుడూ ప్రోత్సహించింది. విద్యార్థులకు శిక్షణ ఇవ్వడం ద్వారానే ఏదైనా సాధించగలనని, నెంబర్ వన్ స్థానంలో ఉండగలనని నిరూపించి శిక్షణా సంస్థ నిబంధనలకే కట్టుబడ్డాను. ఆ విధంగా నాకన్నా గొప్పగా చేయగల నటుల్ని, దర్శకుల్ని గుర్తించానన్న ఆత్మసంతృప్తి నాకుంది.

**ఉచిత స్కూల్ స్థాపనే లక్ష్యం**

కళాకారులకు ఉచిత భోజన సదుపాయాలతో కూడిన, ఫీజులు లేని ఒక ఫిలిమ్ ఇనిస్టిట్యూట్‌ను శాశ్వత ప్రాతిపదికపై స్థాపించాలని తపిస్తున్నాను. అవసరమైతే నా విద్యార్థుల్ని పేరుపేరునా కలిసి సంస్థ నిర్మాణానికి కృషి చేయాలని ఉంది. ఒకవేళ నేను లేకపోయినా నా విద్యార్థులు నా ఈ చిన్న కోరిక తప్పక నెరవేరుస్తారన్నది నా ప్రగాఢ విశ్వాసం.

**హేట్సాఫ్ టు రాజమౌళి**

రాజమౌళి ఈ తరంలో సాలిడ్ పర్‌ఫెక్ట్‌మేన్. ఈనాటి దర్శకులు, నటులు ఆయన్ను ఆదర్శంగా తీసుకుంటే బాగుంటుంది. ప్రతిసన్నివేశాన్నీ అందంగా మలిచి దానిలోని ఎమోషన్ వ్యక్తీకరించే షాట్స్ ఉన్న దర్శకుడు. నా అభిమాన దర్శకుడు రాజమౌళికి హేట్సాఫ్. మహానటి సావిత్రి అంటే నాకు మహాఅభిమానం. ఆవిడతో నటించలేకపోయాననే బాధ నాలో ఉంది.

**రజనీకాంత్ సహృదయం**

నటశిక్షణ పొందే సమయంలో రజనీకాంత్‌ని ఒక స్టూడెంట్ అన్ని విధాలా ఆదుకునేవాడు. అదేవిధంగా రజనీకాంత్ ఫీజుల్ని రాజారామదాసు గారు కట్టేవారు. ఆ తర్వాత రజనీకాంత్ ఆయన పిల్లల్ని తన ఖర్చుతో అమెరికాలో చదివించాడు. తనను ఆదుకున్న స్టూడెంట్ కుటుంబాన్ని కొన్ని సంవత్సరాలు పోషించాడు. ఒక యోగ్యుడికి సమయానికి సహాయం చేస్తే అది పదింతలై తిరిగొస్తుందన్నది నా కళ్ళారా చూసిన సత్యం. ఇది నా జీవితంలో మరువ లేని సంఘటన.

**కల్పనాశక్తి పెరగలేదు**

ఈనాడు సినిమా పరిశ్రమ వ్యాపార ధోరణిలో సాగిపోతోంది. డబ్బుసంపాదనే ధ్యేయం తప్ప ప్రేక్షకులు ఆదరిస్తున్నారా? సకుటుంబంగా చూస్తున్నారా? అనే ఆలోచనలేని చిత్రాలొస్తున్నాయి. ప్రేక్షకులు పెరిగినా, కొద్దిమంది తప్ప దర్శకుల్లో కల్పనాశక్తి పెరగడం లేదు. కొత్తదనాన్ని ఆహ్వానించడంలేదు. బహుశా సామాజిక అవగాహన లోపించిందనుకుంటా. నటులు కూడా కాల్‌షీట్ అయిపోయింది అనే సంతోషంతో ఉంటున్నారే తప్ప నటన ప్రావీణ్యత, సంభాషణా దోషాలు పట్టించుకోవడంలేదు.

**ఉత్తమనటి, జీవిత సహచరి**

నేను సాంగ్ అండ్ డ్రామా డివిజన్‌లో పని చేస్తున్నప్పుడే 1971 నవంబరు 21న లక్ష్మీదేవితో నా వివాహం జరిగింది. బిఏ బిఈడీ చదివి థియేటర్ ఆర్ట్స్‌లో డిప్లమో చేసిన నటి. అనేకసార్లు ఉత్తమ నటి అవార్డులు అందుకున్న స్టేజీనటి. నాతోపాటే విద్యార్థులను తీర్చిదిద్దుతూ నాకు వెన్నుముకలా నిలిచింది. నిజంగా ఆమె నా పాలిట లక్ష్మీదేవే. మాకు ఇద్దరు పిల్లలు. అబ్బాయి రాజీవ్ కనకాల. కోడలు సుమ. నా కుమార్తె శ్రీలక్ష్మి. రాజీవ్‌కనకాల సమర్థుడైన భావి నటుడు. కోడలు సుమ గురించి మాట్లాడితే జగమెరిగిన బ్రాహ్మణునికి జంధ్యమేలా అన్న సామెతలా ఉంటుంది. నా కుమార్తె శ్రీలక్ష్మి అగ్నిపూలు సీరియల్‌లో ముఖ్యపాత్ర పోషిస్తోంది.

-కె.హరనాథ్

9703542598

# ఇవన్నీ నిజాలే!

✡ నిజమైన సంస్కారవంతుడు తనకున్నవన్నీ కోల్పోయినా ఆవేశ పడడు.

-డాస్టోవ్‌స్కీ

•••

✡ ఫిలిప్పైన్స్‌లో 7,100 ద్వీపాలు ఉన్నాయి.

•••

✡ ప్రపంచంలో సగం జనాభా చైనా, భారత్, అమెరికా, రష్యా దేశాల్లోనే నివసిస్తున్నారు.

•••

✡ నెపోలియన్‌కి పిల్లులు అంటే చాలా భయం. దీనినే శాస్త్ర భాషలో ఐల్యూరో ఫోబియా అంటారు.

•••

✡ ఇటలీలో 1968లో జరిగిన ఎన్నికల్లో 73 రాజకీయ పార్టీలు పోటీ చేశాయి. ఇందులో ఒక పార్టీ పేరు 'చంద్రునిపై స్నేహితులు'. ఆ పార్టీ తరపున ఒకే ఒక అభ్యర్థి పోటీ చేశాడు.

•••

✡ ఆదివారంనాడు వెలువడే న్యూయార్క్ టైమ్స్ పత్రికను ముద్రించడానికి అవసరమైన ముడిసరుకు కోసం 63 వేల చెట్లు నరకాలి. అన్ని చెట్లు పెంచాలంటే 314 ఎకరాలు కావాలి.

•••

### గొప్పవాళ్ళు అంతేనేమో!

✡ విలియం షేక్స్‌పియర్, మైకేల్ డి సెర్వాంటెస్ ఇద్దరూ ప్రపంచ ప్రసిద్ధులైన రచయితలే. వీరిద్దరూ 1616 ఏప్రిల్ 23వ తేదీన ఒకే రోజు మరణించారు. వీరిద్దరికీ వ్యక్తిగత పరిచయం లేదు. రచయిత మార్క్‌ట్వెయిన్ 1835లో హేలీ తోకచుక్క భూమికి కనిపించినప్పుడు పుట్టాడు. అదే తోకచుక్క తిరిగి 1910లో కనిపించినప్పుడు మరణించాడు.

•••

✡ రాత్రిపూట మనకు కనిపించేవి మూడు వేల నక్షత్రాలు మాత్రమే. వీటిల్లో మనకు దగ్గరగా ఉన్న నక్షత్రం అల్ఫా సెంటారీ. భూమికి 4.3 కాంతి సంవత్సరాల దూరంలో ఉంది.

•••

✡ గ్రీకు తత్వవేత్త థాలెస్. గ్రీకులు ప్రకటించిన ఏడుగురు జ్ఞానుల్లో మొదటిస్థానం ఆయనదే. క్రీస్తుపూర్వం 624-546 మధ్య కాలంలో జీవించాడు థాలెస్. ఈ అనంత విశ్వం దేవుళ్ళ ప్రమేయం లేకుండా ఎందుకు ఉంటుంది? అని ఆయన ప్రశ్నించాడు. అలా ప్రశ్నించిన మొదటి వ్యక్తి ఆయనే.

•••

✡ అమెరికా కాంగ్రెస్ 1808లో చట్టబద్ధంగా బానిస వ్యాపారాన్ని నిషేధించింది. కానీ ఆ తర్వాత కనీసం మూడు లక్షల మంది నీగ్రో బానిసల్ని ఆఫ్రికా నుంచి అమెరికాకు తీసుకువచ్చారు వ్యాపారులు.

•••

✡ ప్రపంచ జనాభాలో అమెరికా జనాభా ఆరు శాతమే. కానీ ప్రపంచ వనరుల్లో 60 శాతం వాటా వారే అనుభవిస్తున్నారు.

-సౌభాగ్య

# నవ్య సుధామ పదగారడి-257

సెల్: 98492 97958

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | ■ | 3 | ■ | 4 | | 5 |
| | ■ | | ■ | | ■ | | ■ | |
| | ■ | ■ | 6 | | | 8 ■ | ■ | |
| ■ | ■ | 7 | ■ | ■ | ■ | 8 | ■ | ■ |
| 9 | 11 | | | ■ | 10 | | | ■ |
| ■ | ■ | 15 | ■ | ■ | ■ | ■ | ■ | ■ |
| 11 | | ■ | 12 | 13 | | 19 ■ | ■ | 14 |
| ■ | ■ | 15 | ■ | | ■ | 16 | ■ | |
| 17 | | | ■ | | ■ | 18 | | |

## ఆధారాలు

### అడ్డం

1. ఏది రాసినా ముందు ఇది చుట్టి మొదలెట్టడం కొందరి అలవాటు (3)
4. దశమి ముందు (3)
6. నవమి పందిళ్ళ పానీయం (3)
9. లంకాధిపతి (4)
10. ఆరు అడ్డం తోడిది శ్రీరామనవమి పందిళ్ల ప్రసాదం (4)
11. దేవళము (2)
12. ఆంజనేయుడు (3)
17. అటుగా కనిష్ఠ సోదరుడు (3)
18. రామపాదము సోకి రాతిరూపు వదిలినది (3)

### నిలువు

1. భూదేవి కాదు కానీ విష్ణుపత్నియే! (3)
2. మృత్తిక (2)
3. రాజుగారు చేసేది నేడు ప్రభుత్వాధినేతలూ చేసేది (3)
4. హాసము (2)
5. జనకుడి నగరం (3)
7. అత్యల్పము, మాత్రలో నాల్గవవంతు కాలము (3)
8. ఇబ్బంది (3)
11. సీతారామలక్ష్మణులను పడవతో దాటించినవాడు (3)
13. ఫాలము (3)
14. దశరథుని పెద్ద భార్య (3)
15. జానకి (2)
16. రాముడు సీతనుండి కోరిన పరీక్ష తలక్రిందయింది (2)

### పదగారడి-256 సమాధానాలు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ఉ | గా | ది | ■ | మ | ■ | కో | కి | ల |
| ■ | ర | ■ | జ | న్మ | ము | ■ | ను | ■ |
| అ | లు | సు | ■ | ధ | ■ | టో | క | రా |
| వ | ■ | మ | ■ | ■ | కూ | పి | ■ | జ |
| మా | ■ | ■ | ■ | ■ | ■ | ■ | ■ | పూ |
| న | ■ | కా | కి | ■ | ■ | అ | ■ | జ్య |
| ము | సి | లం | ■ | న | ■ | హో | మ | ము |
| ■ | ర | ■ | త | లం | టు | ■ | రి | ■ |
| ని | దా | నం | ■ | దా | ■ | పం | చాం | గం |

Printed and Published by **VEMURI RADHAKRISHNA,** Managing Director, on behalf of Aamoda Publications Pvt. Ltd., Plot No.76, Aswani Layout, Huda Heights, Jubilee Hills, Hyderabad-500 033. Ph.(040) 23558233/44, Fax No.23558288. Printed at Aamoda Press, R.S.No.191/3, Ward No.43, Donka Road, Patamata, Vijayawada 520 010, Reg.No.: APTEL/2004/12594. Editor: **A.N.JAGANNADHA SARMA**

# ఇండస్ట్రీలో దేనికైనా రెడీ!

## -కీర్తి సురేష్



**తొలి సినిమాతోనే టాలీవుడ్‌లో మంచి క్రేజ్ సొంతం చేసుకున్న మలయాళీ భామ కీర్తి సురేష్. రామ్ హీరోగా తెరకెక్కిన నేను శైలజ సినిమాతో తెలుగు ప్రేక్షకులకు దగ్గరైంది. అందరినీ తన నటనతో మెప్పించినా ఎందుకో ఆ తర్వాత ఎన్నో మంచి మంచి ఆఫర్లు వచ్చినట్లే వచ్చి చేజారిపోయాయి. ఇప్పుడు తాజాగా కోలీవుడ్, ఇటు టాలీవుడ్‌లలో మళ్లీ సినిమాలు చేజిక్కించుకుని రీఎంట్రీకి రెడీఅవుతున్న కీర్తి సురేష్‌తో**

### కుటుంబం గురించి

పుట్టింది, పెరిగింది చెన్నయిలోనే. నటన అంటే అవగాహన ఉన్న కుటుంబం. అమ్మ, నాన్న ఇద్దరూ సినీ ఇండస్ట్రీకి చెందిన వారే. అమ్మ మేనక, నటి. నాన్న సురేష్ కుమార్, ప్రొడ్యూసర్.

### చైల్డ్ ఆర్టిస్ట్‌గా..

ఐదవ తరగతి వరకూ నా చదువు చెన్నయిలోనే. కేరళ వెళ్ళాక 2000 సంవత్సరంలో చైల్డ్ ఆర్టిస్ట్‌గా నటించడం మొదలెట్టాను. అదికూడా మా నాన్న గారు నిర్మించిన చిత్రాల్లోనే చేశాను. అప్పట్లో అసలు నాకు నటన అంటే ఏంటో కూడా తెలిసేది కాదు. అందుకని అప్పుడే నాకెరీర్ స్టార్ట్ అయిందని చెప్పలేను.

### చదువు తర్వాతే సినిమా అన్నారు

తొమ్మిదో తరగతిలో ఉన్నప్పటి నుంచే సినిమా ఆఫర్లు వచ్చేవి. నాక్కూడా సినిమాలు చేయడం అంటే ఇష్టంగానే ఉండేది. సినిమాల్లోకి రావాలని మా పేరెంట్స్‌తో చెప్పినప్పుడు వాళ్లేమీ అభ్యంతరం చెప్ప లేదుగానీ చదువు తర్వాతే సినిమా అని చెప్పారు. అందుకే ఇంటర్మీడియట్ పూర్తయ్యే వరకూ ఆగి తర్వాత ఫ్యాషన్ డిజైనింగ్ కోర్స్ చేస్తూ సిని మాలు చేయడం మొదలు పెట్టాను. మొదటిసారి నేను హీరోయిన్‌గా పరి చయమైంది గీతాంజలి సినిమాతోనే.



### సెలక్షన్లో సహాయం చేస్తారా?

మా అమ్మానాన్నా నాతో పాటే సినిమా కథలు వింటారు. ఏది బాగుందో బాగాలేదో చెప్తారు. ఫైనల్ సెలక్షన్ మాత్రం నాఇష్టమే. కేవలం హీరోయిన్‌గా మాత్రమే ఉండాలనుకోవ ట్లేదు. కథ, నటన, డైరెక్షన్ ఇలా సినిమాకు సంబం ధించిన ప్రతీ పని నాకు చాలా ఇష్టం. దేన్నయినా చేయ డానికి రెడీగా ఉండాలను కుంటాను.

### డ్రీమ్ రోల్

భవిష్యత్తు గురించి ఆలోచించను. ఇప్పుడున్న పరిస్థితుల గురించి మాత్రమే ఆలోచిస్తాను. నాకు వచ్చిన క్యారెక్టర్ పర్‌ఫెక్ట్‌గా చేయడానికి ప్రయత్ని స్తాను. అలాగే విభిన్నమైన పాత్రలలో నటించడం ఇష్టం. క్వీన్ సినిమాలో కంగనా, మలయాళచిత్రం 'మర్యన్' లో పార్వతి లాంటి పాత్రల్లో నటించా లనేది నా కోరిక. ఫలానా డైరెక్టర్‌తోనే చేయాలనే ఉద్దేశాలు లేవు. కథ బాగుంటే ఏ దర్శకుడి చిత్రంలోనైనా చేయడానికి సిద్ధం.

### గ్లామర్

సినిమా అన్నప్పుడు అన్ని అంశాలు అందులో ఉండాలి. అయితే కేవలం గ్లామర్ ప్రధా నాంశంగా ఉన్న పాత్రలు చేయడానికి నేను ఇష్టపడను. నటనకు ప్రాధాన్యం ఉన్న పాత్రలంటే నాకిష్టం.

### ఫ్యూచర్ ప్రాజెక్టులు

ఇప్పుడు టాలీవుడ్‌లోనూ, కోలీవుడ్‌లోనూ వివిధ రకాల ప్రాజెక్ట్‌లమీద సైన్ చేశాను. తాజాగా సిద్దార్థ్‌తో నటించడానికి సైన్ చేశాను. హీరో విజయ్ 60వ సినిమాలో కూడా చేయబోతు న్నాను. ఇంకా రెండు మూడు ప్రాజెక్టులు పరిశీలనలో ఉన్నాయి.

-కె.రామకృష్ణ




అజంతా హోటల్ ఎదుట, కోటగుమ్మం,
రాజమహేంద్రవరము - 533101.
ఫోన్ : 0883 - 2462565
e-mail : mohanpublications@gmail.com

ఆధ్యాత్మిక గ్రంథనిలయం

# మావద్ద లభించు గ్రంథములు

## వ్రత కథలు - పూజలు

| | | | |
|---|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ. | 10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | | 30-00 |
| 5. | వరలక్ష్మీవ్రతం | | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | | 10-00 |
| 11. | వైభవలక్ష్మీవ్రతం ఫోటో యంత్రంతో | | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీవ్రతం (కామేశ్వరీపాటతో) | | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | | 30-00 |
| 18. | శివదీక్ష | | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | | 10-00 |
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | | 36-00 |

| | | |
|---|---|---|
| 31. | లక్ష్మీ - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

